

# పరిసరాలు

[ రెండవ భాగం ]



*17 గురు కథకుల 17 కథలు*

దేశోద్ధారక గ్రంథమాల

హైదరాబాదు

# పరిసరాలు

*17 గురు కథకుల 17 కథలు*

[ రెండవ భాగం ]



సంకలనం:

శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి



ప్రచురణ 23

దేశోద్ధారక గ్రంథమాల

3-5-1027, నారాయణగూడ, హైదరాబాదు.

# మనవి

ఇంతవరకు ఈ గ్రంథమాలద్వారా "ఉదయ ఘంటలు" గేయసంపుటిలో 56 గురు కవులను, "జీవనరంగం" ఏకాంక దృశ్యనాటికల ద్వారా 15 గురు రచయితలను పాఠకులకు పరిచయంచేశాం. "పరిసరాలు" ప్రథమ సంపుటిలో 17 గురు కథకులను పరిచయంచేశాం. 17 గురు కథకులను ఈ రెండవ సంపుటిలో పరిచయం చేస్తున్నాం. ఇదేవిధంగా రాబోవు ప్రచురణలలో పద్యరచయితలను, వ్యాసరచయితలను సంకలన సంపుటాల రూపంలో పరిచయం చేయదలచాం. ఈ విధంగా సారస్వతంలోని వివిధరంగాల్లో కృషిచేస్తున్న రచయితలను వారి రచనలద్వారా పాఠకులకు పరిచయం చేయాలని మా సంకల్పం. మా సంకల్పం మీడేరుటకై రచయితలు మాకు తోడ్పడుతున్నారు. అందుకు వారికి మా కృతజ్ఞత లందచేస్తున్నాం.

పాఠకులు గ్రంథమాలకు చందాలు, విరాళములు యిచ్చి హృదయపూర్వకంగా ఆర్థికసాయం చేస్తున్నారు. వారి ప్రోత్సాహమే నేటివరకును, ముందుముందును నిరాటంకముగా మా కర్తవ్యాన్ని నిర్వహించుటకు కారణమని మనవిచేస్తున్నాం.

హైదరాబాదు
20-4-56

విన్నవించు,
వట్టికోట ఆళ్వారుస్వామి
వ్యవస్థాపకుడు, ప్రకాశకుడు.

శ్రీ బి. రాజశేఖరరెడ్డి, శ్రీమతి లక్ష్మీసరోజినీదేవి



ఈ దంపతులు గ్రంథమాలకు రు. 100—0—0 లు విరాళం ఇచ్చారు. వీరికి మా గ్రంథమాలపక్షాన హార్దిక కృతజ్ఞతల నందజేస్తున్నాం.

"ముఖ్యముగా మన ప్రజల జీవితమునుండి కథలను సృష్టించవలెను. రచయితలు మొదట రసానుభూతిని పొందవలెను. ప్రజాజీవనమును తమ పాత్రలద్వారా ప్రతిబింబింప జేయవలెను. ఈరెంటిని దృష్టిలోపెట్టుకొని రచించిన కథలకు ఎన్నదగిన లోపముండనేరదు."

*కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి.*



# అబల

❖

శ్రీ శ్రీధర రామనాధశర్మ

జననం : 22–7–1928 విభవ అధిక శ్రావణ శుక్ల పంచమి.

చిరునామా : కరివెన పోష్టు : కర్నూలుజిల్లా.

కార్యకలాపాలు : వ్యవసాయము— కల్పనాకథలు.

అభిరుచి : హిందీ మాతృకలను తెనిగించుట. రాజకీయ విషయాలపై విమర్శ– కథానికలు వ్రాయుట. గేయాలు కూర్చుట.

రచనలు : ముద్రితం : దాదాపు నేటివరకు తెనిగించిన హిందీ కథానికలు ఇతరవిషయాలు, 25 టికి పైగా దిన, వార, పక్ష, మాసపత్రికలలో ప్రకటింపబడినవి.

అముద్రితం : —

అభిమాన రచయితలు : ప్రఖ్యాత ఆంధ్ర హిందీ, రచయితలంతా అభిమానులే.

# అ బ ల

డాక్టర్ రామారావు పట్నంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న గొప్ప వైద్యుడు. ఇరవై అయిదు ఏండ్లు నిండీ నిండకముందే ప్రాక్టీసు మొదలు పెట్టాడు. వివాహం విషయమై ఎక్కువ వత్తిడి గల్గించే దగ్గరి బంధువు లెవరూ లేకపోవడం వల్ల, అతని యిష్టప్రకారమే. ఒక మోస్తరు ఆదాయం వస్తున్నదనుకున్నప్పుడే, దాదాపు ముప్పై ఏండ్లు సమీపించినాక రూపవతియైన భాగ్యవతిని వివాహం చేసుకున్నాడు.

నూతన వధూవరులకు సంప్రదాయాలు నేర్పిస్తు, సాహచర్యాలు జరిపే ఆత్మీయులెవరూ లేకపోవడంవల్ల, స్వయంశక్తివలననే అన్ని విషయాలను అవగాహనచేసుకొని, సుఖంగ ఒకరినోట పడకుండ కాలం వెళ్ళబుచ్చుతున్నారు. ప్రకృతిలో ఒకొక చెట్టు ఒకొక ఋతువులో పూసి కాసి ఫలవంతమై అందరికీ ఆనందం కలిగించినట్టే, మానవులకు కూడ ఒకొక దశలో పట్టిందంతా బంగారమవుతుంది. ఆదశను ఎవరూ అడ్డలేరు. అడ్డినా అగదు. అలాంటి ఉత్తమ గ్రహస్థితిలోవున్న రామారావు ముట్టిందంతా మేలిమి అవుతున్నది. పందలాది వైద్యులు కాదని పంపిన వ్యాధి రామారావు చేతిన పడుతూనే, వెలుతురును చూచి పారిపొయ్యే చీకటిలాగ, అవుతుంది.

ఈ వ్యాధికింత డబ్బివ్వవలెనని ఆయన ఎన్నడూ అడిగి ఎరుగడు. బాధలో పది ఇచ్చేవారు సంతోషంలో ఇరవై ఇచ్చి వెళ్లుతారు. ఇదే ఆయన సిద్ధాంతం. అందువల్ల రోజుకురోజు కీర్తికాంతవెంట, ధనరాశి కూడ పెరుగుతూ వుంది. డాక్టరు ఐశ్వర్యాన్ని యశస్సునుచూచి అసూయ పడేవారు లేకపోలేదు. ఎందరు అసూయ పడినా ఫరవాలేదుగాని, భగ

వంతుడుకూడ అతనిపై కాస్త కినుక గల్గియున్నాడా అన్నట్టు, భాగ్యవతి ఎనిమిది సంవత్సరాలుగ కాపరంచేస్తున్న సంతానం మాటేలేదు. లోకులు పలుగాకులు అని ఎన్నడో అన్నారు. డాక్టరుగారికి సంతానం కలుగక పోవటానికి కారణం, 'భార్యాభర్తలు సుఖంగా వుండాలనే తలంపుతో, పిల్లాజల్లా ఝంఝాటం లేకుండ వుండవచ్చని, ఏదో మందో మాకో తీసుకొని ఇలా తయారైనారని' నలుగురు చాటుమాటుగ అనుకుంటున్నారు.

అలా అనుమాన పడుటలో ఎవరివిషయంలోనైన కాస్త నిజం వుంటే వుండవచ్చునేమోగాని, ఈ దంపతులపట్ల ఆవిధంగ అనుకోడానికి వీలులేదు. ఇంతకూ వారికేం తక్కువని ఆపనికిపూనుకోవాలి? దాదాపు లక్షరూపాయిలు విలువచేసే ఆస్తిపెట్టుకొని ఈ పాపిష్టికార్యానికై ఎవరైనా యత్నంచేస్తారా?

కొత్తగా వివాహమైన మొదటి మూడు నాలుగు సంవత్సరాలలో సంతానం విషయమై ఏలాటిసరదా లేకపోవచ్చునుగాని ఆ మీదట 'మృగశిర ప్రవేశంతో వర్షంకై ఎదురుచూచే రైతుబిడ్డవలె, పుత్రప్రాప్తికై ప్రాకులాడని భార్యాభర్త లెందరున్నారో కాస్త గుండెపై చేయివేసుకొని చెప్పమనండి చూద్దాం? అందులో అష్టైశ్వర్యాలు యుండి అష్టవర్షాలు గడచినా పున్నామనరకంలోంచి వైదొలగించే "పాప" లేకపోతే రామారావు భార్యాభర్తలు సుఖంగా వున్నారంటే ఎవరు నమ్ముతారు.

* * *

డాక్టరుగారి వయస్సు నాల్గవ పది సమీపించింది. జవసత్వాలు తగ్గుముఖం పట్టుతున్నా, ఆదాయం ఆ పరిస్థితికి రాలేదు. భాగ్యవతి మూడవ పదిలోనే ఉన్నది. బిడ్డలు కావాలనే కుతూహలం అయితే మనసులో ఉన్నదిగాని, దాన్నితీర్చే ఎవరికీ అందుబాటులో లేని మరోశక్తి ఆవిడ చేతిలో లేదుగదా! భర్త అప్పుడప్పుడు అసంతృప్తిగ అగుపిస్తున్నాడంటే, దానికికారణం ఆవిడకు తెలియందేమీ లేదు.

ఆ అసంతృప్తిని సంతృప్తి దశకు తీసుక రావాలంటే తన చేతిలో ఏమీలేదు. అయినా సంతానం కలుగకూడదనే భగవన్నిర్ణయాన్ని మార్చే మరొక శక్తి మానవులలో ఉన్నది. అదేమంటే, ఎవరినైన దగ్గరతీసి, అంతా వారికి కట్టబెట్టడము. గాలికిపోయే పేలపిండి కృష్ణార్పణమస్తు. అంతకన్న చేసేదేముంది? ప్రస్తావన వశాత్తు ఒకనాడు భార్యా భర్తలు ఎవరినైనా దగ్గరి వారిని తెచ్చుకొని ఇంట్లో వుంచుకోవడము మంచిదనుకున్నారు. అయితే ఇరుపైపులా దగ్గరివారనుకునే వారెవరూ లేరు. కడకు గాలించి గాలించి డాక్టరుగారి వంశానికి సంబంధించి, చాల దూరంలో యుండి ఆయనకు తమ్ముడి వరుస అయ్యే రఘునాధాన్ని తీసుకవచ్చారు.

రఘునాథం అప్పటికే మెట్రిక్యులేషన్ ప్యాసయ్యాడు గనుక, పై తరగతులు చదువుకోడానికి వీలుగ వుంటుందని తల్లిదండ్రులు కూడ త్వరగా ఇష్టపడినారు. ఎట్టికి పోయినట్టు, చుట్టాల చూచినట్టు జరిగి నన్నాళ్లు చదువు జరుగుతుంది, ఆమీదట ఆస్తి ఇచ్చారా మరీ మంచిదే; లేకపోతే ఖర్చులేకుండా అంతకాలం అన్ని వసతులు జరుగనే జరుగుతవి గదా?

తమ్ముడైనా కొడుకైనా రఘునాథమే అనే భావంతోటే డాక్టరున్నాడు. భాగ్యవతి గూడ భర్త అభీష్టమే తన ఇష్టంగ రఘునాథాన్ని ప్రియంగ దగ్గరతీసి ఎలాంటి లోపం రాకుండ చూస్తున్నది. ఎన్నాళ్లగానో ఉవ్విళ్ళూరుతూ వరదానానికై ఎదురు చూస్తున్న ఆ దంపతులు రఘునాథం పాదప్రవేశంతో కాస్త తృప్తి నొందారు.

ఆస్పత్రిలో రోగులరద్దీ ఎంతవున్నా ఇంట్లోంచి 'అన్నయ్యా' అనే పిలుపు వినవచ్చేప్పటికి ఎక్కడివారి నక్కడ వదలి ఒక్క దూకులో లోపలికి వెళ్ళి అతనికేమి కావాలో కనుక్కొని చిటుకల మీద సమకూర్చేవాడు. తిరిగి ఆస్పత్రిలోకి వచ్చి, అతనేమి అడిగాడో, దాన్ని తానెలా సమకూర్చాడో నలుగురితో చెప్పేవాడు. అత్యంత అభిలష

ణీయమైన వారి విషయంలో మంచి జరిగినా, చెడ్డ జరిగినా, నలుగురితో చెప్పుకుంటేగాని ఆత్మ సంతృప్తి యుండదు. ఇప్పటికి కొందరు తండ్రులు, అతి ప్రియంగ పెంచుకున్న తమ పిల్లల గుణగణాలను పొగడుతూ, 'మావాడు నన్ను తిక్కముండావాడా అని అంటాడండీ.' అని చెప్పి పరమానంద భరితులగుట చూడడం లేదా ? ఆ సంతోష మనేది అలా చేస్తుంది. అంతకన్న ఏమీలేదు. కొత్త బిచ్చగాడు పొద్దు ఎరుగనట్లు, కొత్తగా తమ్ముడిని సంపాదించుకొన్న రామారావు అతని చర్యలను ఎప్పుడు పడితే అప్పుడు నలుగురికి చెప్పి ఆనందించేవాడు. వినటానికి ఇష్టమున్నా లేకున్నా కార్యార్థులై వచ్చినవారు గనుక తలలూపి డాక్టరుగారి ఉత్సాహంలో భాగస్వాము లయ్యేవారు,

* * * *

రఘునాథం రెండు సంవత్సరాలపాటు అతి శ్రద్ధగ చదివి ఇంటర్ ప్యాసయ్యాడు, బి. యస్. సి. చదివి డాక్టరు కోర్సుకు పోతానని అన్న య్యతో చెప్పాడు. రామారావుకు గూడ అదే ఆలోచన వుండింది. తాను తగ్గిపోయేప్పటికి తమ్ముడు పెరిగివచ్చి తన స్థానాన్ని ఆక్రమించాలని కుతూహలపడి అందుకు సమ్మతించాడు. అయితే భాగ్యవతి మరో ఆలోచన అందుకు జోడించి భర్తను, రఘునాథాన్ని అందుకు ఆమోదింప జేసింది. 'ఇంతదాక మనకెట్లాగు సంతానం లేనేలేదు. తమ్ముడికైనాత్వరగా వివాహం జరిపినామంటె అతగాడికైన రెండు కాయలు కాస్తె తమ వారిగ చూచుకొని ఆనందించవచ్చు. అదీగాక డాక్టరు కోర్సుకు రఘునాథం వెళ్ళిపోయాడంటే మరల ఇద్దరం బిక్కుబిక్కు మనుకుంటూ పడియుండ వలసిందేగదా, అలా గాకుండా రాబొయ్యే రఘునాథం భార్య జతగా వుంటుంది. ఆపైన దేవుడి దయవల్ల మూడు తలకాయలయ్యా యంటే ఇంకేం కావాలి ?'

డాక్టరు రామారావుగారి తమ్ముడికి పిల్లనిచ్చేవారికేం కొదువ. ఆస్పత్రిలో ఒకనాడు మాటవరసకు తమ్ముడికి ఈ ఏడాదిలో వివాహం చెయ్యాలని ఉన్నది అన్నాడు. అక్కడ ఆయన తమ్ముడికి పిల్లనిచ్చే అధికారం గలవారులేకపోయినా, ఆమాట మోసుకపోయి యోగ్యతగలవారి చెవినవేసే వారు మాత్రం తప్పకుండ వుండనే వుంటారు. ఇంకేం. వారం తిరుగకముందే జాతకాలున్నవి కొన్ని, లేనివి కొన్ని ఫొటోలతోసహా కవర్లను పోస్టు జవాన్ పట్టుకొచ్చి ఇస్తున్నాడు. జాగ్రతగ వాటిని పరిశీలించి వచ్చేవాటికై ఎదురు చూస్తున్నాడు రఘునాథం. డాక్టరుగారి ఆస్తి అంతా వరుడికే దక్కుతుంది గనుక ఎవరి అదృష్టం ఎలా వుంటుందోయని ప్రతివారు రఘునాథాన్ని అల్లుడుగా పొందాలని ప్రయత్నిస్తున్నారు. అందులో దమ్మిడీ కట్నం తీసుకోకుండ చేసుకో దలచుకుని, అమ్మాయి బాగుంటే చాలు అనుకున్నాడు గనుక పిల్లగల తండ్రులంతా గట్టిగ పని చేస్తున్నారు.

కడకు వందకు పైగా అందిన ఫొటోలలోంచి ఒక అమ్మాయిని ఏరుకొని పెండ్లి మాటలకు రావలసిందిగా కోరారు, రెండు మూడు నెలలలోనే వివాహం ముగించడానికి ఇరు పక్షాలవారు నిర్ణయించుకున్నారు. వరకట్నం వద్దన్నంత మాత్రాన ఆ పేరుతో గాకుండ మరో రూపంలోనైన అంతకు పైగానే వరుడికి ముట్టజెప్పక మానుతారా? డాక్టరుగారు కూడా పెండ్లికూతురికి అన్ని తరహాలైన ఆభరణాలు చేయించి పెట్టాలనుకున్నాడు. ఇంతకన్న తన జన్మలో తాను చేసేదేముందని, త్యాగం చూపించి నలుగురూ ముక్కుపై వ్రేలు వేసుకునేట్టు చేయడానికి ఇంతకన్న సుఅవసరం మరెప్పుడు దొరుకుతుందని, పిల్లనిచ్చే వారి కథ ఎట్లున్నా తాను మాత్రం పది పదిహేనువేలు ఖర్చు చేయాలని నిశ్చయించుకున్నాడు.

బాణాసంచా తయారుచేసేవారు ఇంటిచుట్టు తిరిగి పోతున్నారు. కొత్తగ బెనారస్‌నుంచి బెంగుళూరునుంచి సరుకు దిగుమతి అయిందని, చాల రోజులు ఆగదని త్వరగ వచ్చి కావలసిన మంచి సరుకు తీసుకపో వలసిందిగా బట్టల అంగళ్ళవారు, గుమాస్తాలను డాక్టరుగారింటి చుట్టు తిప్పుతున్నారు. మైసూరు మహారాజాగారి సత్రంలో పదేండ్లు వంటవారిగా వున్నామని, నెలక్రిందటి దాక తిరుపతి సత్రంలో దేవతారాధన వంటకాలంతా తమ చేతిమీదుగ తయారవుతుండినవని, పెండ్లిలో పదార్థాలు చేయడానికి తమకు ఆర్డరివ్వవలసిందిగా వంటలవారు చెప్పులరిగేట్టు తిరుగుతున్నారు.

* * * *

సుముహూర్త దినం ఒక నెలరోజులు మాత్రమే మిగిలింది. మన మొకటి తలిస్తే దైవ మొకటి తలవక తప్పదుగదా ! ఆ మహా మహిమ ముందు మానవత్వం ఏమీ చేయలేదు, ఎందుకూ పనికిరాదు. రామారావు ప్రక్క ఊరికి విజిటుకై వెళ్ళి వస్తుంటే దారిలో కారు లారీతో ఢీకొన్నది. ఫలితం డాక్టరు ఆస్పత్రిలో మరణ శయ్యపై రోజులు లెక్క పెడుతున్నాడు. భాగ్యవతి రఘునాథంల కండ్లు కాల్వలై పారు తున్నవి. పడకకు ఇరువైపులా ఇద్దరూ కూర్చొని తదేక దీక్షగ రామా రావు మొహంవైపే చూస్తున్నారు. రెండు రోజులుగ అతనికి స్మృతి రాలేదు. ఘనవైద్యు లెంత ప్రయత్నించినా ఫలితం దైవాధీనంగానే ఉన్నది. బాధగా శయ్యపై ఉన్నవాడు 'ఊ....ఊ....ఊ' అంటు ఒక వైపుకు కదిలాడు. ఆరిపోతున్న దీపానికి ఆముదంవేసినట్లై భాగ్యవతి రఘునాథంలు ఒక్కసారిగ నిలిచారు.

డాక్టరు రామారావు మెల్లిగ కండ్లు తెరచి 'భా....గ్యం....' అంటూ ఆవిడ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. 'ర....ఘూ....' అంటూ మరో చేతిని దగ్గరికి వంగియున్న రఘు నెత్తిన వుంచాడు.

"ఏమండీ....ఎలా ఉన్నదీ" అన్నది భాగ్యవతి దుఃఖాన్ని దిగ మ్రింగుతూ.

"ఏమీ....లేదు....నా....తర్వా....త....రఘు....క....ధ....?"

"రఘు విషయం మీరాలోచించకండి .... కొడుకుగానే .... వుంటాడు" భాగ్యవతి నోరునిండుకొచ్చింది.

"కొడు....కు....గా....చూచు....కుంటా....వు....కదా?....అంతే కావల....సింది....?"

"తప్పకుండా...."

రఘునాథం ఇంతసేపు మౌనంగా ప్రతిమలాగ నిలచి అన్నయ్యను తీసుకపోయే యమదూతలను చూస్తున్నాడు.

* * *

వివాహానికి తయారుజేసిన సామగ్రి అంతా డాక్టరుగారి అంత్య క్రియలకై వినియోగం జరిగింది. అతను పెండ్లి నెంత ఘనంగ చేయ దలచుకొని యుండెనో అంతకు రెండింతలుగా అతని కర్మకాండే జరిగి పోయింది. ఏనుగ చచ్చినా బ్రతికినా వకటె అన్నట్లు, పెద్దవారు బ్రతికి నప్పుడు ఎంత వైభవాన్ని వెలిగిస్తారో చచ్చినా, వారసులు వారికంతగా చేయవలసిందే. అలా చేయకపోతే నలుగురు 'వాడికేం పొయ్యేకాలం వచ్చిందీ, సంపాదించిందంతా వెనకేసుకొని, సంపాదించినవాడిపేర నలు గురికి అన్నం పెట్టలేకపోయాడు' అని మొహమాటం లేకుండా అనే స్తారు. ఇంతకూ డాక్టరుకు ఏం తక్కువని ఆమాట అనిపించుకుంటారు. భాగ్యవతి, రఘునాథంలు హృదయంవిప్పి అన్ని పనులు చేశారు.

డాక్టరు చనిపోయింది మొదలుగ భాగ్యవతి తనగది వదలిరావడం లేదు. రఘునాథమే అన్నిపనులు చూచుకుంటున్నాడు. దాదాపు పాతిక సంవత్సరాల ఈడు గలవాడు. అతనికి మంచీచెడ్డా అన్నీ తెలిసే వయస్సే

గనుక ఇతరుల సహాయం ఎక్కువ లేకుండానే సంసారం నడుపుకుంటున్నారు. అయినా భాగ్యవతి చెవిన వేయంది ఏపని జరిపేవాడు కాదు.

రామారావు చనిపోయిన మొదట్లో వర్షఋతువులో ప్రవహించే వాగువలె ఎడతెరపిలేకుండ భాగ్యవతి కండ్లు దుఃఖంతో పారుతుండినవి. ఋతువులు మారేకొద్ది వాగుల ప్రవాహవేగం తగ్గుతూ కడకు ఒక బొట్టు నీరుకూడ లేకుండ అయినట్లు భాగ్యవతి దుఃఖంకూడ దినదినానికి తగ్గుముఖం పట్టింది.

ఒకనాడేదో విషయమై అడగటానికి రఘునాథం ఆమె గదిలోకి వచ్చి మాట్లాడు తున్నాడు. అతడొచ్చిన పని ముగించుకొని తిరుగు ముఖం పట్టగానే భాగ్యవతి "రఘూ!" అన్నది.

అతడు వెనుదిరిగిచూచి నిలిచి "ఏమమ్మా" అన్నాడు.

"నీకు పిల్లనిస్తానన్న వారినుంచి జాబు ఏమైనా వచ్చిందా?"

"ఆ! రాకేం? వారానికి రెండు వస్తూనే ఉన్నవి. అన్నింటిని బుట్టదాఖలా చేస్తున్నాను"

"ఏం. ముహూర్తం ఎప్పుడు చేయాలంటున్నారు?"

"మన బాధ మనకుంటె, మధ్యనవాళ్ళ దొక గొడవ....ఈ నెలలో చేస్తారట."

"ఇంతవరకూ నాకు చెప్పలేదే....జరిగిందేదో జరిగింది. కానియ్యిపోయినవారు వస్తారా?"

"కాకిపోయినా నాకిప్పుడిప్పుడే వివాహం చేసుకోవడం ఇష్టంగా లేదు....ఒకటి రెండేండ్లు ఆగితేగాని....నేనేమి చేయలేను."

"అంతమూరం వాళ్ళను ఆగమనటం ధర్మమా?"

"ఆగటాని కిష్టంలేకపోతే మరెక్కడైన చూచుకోమని వ్రాస్తాను."

"ఏమో, నీవు అన్ని తెలిసిన వాడివి. నీ బాధ్యత నీవెరుగకపోవు."

జవాబేమీ చెప్పకుండ రఘునాథం గదిలోంచి వెళ్ళిపోయాడు.

భాగ్యవతి రఘునాథం సమక్షంలో ఇంతసేపు ఎన్నడూ ఇటీవల మాట్లాడి యెరుగదు. ఐశ్వర్య వంతుల ఇంట్లో అన్ని వసతులు యుంటు, శరీరారోగ్యం కల్గిన ఇరవై అయిదేండ్ల యువకుడు కండ్ల పండుగగా యుండదా ?

భాగ్యవతితనలో 'ఊ....మా రఘు మంచిఅందగాడే!' అనుకున్నది.

రఘునాథం తన పట్టుదల వదలకుండ వివాహాన్ని దూరంగ విసిరి వేశాడు. అది ఇప్పట్లో దగ్గరికి రానంత దవ్వుకు పోయి పడింది. ఒక విధంగ పిల్లనిచ్చేవారు కూడ ఈ సంబంధం మానుకున్నట్లుంది. అలా కావడానికి రఘు ఒక మంచి బైరాగి చిటక ప్రయోగించాడు. 'మీ అమ్మాయిని నిర్ణయించుకున్నప్పటినుంచి మాకు అష్టకష్టాలు ఆరంభమై కడకు తల్లిపేరునే తొలగించినది' అని ఇక బుద్ధివుంటే ఆ ఆడబిడ్డ కల వారు ఈ యింటికి పిల్ల నిస్తారా ?

* * * *

డాక్టరు గతించిన గత మూడేండ్లుగ రఘునాథం ఆయన వస్తువుల నంతా వినియోగించు కుంటున్నాడు. అంతవాడు అయినందున ఆయన వస్త్రాలు వాహనాలు ఇతనికి సరిపోతున్నవి. తాను త్వరలో డాక్టరు గావాలని ఉబలాటపడి అతి శ్రద్ధగ చదువు సాగిస్తున్నాడు.

స్త్రీకి యాభై ఏండ్లదాకా సంతానం పొందే శరీర దార్ఢ్యం వుంటుందని అందరికీ తెలుసు. అంటే దాదాపు అంతవరకు కామ క్రోధాలు నశించవనే అర్థం చెప్పుకోవచ్చు. ఆ మీదట ఆరవపది పడిం దంటె కామం నశించవచ్చునేమో గాని, క్రోధం మాత్రం దినదిన ప్రవర్ధమానమై ఇంట్లోవారందరికి చీదరింపు గల్గిస్తుంది.

భర్త చనిపోయేప్పటికి ముప్పై అయిదు సంవత్సరాలకు లోపుగ యున్న భాగ్యవతి హృదయంలో కామవాంఛ నశించక పోవడానికి

కారణం లేకపోలేదు. భర్త దుస్తులను రఘునాధం వేసుకొని తిరుగుతూ యుంటే డాక్టరులాగే అగుపిస్తాడు. అందులో భోగభాగ్యాలతో తులతూగే సంసారంలో చేదు తినేది ఏమీలేదు. ఉప్పు కారం తింటున్న శరీరం చపలానికి లోనుగాక తప్పదు గదా! ఇదీగాక మరో లోక వాడుక కూడ గలదు. 'సంతానం కల్గని యువతికి కామవాంఛ కమ్మిగాదు' యని. ఆ మహదవకాశం లభించని భాగ్యవతి నాడు బాధగా కాలం గడిపింది. నేటికీ గడుపుతూనే ఉన్నది.

రఘునాధం భర్త ఉడుపుల్లో కనిపించాడంటె నివురు గప్పిన నిప్పువలె యుండె కామాగ్నిని, నివురు తొలగించి ఎవరో మంటచేయ యత్నించినట్లు ఆమె హృదయంలో బాధ జనించేది, కాని విధికృతం ఎలా తప్పుతుంది. అనుభవించక తప్పదుగదా!

భాగ్యవతి వయస్సు నలభైకి లోగానే! ఈ వయస్సులో భర్తగల మిగతావారెలాగున్నారో తన కండ్లముందు అగుపిస్తూనే ఉన్నారు. నెత్తినిండ పూలు దురుముకొని, కండ్లకు కాటుక పెట్టుకొని, మొహాన బొట్టు సరిచేసుకొని, తమాషా అయిన చీరె రవిక తొడిగి, సాయంత్రం తన యింటిముందునుంచి, భర్తలను వెనకేసుకొని షికార్లకు పోయే పత్నులను చూస్తుంటే నిద్రాణమైయున్న ఆవిడ 'ఉద్దేశ్యం' హుంకరించు కొని బయటి కొస్తుంది. డాక్టరు గతించిన దాదిగ పై మెరుగులు ఎరు గని ఆ శరీరం, పోగొట్టుకున్న దానికై ప్రాకులాడుతున్నట్లుంది. చీకట్లొ చేతులు తడుముతున్నది. కాని చేతికి పాము తగులుతుందో, పండు తగులుతుందో ఎవరి కెరుక.

చలనంగల ఆ హృదయానికి చంచలం గలిగింది. ఒకనాటి రాత్రి తన గదిలో ఎవరూ చూడకుండ, నెత్తిదువ్వి పూలుపెట్టుకొని బొట్టు దిద్దుకొని అద్దంముందు నిల్చొని తన ప్రతిబింబాన్ని చూచుకొన్నది. ఆ బింబంముందు ఏ నవ వధువు పనికొస్తుంది. దాదాపు నాలుగు సంవత్స

రాలుగ నిల్చుకొన్న బ్రహ్మచర్య తేజస్సు. ఎండకన్నెరుగని శరీరచ్ఛాయ. తీర్చి దిద్దినట్లున్న శరీర నిర్మాణం.—"నిజంగా నేనింత అందంగా ఉన్నానా?".... అద్దమెరుగని ఆ మొహంలో ఆనందం ప్రస్ఫుట మైనది. అయితే ఇదంతా అడవిగాచిన వెన్నెల కావలసిందేనా?....కాకపోతే ఏమవుతుంది మరి....ఈ ఇల్లు ఈ అలంకరణాలు ఎందుకూ పనికిరాకుండ పాడవవలసిందేనా?....అయినా నా తిక్కగాని....అలా ఎందుకవుతుంది. రఘునాథం వివాహం చేసుకుంటే అతని భార్య వినియోగించవచ్చుగా,.... ఇంతకూ రఘునాథం ఎవడని....అతనిభార్య కివన్నీ అందియ్యవలసిం దేనా?....రఘునాథమూ, నాకు దూరమైనవాడేగా....పైగా ఆయన భార్య నాకు మరికొంత దూరమైనది అవుతుంది....ఆమె అనుభవిస్తుయుంటె చూస్తువుండేదెట్లాగ...."

యవ్వనవంతుడై స్ఫురద్రూపియైన రఘునాథం, కామాంధకారం లోకి పోతున్న భాగ్యవతికి వెలుగుగా అగుపిస్తున్నాడు. రఘునాథాన్ని తనవైపు లాక్కోవాలని చూస్తున్నది. అయితే భర్తతో 'కొడుకు'గా చూచుకుంటానని చెప్పినమాట పదేపదే శూలమై హృదయంలో నాటు కుంటున్నది.

అయితే భర్త చనిపోయేముందు అతనికి మాట యిచ్చినపుడు, 'విధవగ బ్రహ్మచర్యవ్రతం పూనడం ఇంతకష్టంగ వుంటుందనిమాత్రం ఆమెకేం తెలుసు. అందులో నవమన్మధుడంటివాడిని ఎదురుగా పెట్టు కొనా? నిప్పుముందు నెయ్యి వుంచితే ఏమయ్యేది ఆయనకుమాత్రం తెలియవద్దూ. వూరికె చెబితే సరిపోతుందా?'

రఘునాథం లక్ష్యం కేవలం చదువుపై తప్ప మరెక్కడా లేదు. భాగ్యవతి ఇటీవల అతిచనువుగా యుండుటచూచి భర్త గతించినందుకు గల్గిన దుఃఖం కాస్త తగ్గినందుకు హృదయాన్ని స్తిమిత పరచుకోడానికై అలా ప్రవర్తిస్తున్నదని అందులో ఆవిడకు మట్టుకు తనుదప్ప మరెవ్వరు

ఆత్మీయులున్నారనుకున్నాడుగాని అంతకుమించి అతనికేమి తెలియదు. తెలుసుకో ప్రయత్నించనూ లేదు.

ఆవిడచేష్టలు శృతిమించిరాగానపడి హృదయం ఏటిగడ్డ చెట్టులాగ ఎప్పుడు పాపప్రవాహంలో పడి కొట్టుకపోతుందో తెలియకుండావుంది.

ఆనాటిరాత్రి ఆకాశమంతా మేఘావృతమై ఉన్నది. కన్నుపొడుచుకున్నా ప్రక్కవాడగుపించడంలేదు. మధ్యమధ్యన పాపపుహృదయంలో మంచి అగుపించినట్లు, మెరుపులు మెరిసి లోకానికి వెలుతురును రుచి చూపిస్తున్నవి. ఉరుములు చెవులు తూట్లు పడేట్టు వినిపిస్తున్నవి. రఘునాథం లైటు వెలుతురులో చదువుకుంటూ పక్కపై పడుకున్నాడు. భాగ్యవతి గదిలో ప్రవేశించి "రఘూ....నాకు చాల భయంగ వుంది....ఈరాత్రి చాల భీకరంగా వుంది...." అన్నది. "అలా అయితే వంటిగా అక్కడెందుకు, నా గదిలోకివచ్చిపడుకో అమ్మా?"

"అందుకే వచ్చాను!" అంటూ భూమిపై పడకవేసుకొని నడుం వాల్చింది. రఘునాథం పరీక్షలు దగ్గర పడుతున్నవి గనుక రాత్రి చాల పొద్దుపోయేవరకు పుస్తకం మూయలేదు. పుస్తకంమూస్తూనే కన్ను మూతపడింది. అంగట్లో కండ్లకెదురుగాయుండే మిఠాయికొనలేకపోయినా, కనీసం ఆ సుగంధాన్నైనా తనివితీర పీల్చి తృప్తిపడే బికారివలె, భాగ్యవతిగూడ, పడకపై పడుకొని గాఢంగ నిద్రపోతున్నట్లు నటిస్తు గట్టిగవూపిరి తీసుకుంటున్నది. కాని మనసు పరిపరివిధాల కట్లుతెంచుకొని పోతున్నది.

లైటు వెలుతురులో నిండుకుండలాగ తొణకకుండ నిద్రపోతున్నాడు రఘు. భాగ్యవతి పడకపైనుంచిలేచి నలువైపులా చూచింది. నిశ్శబ్దంతప్ప మరేమి అక్కడలేదు. పిల్లివలె చప్పుడుగాకుండ పాదాలు వేస్తు అతని పడకముందుకుపోయి నిలిచింది. ఆహా!...ఏమా దివ్యసుందర విగ్రహం. ఇరవై సంవత్సరాలకు పూర్వం శోభనపు గదిలో డాక్టర్ రామారావు పడుకున్నట్టుగ అగుపించాడు. పండుబారిన ఆకు చిన్నగాలికి

కూడరాలిపోతుంది. కామాతురులనుకూడ చిన్నదృశ్యం అధఃపతితుల జేస్తుంది. గౌరవ కుటుంబీకుడు, కొత్తగ మధుశాలకు పోతున్నట్లు తటపటాయిస్తున్న భాగ్యవతి హృదయానికి మోహావేశంముందు, మంచీచెడూ ఆలోచించే హృదయస్థైర్యం గాలికి లేచిపోయింది. విజయం పొందిన కామదేవత విశృంఖలంగా ఉన్నది. ఇక ఆ కామస్వరూపిణిని పట్టేదెవరు?

భాగ్యవతి రఘుముఖంపై తనముఖ ముంచుతున్నది. ఇంతలో 'భాగ్యం....' అన్నగొంతుక వినిపించింది. ఎవరది?....చిరపరచితమైన ధ్వనిగానే వున్నదే, అనుకుంటూ ఒక్కసారిగ వెనక్కు తిరిగి చూచింది....

డాక్టర్ రామారావు రూపం కిటికీ వూచలకవతలగ నిలిచి 'ఇలారా?' అని పిలుస్తున్నది....భాగ్యవతికి తెలియకుండానే, శరీరం వెనక్కు తిరిగి అడుగులు ముందుకు వేస్తున్నది. మరోసారి కిటికీ అవతలి రూపం 'భాగ్యం....రఘును ఎలా చూచుకుంటానన్నావు?' అన్నది.

ఆవిడకు తెలియకుండానే హృదయం "కొడుకుగా!" అన్నది.

"అలా అయితే ఇదేంపని....నన్ను విడిచి నీవు వంటిగా వుండలేవుగాని....నావెంటరా" అన్నదా రూపం.

"నిజమే మిమ్ముల విడిచి....వుండలేను....వస్తున్నా....వస్తున్నా."

* * * *

మరురోజు ఉదయం కీర్తిశేషులైన డాక్టరు రామారావుగారి ఇంటి ముందుకు జనం తండోప తండాలుగా చేరుతున్నది. ఎదురుగా వస్తున్న ఒకాయన ఇలా అంటున్నాడు. "పాపం! కొడుకుగా రఘును చూచుకొంటూ వుండే భాగ్యం రామారావుగారికి లేకపోయినా, భాగ్యవతికైనా ఆయోగం వుండ కూడదా? రాత్రి మేడమీదనుంచి క్రిందపడి తలపగిలి చనిపోయింది.

ఎందుకు చనిపోయిందో, ఎలా చనిపోయిందో రఘుకు నేటికి కూడ తెలియదు. తెలియక పోవడమే మంచిదేమో!





# అశ్రుతర్పణం

❖

శ్రీ సింగరాజు లింగమూర్తి

---

జననం : 1922 అక్టోబరు 8

చిరునామా : E. 2–101 చిష్టీచమన్ కార్వాన్ పోష్టు హైద్రాబాదు.

కార్యకలాపాలు : ప్రభుత్వోద్యోగం, పత్రికలకు, రేడియోకి రచనలు చేయడం, సాంస్కృతిక సమావేశాలలో పాల్గొనడం.

అభిరుచి : సాహిత్య విమర్శ, కథారచన.

రచనలు : ముద్రితం : 1. అంజలి. (జాతీయగీతాలు)
2. చిరు తరగలు. ( పిల్లల కథలు )
వివిధ పత్రికలలో కథలు, గేయాలు, నాటికలు, వ్యాసాలు.

అముద్రితం : 1. రాగవల్లరి. (నవల) 2. ఆభిజాత్యం (నవల) 3. లచ్చిమనసు (గీతాలు) 4. కథానికలు గేయాలు.

అభిమాన రచయితలు : 1. కీ. శే. అడవి బాపిరాజు. 2. కొడవటిగంటి కుటుంబరావు. 3. ఛకోవ్. 4. ముల్కరాజ్ ఆనంద్. 5. 'ఉదధి'. 6. చిల్లర భావనారాయణరావు. 7. దాశరథి కృష్ణమాచార్యులు. 8. ఉత్పల సత్యనారాయణాచార్యులు.

# అశ్రుతర్పణం

నడుస్తూ నడుస్తూవున్న శ్యామలరావు చటుక్కున ఆగిపోయి వెనక్కి తిరిగి చూసి, మళ్ళీ ముందుకు అడుగు వెయ్యబోయాడు. "మిమ్మల్నేనండీ" అంటూ ఒక ఇరవై—ఇరవైరెండేండ్ల యువతి అతణ్ణి సమీపించింది. శ్యామలరావు అప్పటికీ ఇంకా తనను కాదేమోనని ఆశ్చర్యంతో అలాగే ఆమెవంక చూస్తూ నిలబడ్డాడు. "అలా చూస్తారేం.... పదండీ" అంటూ ఆమె అతని ప్రక్క ప్రక్కనే నడుస్తున్నది. శ్యామల రావును సంభ్రమాశ్చర్యాలు ముంచెత్తాయి. "ఎవరీమె?....ఎప్పుడూ ఎక్కడా చూడలేదే....ఒకవేళ ఈమె పొరబడటం లేదుకదా? అను కున్నాడు మనస్సులో. "పొరబడటానికి రాత్రి సమయం కాదే?.... మనిషిని చూస్తే అంత పొరబడే తెలివి తక్కువది కూడా కాదు....మరి ఈమె పట్టపగలు నడిబజారులో పిలిచి ఎంతో పరిచయమున్నట్లు మాట్లాడుతున్న దేమిటి?" అని తర్కించుకుంటున్నా డతను.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?....ముక్కూ ముఖమూ తెలియని మిమ్మల్ని పిలిచాననా?" అతని ముఖంలోకి చూస్తూ ప్రశ్నించిం దామె. దానితో అతను ఆమె పూర్తిగా అపరిచితురాలేనని నిశ్చయించు కున్నాడు. "చూడబోతే అసాధ్యురాలుగానే ఉంది. లేకపోతే ఎంత నాగరికురాలైతేమాత్రం ఒక పరాయి వాడిని పట్టపగలు నడివీధిలో పిలిచి మాట్లాడుతూ ప్రక్క ప్రక్కగా నడుస్తుందా?" ఆమె ప్రశ్నకేమీ సమాధానం చెప్పకుండానే అనుకుంటున్నా డతను.

ఇద్దరూ దగ్గరిగా ప్రక్క ప్రక్కనే నడుస్తున్నారు. అనుకోకుండానే శ్యామలరావు వెనక్కి తిరిగి చూశాడు. అతనితోపాటే ఆమెకూడా

తిరిగి చూసింది. ఎవరో ఇద్దరు వాళ్ళు వెనకాలే వస్తున్నారు. అతనిగుండె దడదడ లాడింది. "కొంపతీసి తనకు తెలిసినవారు కాదుగదా ?" అనుకుంటూ వాళ్ళను తేరిపార చూసి కాదని నిశ్చయించుకోవడంతో అతని గుండె దడ తగ్గిపోయింది. వెనకాల వస్తున్నవాళ్ళు నవ్వుతూ, తుళ్ళుతూ ఏదో మాట్లాడుతూ వస్తున్నారు. ఆమెతో నడుస్తుంటే ఒకటి రెండుసార్లు భుజం తాకటంవల్ల అతను కొంచెం ప్రక్కకు ఒదిగి నడుస్తున్నాడు. ఎదురుగ్గా ఒక కాఫీహౌసు కనిపించడంతో "కాఫీ తాగుదామా ?" అతని కళ్ళల్లోకి చూస్తూ అందామె. శ్యామలరావుకు కుతిక పట్టుకున్నట్లయింది, "జేబులో డబ్బుల్లేవని సందేహిస్తున్నారు కదూ ? ... మరేం ఫరవాలేదు. నాదగ్గర ఉన్నాయిలే రండి" అంటూ ఆమె అతని చేతిని పట్టుకొని వ్రేళ్ళల్లో వ్రేళ్ళుదూర్చి కాఫీ హౌసులోకి దారి తీసింది. శ్యామలరావుకు పసిపిల్లవాడిలా ఆమెను అనుసరించక తప్పిందికాదు. ఆమె బ్రెడ్, కాఫీ తెప్పించింది, "అట్లా బెరుగ్గా ఉంటారేం ? చిన్నప్పటి స్నేహితుడు కలిసినట్టు ఉషారుగా మాట్లాడక" నవ్వుతూ అందామె. అతను కొంత ధైర్యం తెచ్చుకొని "మీ పేరు ?" అన్నాడు. ఆమె సౌందర్యాన్ని కళ్ళతో పుణుకుతూ. "మీరు, అని మన్నించ నక్కరలేదు. హేమా అని పిలవండి" అందామె. అతను మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"ఇదే తను ఒక పరాయి ఆడదాన్ని, అందులో అపరిచితురాలైన అందగత్తెను నడిబజారులో పిలిచి చనువుగా మాట్లాడితే ఊరుకుంటుందా ? ఎడంకాలి చెప్పుతీసి దౌడ వాయించేయదూ ? అందుకే ఆడది ఎందుకైనా సమర్థురాలన్నారేమో ?" ఆమె చనువుకు, తెగువకు ఆశ్చర్యపోతూ అనుకుంటున్నా డతను. ఇంతలో వారి వెనకాలే అనుసరిస్తున్న ఇద్దరు కూడా వచ్చి, వీళ్ళకు ఎదురుగావున్న టేబిలుముందు కూర్చున్నారు. వాళ్ళిద్దరూ శ్యామలరావును అదోకలా చూస్తున్నారు. "వీళ్ళ ముఖం తగలెయ్య, అట్లా చూస్తారేం తనను" అనుకుంటూ

అతను హేమవంక చూశాడు. "ఏమండి....ఇంటికి వెడదామా—సిని మాకు వెడదామా ?" అంది హేమ. "ఏమంటే ఆమె ఏమనుకుంటుందో అనుకుంటూ "నీ ఇష్టం ఎలాగైనా సరే" అన్నాడు. ఇద్దరూ బైటికి వచ్చారు. ఆమె ఆటోరిక్షాను పిలిచింది. ఆమె కూర్చుంటూ "రండి.... కూర్చోండి" అంది. "ఏమిటీ వైభవం" అనుకుంటూనే ఎక్కి కూర్చు న్నాడు. "ఏమిటీ మనిషితత్వం....ఆమె అంతస్తెక్కడ—తన అంత స్తెక్కడ ?" ఆలోచిస్తూ కూర్చున్నాడు శ్యామలరావు.

"నేను అందమైనదాన్నే కదూ ?" హేమ అతని కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించింది. అతను ఆమె ముఖంవంక చూస్తూ "కాదని ఎవరనగలరు?" అన్నాడు. ఆమె స్నిగ్ధంగా నవ్వింది. "ఇదంతా కలగాదుకదా" అను కున్నాడు శ్యాం. "మీపేరు చెప్పరుకదూ ?" ఛలోక్తిగా అందామె. "ఎందుకు చెప్పనూ ?" అన్నాడు శ్యాం. "మరి ఇందాకటినుంచీ చెప్ప లేదేం ? నాపేరు అప్పుడే చెప్పేశానుగా" కొంటెగా అతనివంక చూస్తూ అంది.

"మరేంలా—మాటల్లో మరచి పోయాను. శ్యామలరావని అంటారు" అన్నాడు. "చాలా బాగుంది. అయితే ఇకనుంచి శ్యాం అనే పిలుస్తాను. కోపం రాదుకదూ ?" కిలకిల నవ్వుతూ అంది హేమ. "ఏమిటీ విపరీత ధోరణి" అనుకుంటూనే "కోపమెందుకూ ? మీరు ఎలా పిలిచినా సంతోషమే" అన్నాడు. "అదుగో....నన్ను మళ్ళీ మీరు అని అంటున్నారు. నేనలా ఒప్పుకోను, నేను కూడా ఇకనుంచి 'నీవే' అని అంటాను. స్నేహితులం నీవు—నీవు అని పిలుచుకుంటే తప్పేముందీ?" అంది హేమ . ఆమె మాటలకు శ్యామలరావుకు నవ్వు వచ్చింది. ఆటో రిక్షా ఒక పార్కుముందునుంచి పోతున్నది. "కాసేపు పార్కులో కూర్చుని పోదాంలే శ్యాం" అంటూ ఆటోరిక్షాను ఆపించింది.

ఇద్దరూ వెళ్ళి పార్కులో పచ్చికమీద కూర్చున్నారు.

"చూశావా శ్యాం....అందరి కళ్ళూ మనమీదే ఉన్నాయి" అంది. అతనేం మాట్లాడలేదు. "అన్నా చెల్లెల్ని చూసినా తెలియని వాళ్ళు ఏవేవో సంబంధాలు కల్పిస్తారు." మళ్ళీ ఆమె అంది.

"తెలియనివాళ్లు అనుకోవడంలో తప్పేముంది?" ఆమెనుండి ఏమి సమాధానం వస్తుందోనని సందేహిస్తూనే అన్నాడతను.

"ఎందుకు తప్పుకాదూ? మనిద్దరినీ స్నేహితులని ఎందుకు అనుకోరాదూ?" రెట్టిస్తున్నట్టుగా అంది హేమ.

"నీవన్నది నిజమే హేమా? కానీ లోకం దృష్టిలో అలా అని పించదేమో?" సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టుగా అన్నాడతను.

"అదేం కాదు శ్యాం. ఆడదంటే అంత చులకన అయిపోయింది. ఏం?—ఒక ఆడదీ మొగవాడూ పవిత్ర హృదయాలతో స్నేహంగా ఎందుకు ఉండరాదూ?" చేత్తో గడ్డిపరకల్ని త్రుంచుతూ అంది హేమ.

శ్యాం ఆలోచనలో పడ్డాడు. "నిజమే....ఇద్దరు మొగవాళ్ళూ ఇద్దరు ఆడవాళ్ళూ స్నేహంగా ఉన్నట్టు. ఒక ఆడది మొగవాడూ స్నేహంగా ఎందుకుండరాదూ?....ఊహూ....అది సాధ్యంకాదేమో? స్త్రీ అంటేనే ఒక ప్రత్యేకమైన ఆకర్షణ పురుషుడికి. అలాగే పురుషుని లోనూ ఒక ప్రత్యేకమైన ఆకర్షణ ఉంది స్త్రీని లాంగదీసుకుంటుంది. ఇద్దరూ సమవయస్కులై యౌవనం సుళ్లు తిరుగుతున్నప్పుడు పవిత్ర మైన స్నేహం ఎలా సంభవమౌతుంది. ఎంతటి మనోనిగ్రహం కల వారికో తప్ప? ఈమె పవిత్రమైన స్నేహ వాత్సల్యంతోనే నా చేతిలో చేయికలిపి, వ్రేళ్ళల్లో వ్రేళ్లు దూర్చి, భుజం భుజం తాకుకుంటూ నడి చింది? అదీ ఇంతకుముందు ముక్కూ ముఖమూ తెలియని వాడితోనా?" అనుకుంటున్నాడు శ్యాం.

"ఏమిటి ఆలోచిస్తున్నావు శ్యాం" అతని సమాధిని భగ్నం చేస్తూ అంది హేమ.

"అబ్బే....ఏమీలేదు. మన కలయికను గూర్చి." అతని వాక్యం పూర్తికాకుండానే హేమ అందుకొని "ఏం మనం స్నేహంగా ఉండ లేమనా ?" అంది.

"ఎందుకుండలేం....కానీ" సాగదీస్తూ అన్నాడు శ్యాం.

"కానీలేదు....గీనీలేదు....లే పోదాం" అంటూ హేమ లేచింది. ఇద్దరూ వెళ్ళి మళ్ళీ ఆటోరిక్షలో కూర్చున్నారు. డ్రైవరుకు తన ఇంటి గుర్తులు చెప్పి పోనీయమందామె.

'సినిమాకు వెడదామన్నావుగా' ఆమెకు జ్ఞాపకం చేస్తున్నట్టుగా అన్నాడు శ్యాం.

'ఉహూ....సినిమాచూస్తే నాకు ఏడుపొస్తుంది. ఇంటికే వెడదాం' అంది హేమ. అతనేం మాట్లాడకుండా కూర్చున్నాడు. ఆటోరిక్షా నడుస్తున్నది.

సినిమాచూస్తే ఎందుకు ఏడుపొస్తుందో ?....అటువంటిది ఇందాక సినిమాకు వెడదామా అని ఎందుకు అడిగింది....పార్కులో కూర్చుందామని దిగి, పట్టుమని పదినిముషాలుకూడా కూర్చోలేదే— ఏమిటీ మన స్తత్వం ఆలోచిస్తున్నాడు శ్యాం. ఏమిటో ఆమె తరహా అయోమయంగా ఉందనుకున్నాడు.

'ఇందాక కాఫీహౌసులో మన కెదురుగావచ్చి కూర్చున్న ఇద్దరూ ఎవరనుకున్నావు శ్యాం ?' అని ప్రశ్నించింది హేమ. తనకేం తెలుసు అన్నట్టుగా చూశాడు శ్యాం.

'వాళ్ళిద్దరూ నన్ను వెంటాడారు.' అందామె.

'ఎందుకూ ?' సందేహాస్పదంగా అన్నాడతను.

'ఒంటరిగా ఆడది కనబడితే ఎందుకు వెంటాడుతారేం ?'

సరే—ఆమె తననెందుకు పిలిచి మాట్లాడించిందో ఇక అర్ధ మైందనుకున్నాడు శ్యాం. మొత్తానికి భలే తెలివిగలది. వాళ్ళబారినుండి

తప్పించుకొనేందుకు తనను ఈవిధంగా ఉపయోగించుకుందన్నమాట. అయితే మాత్రం ఒక పరాయి మొగవాడితో భుజాలురాసుకుంటూ నడవ వలసిన అవసరం ఏమిటి ? చూడబోతే బాగా చదువుకున్న దానిలాగ ఉంది. ఈమెను వెంటాడటానికి వాళ్ళకు ధైర్యం ఎలా వచ్చిందో' అని అనుకుంటున్నాడు శ్యాం.

'వాళ్ళిద్దరూ ఆసుపత్రిలో కంపౌండర్లు. బజారులో ఒక్కదాన్నే కనబడేటప్పటికి వెంటబడ్డారు. దేవుడిలా నీవు కనపడ్డావు కాబట్టి సరి పోయింది. లేకపోతే ఏమయ్యేదో ?" అంది హేమ.

ఇంతలో ఆటోరిక్షా ఆమె ఇంటిముందు ఆగింది. "ఇకనేను వెడతా—నా డ్యూటీ అయిపోయిందిగా" అన్నాడు శ్యాం.

"అదేమిటి....అలా అంటావేం శ్యాం." ఆశ్చర్యంతో అందామె.

"నీవు సలక్షణంగా ఇల్లు చేరుకుంటానికేగా నన్ను ముక్కుకు తాడుబోసినట్టు లాక్కొని వచ్చింది." కొంచెం ఉక్రోషంతోనే అన్నాడు శ్యాం.

"నీవు ఉత్త పిచ్చివాడివి శ్యాం ...అట్లా అయితే నిన్ను పార్కుకు చేరకముందే విడిచిపెట్టేదాన్నిగా. మనం ఆటోరిక్షా ఎక్కాక వాళ్లు తెల్ల ముఖాలువేసి వెళ్ళిపోయారు తెలుసా ?" నవ్వుతూ అందామె.

"అరరే....తను తొందరపడి అనేశానే" అని నాలుక కరుచుకొని సిగ్గుపడ్డాడు శ్యాం.

* * *

"ఎక్కడికి వెళ్లావు తల్లీ....నీకోసం బెంగపడి కూర్చున్నాం" అంటూ ముసలి దంపతులు వీధిగుమ్మంలోకి వచ్చారు.

'ఏం ?....ఎందులోనైనాపడి చస్తాననుకున్నారా ?' అంటూ 'రా శ్యాం లోపలికి' అని అతని చెయ్యి పట్టుకొని లోపలికి దారితీసింది.

'ఇతనెవరమ్మా ?' సందేహిస్తున్నట్టుగా ప్రశ్నించాడు ఆమెతండ్రి.

'ఎవరా ?....ఆ స్కౌండ్రల్ కాదు. ఇతను నిజాయితీగల మనిషి. పెళ్ళి చేసుకుంటానని చెప్పి మోసగించిన దగుల్బాజీ కాదు. అతనూ మీరూ కలిసి నా జీవితాన్ని సర్వనాశనం చేశారు. మీరు రాక్షసులు కాని తల్లిదండ్రులా ?' అంటున్నది హేమ. శ్యామలరావుకు ఇదేమీ అర్థంకాక స్తబ్ధంగా నిలబడి పోయాడు. హేమ ముఖం కందగడ్డలా అయిపోయింది. కోపంతో కండ్లు ఎర్రబడ్డాయి. అంత సుందరమైన విగ్రహం నిమిషంలో కాళీరూపం దాల్చింది. శ్యాం ఆమెవంక చూడలేక పోతున్నాడు. ఉన్నట్టుండి హేమ పెద్దపెట్టున ఏడుస్తూ తల నేలకు కొట్టుకుంటున్నది. తల్లిదండ్రులు ఆమెను వారించబోయే టప్పటికి ఆమె వాళ్ళను కొట్టబోయింది. ఆమె అలా కొట్టుకొని ఏడుస్తుంటే శ్యాం చూస్తూ ఊరుకోలేక ఆమెను పట్టుకుంటానికి దగ్గరగా పోబోయాడు. 'వద్దు నాయనా వద్దు....అది ఆపిచ్చిలో ఎవరినైనా లెక్కచేయకుండా కొడుతుంది' అంటూ హేమ తండ్రి శ్యామును పట్టుకున్నాడు. హేమ అట్లా ఏడ్చిఏడ్చి స్మృతితప్పి పడిపోయింది.

'హేమ పిచ్చిదా ?....ఎంత చక్కగా మాట్లాడింది. ఎటువంటి మంచి అభిప్రాయాలు వెలిబుచ్చింది' అనుకుంటూ ఆశ్చర్యపోయాడు శ్యాం. ఆమె తలిదండ్రుల కళ్ళల్లో నీళ్ళు చూసేటప్పటికి అతని కళ్లుకూడా చెమ్మగిలినాయి. ఆ దంపతులు కాసేపు హేమకు ఉపచారాలు చేసేటప్పటికి ఆమెకు కొంచెం స్పృహకలిగింది. ఆమెను నెమ్మదిగా మంచంమీద పడుకోబెట్టారు. శ్యాం వెళ్ళిపోదామనుకున్నాడు. కాని వెళ్ళడానికి కాళ్లాడ లేదు. ఏదో ఆలోచిస్తూ అక్కడే కూర్చున్నాడు. గోడలకున్న ఫోటోలు చూస్తుంటే హేమఫోటో కనిపించింది. స్టెతస్కోపు పట్టుకొని చిరునవ్వులు చిందుతోంది. దాని ప్రక్కనే ఫ్రేముకట్టివున్న ఆమె మెడిసిన్ డిప్లొమా కనిపించింది. శ్యాం ఆశ్చర్య పోయాడు. 'హేమను ఏదోశాస్త్ర చదువుకుందనే అనుకున్నాడు కాని లేడీడాక్టరని అనుకోడానికి ఆస్కారం

లేకపోయిందే' అనుకున్నాడు. ఇంతలో హేమతండ్రి అక్కడికివచ్చి అతని ప్రక్కనే కూర్చున్నాడు.

"చూశావా నాయనా....ఇదీ వరుస. ఇట్లా రోజుకు ఒకసారైనా వస్తుంటుందీ పిచ్చి." కన్నీళ్ళు పెట్టుకుంటూ అన్నా డాయన.

"ఒక్కగా నొక్క కూతురు. ఎంతో గారాబంగా పెంచాము. మొదటినుంచీ ఉత్తమాశయాలతో ఉండేది. లేడీడాక్టరు అయి ప్రజాసేవ చేయాలని మురిసి పోతుండేది. అలాగే అయింది. మొదట్లోనే స్వంత డిస్పెన్సరీ ఎందుకని, కొంత అనుభవంకోసం ఏ ఆసుపత్రిలోనైనా చేరుదా మనుకుంది. నా పలుకుబడివల్ల ఈ ఊరి ఆసుపత్రిలోనే ఉద్యోగం దొరి కింది. ఒక సంవత్సరం ఎంతో ప్రశాంతంగానే గడిచింది. హేమ పని చేస్తున్నవార్డులోకే మరో క్రొత్తడాక్టరు వచ్చాడు. అతనూ చాలా మంచి వాడే. వీళ్ళిద్దరికీ మంచి స్నేహమైంది. ఒకరినొకరు ప్రేమించుకున్నారు. అతను మా ఇంటికి వస్తుండేవాడు. ఈడూ జోడూ బాగుందనీ, ఇద్దరూ డాక్టర్లే కాబట్టి ప్రాక్టీసుపెట్టి ప్రజాసేవ చేస్తారనీ ఎంతో కుతూహలపడ్డాడు. హేమా అతనూకూడా అలాగే అనుకున్నారు. ఎక్కడికి వెళ్ళినా, ఏ సిని మాకు వెళ్లినా కార్లో ఇద్దరూ కలిసే వెళ్లేవారు. అతను మా వర్ణంవాడు కాకపోయినా మే మంతగా పట్టించుకోలేదు. కానీ అనుకున్నవన్నీ జరి గితే ఇక లేనిదేముందీ? అతను ఎవరికీ తెలియకుండా నెలరోజులు సెలవు పెట్టి వాళ్ళ ఊరికి వెళ్లిపోయాడు. అప్పటికే హేమ దిగులుపడిపోయింది. ఒకరోజు అతని దగ్గరినుంచి ఉత్తరం వచ్చింది. తన వాగ్దానం నెరవేర్చ నందుకు క్షమించమనీ, తలిదండ్రుల బలవంతంమీద మేనమామకూతుర్ని పెళ్లి చేసుకున్నాననీ ఆ ఉత్తరంలో వ్రాశాడు. దానితో హేమకు పూర్తిగా మతి పోయింది. మళ్ళీ ఇక్కడికి రావడానికి ముఖం చెల్లక అతను ట్రాన్స్ఫర్ చేయించుకున్నాడు. అతని తియ్యని మాటల్లో ఒక మామూలు పిదదిలాగానే హేమ మోసపోయింది. ఆమేకాదు—మేమూ మోస

పోయాము. అతనికేం అతను క్షమించమని తేలిగ్గానే అనేశాడు. ఇది క్షమించతగిందేనా ? భ్రష్టుడు హేమజీవితం నాశనం చేశాడు. అప్పటి నుంచే ఈమెకు పిచ్చి పట్టుకుంది. ఆమెను ఇల్లు కదలకుండా కంటికి రెప్పలా చూసుకుంటున్నాము. ఇవ్వాళ్ళ ఎప్పుడూ రానిపరాకు రావడం వల్ల వీధిలోకి వెళ్ళిపోయింది. మనిషి బాగానే మాట్లాడుతున్నట్టు ఉంటుంది. ఆ మాటల్లో ఏవో తెలియని అర్థాలుంటాయి. ఉన్నట్టుండి ఇందాకటిలా పిచ్చివచ్చి హైరాన పడిపోతుంది' అంటూ ముసిలాయన హేమ జీవితాన్నిగూర్చి క్లుప్తంగా చెప్పాడు.

ఆరోజునుంచీ శ్యామలరావు ఇంచుమించు ప్రతిరోజు హేమ ఇంటికి వెడుతూ గంటలకొద్ది ఆమెతో మాట్లాడుతూ ఉండేవాడు. ఆమె పిచ్చి రోజురోజుకూ ఎక్కువ కాసాగింది. దానితోపాటు ఆరోగ్యంకూడా చెడిపోతూ వచ్చింది. ఆ పిచ్చి ధోరణిలో శ్యామునుకూడా ఏమిటేమిటో అనేది. కాని అతనవేమీ పట్టించుకొనేవాడు కాదు. వైద్యుల సలహాలతో ఆమెను విశాఖపట్నం పిచ్చి ఆసుపత్రికి తీసుక వెళ్లారు. అక్కడినుండి హేమతండ్రి వారానికొకసారి శ్యామలరావుకు ఉత్తరం వ్రాస్తుండేవాడు.

రెండునెలలు నిమిషాలమీద జరిగిపోయాయి. ఒకరోజు 'హేమ నిన్ను చూడాలంటున్నది. వెంటనే బయలుదేరిరా' అని శ్యాముకు ఆమె తండ్రి టెలిగ్రాంతోపాటు డబ్బుకూడా పంపాడు.

శ్యామలరావు వెళ్ళకుండా ఉండలేకపోయాడు. హేమను చూసి మొదట్లో గుర్తించలేక పోయాడు. ఆమె దేహం శుష్కించినా ముఖంలో ఏదో ఆకర్షణ ఉట్టిపడుతున్నది. అతనిరాకకు హేమ తలిదండ్రులు ఆనందించారు. హేమ తన చేతుల్లోకి శ్యాం చేతులు తీసికొని నవ్వింది. 'చాలా చిక్కిపోయాననుకుంటున్నావు కదూ శ్యాం ?....మనిద్దరం స్నేహంగా ఉందామనుకున్నాము. మన స్నేహంలో మాలిన్యం లేదు....కపటాలు, కార్పణ్యాలూ అసలే లేవు. కానీ....శ్యాం....మనం ఇక స్నేహంగా

ఉండలేం....నిన్ను చూస్తుంటే మతిపోతున్నది....నిన్ను మోసం చేస్తు న్నాను శ్యాం....నీ స్నేహితురాలిని మరచిపోవు కదూ' అని అంటుంటే ఆమె కంఠం జీరపడింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండాయి. 'ఏడవకు హేమా....జీవితంలో నిన్ను మరచిపోలేను' ఆమె ముంగురులు సరిచేస్తూ అన్నాడు శ్యాం. ఆమె కళ్ళల్లో నీళ్ళు అలాగే నిలిచిపోయాయి. ఆమె నుండి మళ్ళీ ఏ సమాధానమూ రాలేదు. శ్యాం ఆదుర్దాగా ఆమెను పరిశీ లించి చూశాడు. "హేమా!....హేమా!....నీ స్నేహితుడిని వదలి వెళ్లి పోయావా హేమా?" బొంగురుగొంతుతో అన్నాడు శ్యాం. అతని కళ్ళల్లో నీళ్ళు నిండాయి. రెండు కన్నీటి బిందువులు హేమ ఫాలభాగం మీదపడి ఆమె కన్నీటి చారికలలో కలిసి పోయాయి.





# కడుపు నిండింది

❖

శ్రీ గొట్టిముక్కుల కృష్ణమూర్తి

---

జననం : 1924.

చిరునామా : పత్రికా రచయిత, గద్వాల.

కార్యాకలాపాలు : జాతీయ, సారస్వతములు.

అభిరుచి : కవిత్వము.

రచనలు : ముద్రితం : దైన్యాలోకం (ఖండకావ్యం), కథానికలు, వ్యాసములు.

అముద్రితం : —

అభిమాన రచయితలు : టాగోర్, సామర్సెట్‌మాం, ప్రాచీన కవులు, రాయప్రోలు, దువ్వూరి, జంధ్యాల, అనుముల, దాశరథి, దేవులపల్లి వగైరాలు.

*

# కడుపు నిండింది

అది అగష్టు 14 వ తేది. మర్నాడే దేశానికి స్వతంత్రం వచ్చిన ఆగష్టు 15. భారత జాతికి పర్వదినం. భాగ్యనగర పట్నమంతా అలంకరణ కార్యకలాపాలకు తమ కళాకౌశలాన్ని చూపి పథకాలు వేసుకుంటున్నారు కల్గివున్న ప్రజలంతా. పత్రికల కుర్రవాళ్ళు స్వతంత్ర సంచికలు అపుడే తిరిగి అమ్ముకుంటున్నారు. భాగ్యవంతులు ఆత్రంతో పత్రికలు కొని రేడియో, సినిమా ప్రోగ్రాములు చూచుకుంటున్నారు.

అది ఒక పూరి గుడిశె. వీధులలో పారవేయబడగా మున్సిపాలిటీ వాళ్ళ ధర్మమా అని వదలిపెట్టిన పుడక పుట్రలతో తలదాచుకోటానికి స్వయంగా కప్పుకున్నది బుద్ధి బలంతో. ఆ గుడిశె యెంకిది. కాటికికాళ్ళు చాచినా యింకా పూర్తి పాపంపండక మంచంలో కనిపెట్టుకొని పడి వున్నది రోగంతో యెంకితల్లి.

రోజూ ముష్టెత్తి ఆ రెండు పొట్టలూ పోసుకోవాలి యెంకి. యెంకి పుట్టిన పదిరోజులకే తండ్రి జర్మన్ యుద్ధానికి బలి అయిపోయినాడు. యెంకి రెక్కాడితేనే ఇద్దరి డొక్కలూ పూడేవి. తల్లికి జ్వరం ఎక్కువైంది. ఆమెకు యే డాక్టరు మందిస్తాడు ? అశ్వినీ దేవతలే వైద్యులు. ప్రకృతిమాతే ఉపచారిక. ఉప్పులేని గంజినీళ్లే రాజపథ్యం. పగిలిపోయిన చిప్పే బంగారు కప్పు. ఆనాడు నిద్రలేచేసరికి రాత్రి యెంకి దాచుకున్న గంజిముంత రెండై భగ్నహృదయాన్ని ప్రతిబింబించింది.

ఉదయం 9 గంటలు. వెతగ్గా వెతగ్గా పిడికెడు మొక్కజొన్న నూక యేనాడో దాచినది ముక్కిపోయి కనపడింది. గంజిచేసి తల్లికి కడుపులో పోసింది. బయలుదేరింది నౌకరీకి యెంకి....ఆ వుద్యోగానికి

జీతంలేదు. ఫలానా పని అనీ లేదు. చెప్పేవాళ్ళూ లేరు. చేయలేదేం అని అడిగేవాళ్లూ లేరు. పర్యటనే పని. ప్రధాన రంగాలన్నీ తిరగాలి. అంతే! నాంపల్లి, అబిద్‌రోడ్, కోఠీ, చమన్, నారాయణగూడా, హిమాయత్ నగర్....అన్ని వీథులూ అన్ని బస్సు స్టాండులూ తిరిగింది. కాని పైసా కూడ పుట్టలేదు. రైలుస్టేషన్‌లన్నీ గాలించింది. దమ్మిడీ చిక్కలేదు. మిఠాయి దుకాణాలు, ప్రజా సంస్థలు, నాయకుల భవనాలూ తిరిగింది. భాగ్యనగరమంతా పాలించినా యెంకికి పైసామాత్రం యెక్కడా పుట్టలేదు. గర్రవి తేన్పులూ, కమ్మని తాలింపు వాసనలతో నిండే ప్రతి హోటలు వద్దా ఆశా దృక్కులతో నిలిచింది. లాభం కనపడలేదు. ప్రతి వ్యక్తి ముందూ "అయ్యా బాంచను దొరా, కాళ్లు మొక్కుతా పైసా, దొరా" మంత్రజపం ఆరంభించింది. ధూత్....ధూత్కారాలతో కడుపునిండి పోసాగింది యెంకికి.

రాత్రి 8 గంటలైంది. కాళ్లీడ్చుకుంటూ ముచ్చెన గుంటలోకి దూరిన కళ్లతో జడలుదాల్చిన జుట్టుతో కృష్ణదేవరాయ గ్రంథాలయంవద్దకి చేరింది....నల్లాలో చల్లనినీళ్ళు పుక్కిలించి ఆచమనం చేసింది. "అయ్యా నీబాంచను బాబూ...." మళ్ళీ జపం ఆరంభం చేసింది.

విద్యా సమాధిలోనుండి బయటపడి భాషాయోగులు ఒకరొకరు యిళ్లకు పోతున్నారు. ఆత్మారాముల కారగింపుచేయటానికి అతి తొందరగా వెళ్లుతున్నారు. ఒక క్షణంపాటు ఎంకినిచూచారు. సభ్యతలేకుండ అయినచోట కానిచోట అర్రులు చాస్తుఉండే ఆ బికారివర్గంపై అసహ్యపడ్డారు. ఎన్నికల్లో తాను ఓడిపోయిన సంగతి హటాత్తుగా స్ఫురించి తన ఓటమివల్లనే దేశమీగతికి వచ్చిందని చీదరించుకున్నాడు ఒకయువకుడు. చెదరిన జుట్టు, బవిరిగడ్డము, మాసిన ఖద్దరుపంచా, చిరిగిన ఖద్దరు లాల్చీ 'ఆకృతి వహించినట్టి శోకాధిదేవత'లా వున్నాడు. గ్రంథాలయం మెట్ల

వద్ద నిల్చుని భోజనానికి హోటలుకు వెళ్ళడమా, అపుడే వద్దా అని ఆలో చిస్తూ విలబడ్డాడు.

'అయ్యా, నీబాంచను. ఒక్కపైసా దొరా, తల్లికి ప్రాణం పోతోంది బాబూ. ఒకపైసా బాబూ' అని మాట్లాడలేక బావురుమన్నది. అతడు పిచ్చివాడా ? వెఱ్ఱివాడా ? యేమోకాని మధ్యాహ్నం తన విలేఖరి గిరీకి పత్రికవారు పారవేసిన దయాభిక్షబాపతు అయిదురూపాయలనోటు చేతిలో పెట్టాడు. కొయ్యబారింది యెంకి. "పైసలు లేవు బాంచనుదొరా. మీరే చిల్లర విడిపించి యియ్యండి" అంది యెంకి.

"అక్కరలేదు అమ్మీ, వుంచుకో" అన్నాడతను. యెంకి కన్నీళ్లతో అతడి పాదాలకి అభిషేకం చేసింది. అతను కన్నీటి కుసుమాలు వర్షం కురిపించాడు యెంకి తలమీద.

యెక్కడలేని సత్తువ వచ్చింది యెంకికి రూపాయలు చూచేసరికి. సరాసరి కాళ్ళు యింటివైపు పరుగు తీశాయి. కోఠీదాటి సెంట్రల్ బ్యాంకు సమీపించేసరికి పోలీసు జవాను హుంకారానికి దబుక్కున క్రింద పడింది రస్తామీద. చేతులోని అయిదురూపాయల నోటు చేతిలోనుండి తొంగి చూసింది. చేయిలాగి చూచాడు. కల్దార్ అయిదురూపాయల నోటు ! "చేతులో అయిదురూపాయలనోటుతో బికారి పరుగెత్తడం ?" ఆలో చించి, "ఠీక్ హై, కేసు బనాయించడానికి కావలసినంత ఖానూన్" అని వుబ్బిపోయాడు పోలీసు కాన్‌స్టేబిల్. "హరాంకీ యిందుకా పరుగెత్తేది ? చలో ఠాణాకు" అనే కరాళ గర్జన....

ఆనాడు అసలే పుట్టి వుపవాసం....తిరిగి తిరిగి చచ్చినంత అయింది. తల్లికి పండ్లు తీసుకుందామని ఉత్సాహం. పోలీసు బెదరింపుకు ఆవేశం. వేడుకున్నది. ఏడ్చింది. కాళ్లు పట్టుకున్నది. ఖానూన్‌దార్లకు కరుణా ? శిక్షాస్మృతికి దయా ? స్వార్థానికి సానుభూతా ? ఉండాలంటుంది కళా ప్రపంచం ! పిచ్చి....ప్రపంచం! ఠాణాలో రాత్రి పదిగంటలదాక యేడ్పించి

అయిదు రూపాయలు లాక్కుని వదిలాడు యెంకిని. దరిద్రుని చేతిలో ధనం కనపడడం దారుణం - నేరం - అనుమానం; అవును లోకం పోకడే అంత.

విధికి విలపించలేదు. గతికి కలతపడలేదు, ఉద్యోగ సమయం యింకావుంది కదా అని బయలుదేరి ఆబిడ్ రోడ్డు గుండా నడుస్తున్నది పీక్కుపోతున్న కాళ్ళీడ్చుకుంటూ యెంకి. దుకాణందార్లందరూ తమ తమ దుకాణాలని అలంకరించుకుంటున్నారు తెల్లారవచ్చే ఆగష్టు 15 పండుగకు. ఒక అంగడివద్ద పడివున్న అరటిపళ్ల తొక్కలు వాళ్ళో యేసుకుని సమిష్టి భోజనాని కేజంతువూ కూడా రాక తింటున్నది. పై అంతస్థునుండి గంపెడు పెంట చిత్తుకాగితాలూ నెత్తిన పడ్డై. వాళ్ళోని ఆహారం దుమ్ముమయమైంది. నల్లాదగ్గర కడుక్కున్నది "ఆహారం బ్రహ్మ అహంచబ్రహ్మ' భావనతో ఆరగించింది ఆ అరటి. తొక్కలు.

ఏదో ఆశతో చిత్తుకాగితాలు పెళ్ళగించింది. భారతమాత, బాపూజీ బొమ్మలు చిరిగిపోయినవి! ఆహారపథకాలు! ఆహార పథకాలు! ఆవారా ఆదేశాలు పత్రికలనిండా! తెల్లారితే ఆగష్టు 15 స్వతంత్ర మహోత్స వాలు...."అంబలి కాచుకోను పనికొస్తాయి." చిత్తుకాగితాలను యెంకి స్వేచ్ఛగా వొడినిండా నింపుకొన్నది. ఇంటిముఖం పట్టింది, దోవలో ఒకచోట పండ్ల బండిని తోసుకుంటూ పోతున్నాడు ఇంటికి ఒక పండ్ల సాహెబ్. యెంకి బండివెంటే వెళ్ళింది కొంతసేపు. తెగువచేసుకొని సాహెబుకు తన కథంతా చెప్పుకుని పొట్లాలకి చిత్తుకాగితాలు తీసుకుని యేదైనా ఒకపండు యిమ్మని ప్రాధేయపడింది.

అది బాగా 12 గంటలు దాటీ దాటని వేళ. వీథులన్నీ నిర్జనంగా వున్నై. నడుమంత్రపుసిరి వచ్చిపోయినట్లు అపుడపుడు గర్జించుకుంటూ బాటసార్లను దూసుకొనిపోయే బేగం సాహెబాల మోటారుకార్లు తప్ప.

ఇంకా రెండవషో సినిమాలు వదలినట్టులేదు. చల్లగా సన్నగా గాలి
వీస్తోంది. సాహెబు వళ్ళు జలదరించింది. మీసం మెలిపెట్టుతూ ఒక్క
సారి ఆపాదమస్తకం ఎంకిని నిటారుగా చూచాడు. అలాంటి సంఘట
నలు యెంకికి కొత్తవికావు. అలాంటి చూపులూ. తోపులూ. వెంబ
డింపులూ దైనిక దైవిక శిక్షలే ఆమెకు. "తోఫల్ హోనాగే" అన్నాడు
ఆమె ముఖకవళికల్లో యేమార్పూ లేంది చూచుకొని—

ఎంకి ఒక్కసారి సాహేబును పరకాయించి తీవ్రంగా చూచింది.
"నీయిష్టం. అమ్మకి పండ్లో?" అన్న భావంతో చూచి నవ్వాడు
సాహెబు. ఒక్కసారి కళ్లు మిలమిల లాడించింది యెంకి. సాహెబు
గడ్డం దువ్వుకున్నాడు.

"సరేకాని అమ్మ చాలా జబ్బుగావుంది. వెళ్ళి ముందు
పండిచ్చి...." అనేసరికి హంభీ వస్తాం. అన్నాడు. బండి యింటివద్ద
చేర్చి రకరకాల తాజాపళ్లు ఒక బుట్టనిండా పెట్టుకొని బయలుదేరాడు.
యెంకివెంట. ఇద్దరూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు. యెంకి ముందు దారి
చూపిస్తోంది. యెవరి యూహల్లో వాళ్లు పోతున్నారు. ఎంకి గుడిశెవుండే
గూడెం సమీపిస్తోంది. ఇద్దరికీ గుండెదడ హెచ్చిపోతోంది. చిరు
చెమటలతో యెంకి కపోలాలూ, సాహెబు గడ్డమూ తడిసిపోతున్నై.
"మీరు యీడనే నిలసుండి. అగో అదే మాగుడిశె. ఇపుడే వస్తిని"
అని ఒక్క గంతులో గుడిశె చేరుకుంది యెంకి.

గుడిశెకు అడ్డంగా కట్టివుంచిన తడికె కూలబడి పోయివుంది.
మూల్గు సన్నగా వినపడుతోంది. దీపంబుడ్డి ముట్టించి, ఒక ద్రాక్షపండు
తల్లి నోట్లో పిండింది....

'అ....మ్మ అన్న ఒక్క బొబ్బతో ఆ ఒక్క బొట్టు రసమూ
గొంతులోంచి లోపలికి జారింది. ఇంకొక పండు పిండింది యెంకి.
కళ్ళు మూతలు పడ్డై. రసం వెనక్కొచ్చి పెదిమలగుండా చెంపలమీదకి

జారింది. ముసలిదాని కడుపు మొదటి పండుకే నిండిపోయింది. దభాలున గాలివీచి దివ్వె ఆరిపోయింది. అమ్మా అని పొలికేక— దభాలున ఒక చప్పుడు మాత్రం యెంకికి వినిపించింది ఆ అంధకారంలో.

తెల్లవారి 8 గంటలైంది. గూడెంలోని కుక్కలు బొంయ్ మంటుంటె వినీవినీ ప్రక్క గుడిశెలవారు వచ్చి చూచేసరికి తల్లి బిడ్డల కట్టుగుడ్డలు పేలికలై పడివున్నవి. యెంకిని ప్రక్కకు తీశారు. చింపి చీరపేలికల వొడిలోంచి బాపూజీ, భారతమాత బొమ్మలు—చిత్తుకాగి తాలూ జారి బయటకు తొంగి చూచాయి.



# గుడ్డితనం

❖

శ్రీ నాయని కృష్ణకుమారి



జననం: 14—3—1930

చిరునామా: 12/18 గగన్ మహల్ రోడ్, దోమలగూడెం, హైదరాబాదు.

కార్యకలాపాలు: మహిళా కళాశాలలో తెలుగు అధ్యాపకత్వం.

అభిరుచి: సాహిత్యంతో సన్నిహితత్వం అలవరచుకోవడం.

రచనలు: ముద్రితం: 1. ఆంధ్రుల కథ.
2. గౌతమి.

అముద్రితం: కథల కడలి.

అభిమాన రచయితలు: తిక్కన, విశ్వనాథ, నాయని.

*

# గుడ్డితనం

"అమ్మా! గుప్పెడు బియ్యం వెయ్యండి తల్లీ!"—వాకిట్లో నిల బడి గుడ్డి పిల్లొకటి అరిచింది. ఆ అరుపు వింటూ వింటూ నా మెదడు జరజర వెనక్కు పాకి అంతులేని భ్రమణంలో కొంతసేపు అవస్థపడి ఒకచోట ఆగిపోయింది. లోకపు పోకడే బహు విచిత్రమైంది. ఏవేవో విచిత్రవిషయాలు, మనకు ప్రియమైనా కాకపోయినా అన్నీ దాని హృద యంలో సమయం వచ్చేవరకూ ఇమిడి ఆనక అగ్ని పర్వతాల్లా బద్దలై వ్యాపిస్తయ్. కళ్లెదుట జరిగే విషయాల్ని చూస్తుండగానే, మస్తిష్కపు తెరల్లో వాటిని పోలిన విషయా లొకదాని వెనకొకటి కలల్లా కరిగి మెదడు నుద్రిక్తం చేస్తయ్. ఆ క్షణానికి మన వయస్సూ, స్థితీ, వ్యక్తి త్వమూ ఇవేవీ, జ్ఞాపకం రావు—మనుష్యుడు ప్రపంచానికి ప్రభువైతే, వాడిమీద అధికారం చేసేది వాడి మనస్సు. దాన్నరికట్టడ మెవరితరం? మనకు కష్టాలన్నీ దుఃఖాలన్నీ కలిగించే విషయాల్ని స్మరించ వద్దంటే అది వినదు. దాని తోవ కదే ఎదురులేని అధికారి—

ఇందుకే ఎక్కడగుడ్డిపిల్లను చూచినా నాకు శ్రీమణి జ్ఞాపకంరాకుండా ఉండదు, అట్లాని, వీధుల్లో కనిపించే వీళ్లకూ ఆవిడకూ ఎక్కడా పోలిక ల్లేవు. వీళ్లు కానీ డబ్బులకో, గుప్పెడు బియ్యానికో నకనకలాడే కడుపును పాటగా మార్చి అడుక్కునే అభాగ్యులు. శ్రీమణి అలా కాదు. అయినా వీళ్లను చూచినప్పుడల్లా ఆ పిల్లెందుకు జ్ఞాపకం వస్తుందో ఖచ్చితంగా చెప్పలేనుగాని, నా మెదడు వెనుకనుండే అజ్ఞాతపు లోపొరల్లో వీళ్లకూ ఆమెకూ గల అంధత్వం ప్రస్ఫుటమై ఉండాలి. ఏమైనా కళ్లు లేకపోవడం వల్ల కలిగే మ్లానతా దుఃఖం అందరికీ సమానమన్నమాట మాత్రం నిజం.

శ్రీమణిని గురించిన స్మృతి కలిగినప్పుడెల్లా నా మనస్సేదేదో ఆలో చిస్తూనే ఉంటుంది. ఎంత ఆలోచించినా, ఆవిడను గురించి నా ఊహ కందని విషయాలేవో ఇంకా ఉన్నాయనే అనిపిస్తూంటుంది కూడా!

"వచ్చావా లక్ష్మీ? సెలవలెన్నాళ్ళు?"—కాలేజినుండి సెలవల కింటికి వస్తే దగ్గర కూర్చుని చేతులు తడుముతూ గోముగా అడిగేది. ఆవిడ వేసే ప్రశ్నలకు సమాధానం ఇవ్వడంలో నాకు విసుగే జనించేది కాదు. తను చూడలేని విషయాలూ తెలుసుకోలేని సంగతులూ ఎన్నో నాకు తెలుసుకదా అన్న భావ మొకటెప్పుడూ నామనస్సులో తారట్లాడేది. శ్రీమణి నాకంటే ఏడాది చిన్నది. అయినా నాకు వరసకు అత్త. పదహా రేళ్ల ఆ పిల్ల వికసించే హృదయంలో ప్రపంచ సమస్యలన్నీ అపరిమితంగా ఉండేవనుకుంటాను. ఏవేవో ఊహలు చిందరవందరగా రేగి ఆమె మన స్సును ఛిన్నాభిన్నంచేసి అశాంతిని రేపుతుండేవి.

"లక్ష్మీ! ఇంద్రధనుస్సులో ఎన్ని రంగులుంటాయ్?" ఒక సారి డాబామీద కూర్చుని తమ్ముడికి ఫిజిక్సుపాఠం చెప్తుంటే, నన్నడిగింది.

"ఏడు. మణీ! ఊదా, నారింజ, నీలం, ఆకుపచ్చ...." ఇట్లా వర సంతా చెప్పాను.

నేను చెప్పిందంతా విన్నదో లేదో నేను గమనించలేదు. అతుక్కు పోయిన కనురెప్పల చివర నీరు ముత్యమై తళతళ లాడుతోంది. నోరు కొంచెంగా తెరచి, పైకి లేవని రెప్పల్ని తపతప లాడించాలనే విఫల ప్రయత్నం చేస్తూ తలెత్తి శూన్యంలోకి ప్రసరించని చూపుల్ని జునిపే ట్లున్న మణి స్థితి హృదయాన్ని కరగించింది. ఆ చూపులకూ ప్రపంచానికీ మధ్య ఆవిడ కనురెప్పలే అడ్డు—అనుభవైకవేద్యాలయ్యే కొన్ని విషయాలు ఊహించటానికి పనికిరావు. ఆవిడలో ఉన్న బాధను కొలవా లంటే నేనూ గుడ్డిదాన్ని కావాలి!—అయినా ఊరుకోలేక పోయాను.

"ఛ. ఏడుపా, ఎందుకూ?" ప్రశ్నించాను. ఈప్రశ్న అనవసరమూ, అసందర్భమూ అని నాకు తెలుసు. మణి దీనికి జవాబేమీ చెప్పలేదు. చటుక్కున వెనక్కు తిరిగి మెట్ల గోడను చేత్తో తట్టుకుంటూ కళ్లన్న వాళ్ల కంటే దూకుడుగా దిగిపోయింది. ఆవిడ కాలి సవ్వడికి నా హృదయంలో ఏమూలో బాధరేగి చుమ్మలు చుట్టుకుని, ఆవిడ చూళ్లేని ఇంద్రధనస్సులా మెరమెర లాడింది, ఇదేమీ అర్థంకాక పాఠం వినడానికొచ్చిన పసివాడు తెల్లబోయి దిక్కులు చూడ్డం మొదలు పెట్టాడు.

శ్రీమణిని గురించి ఇంకా ఏమన్నా చెప్పబోయేముందు మా పుట్టింటిని గురించి కూడా కొంత చెప్పుకోవాలి. మాయిల్లు లేందే ఆవిడ జీవిత కథనం సంపూర్ణమేకాదు. మా యిల్లంటూ ఒకటి కనపడకపోతే శ్రీమణి జీవితం ఇప్పటికంటే వెలుగు బాటల్లో నడిచేదో, నికృష్టపు మురికి సందుల పాలయ్యేదో నిర్ణయించడం కష్టం—ఆ యిల్లు ఉండటం వల్ల ఆవిడ బ్రతుకు మధ్యరకపు పంథాలో తిండికీ గుడ్డకూ లోపం లేకుండా మాత్రం జరుగుతోంది.

నిజానికి మా యిల్లో సంస్థ. సత్రం! ఇంటికి చెందిన వాళ్లని లెక్కపెడ్తే పట్టుమని పదిమందిమి లేకపోయినా ఎప్పుడూ వచ్చేపోయే వాళ్లతో పెళ్లమని వెలుగుతుండేది. మా నాన్నగారు చెయ్యెత్తి దణ్ణం పెట్టాల్సిన వ్యక్తి. ఆ ఒక్కడి సంపాదన ఎంతో, దానిమీద ఆ యిల్లు నిత్య కల్యాణంగా ఎట్లా జరుగుతున్నదో ఎవరికీ అంతుపట్టేది కాదు. ఆయన జాతకమే అట్లాంటిదని అందరూ సమర్థించుకొనేవారు. ఆయన అడుగు జాడల్లో నడుస్తున్నానని భ్రమించే మా అన్నయ్య ఆ యింటికో పెద్దపులి. హోదా అనేది ప్రేమ పూర్వకంగా తెచ్చుకునేదేగాని, అధికారం చేతా, దర్పంవల్లా రాదనీ, వచ్చినా అది నిలవదనీ ఆయనకు తెలియదు. ఈ చిన్న సూత్రాన్ని తెలుసుకోడాని గ్గూడా ప్రయత్నించకుండా మా అన్నయ్య తికమకలు పడుతుండేవాడు. లోకంలో ఎన్ని మార్పులన్నా

వచ్చాయిగాని అతడి నిరంకుశత్వంలో రాలేదు. ఎదుటివాళ్ల మనస్సుల్ని గ్రహించలేని వ్యక్తుల్నీ, గ్రహించినా సానుభూతి చూపించలేని వాళ్లనూ సహించడం చాలాకష్టం—

మా అన్నయ్యను గురించి యిప్పుడీ ముక్కలు చెప్పడానికి కూడా శ్రీమణే కారణం. శ్రీమణిని తెరవెనుక నిలబెట్టి, ఆ తెరను చీల్చుకొని బయటికి వచ్చే ఆమె జీవితరేఖల్లో మా అన్నయ్య కనపడుతూ ఉంటే ఇది చెప్పాల్సివచ్చింది. మా అన్నయ్యే లేకపోతే ఆ గుడ్డిపిల్ల నా జీవితంలో ఇలా చెఱగని విధంగా ఉండేదేకాదు.

శ్రీమణి పుట్టడమే గుడ్డిపిల్లగా పుట్టింది. మా వంశంలో ఎక్కడా లేని గుడ్డితనం ఏపాపం కింద సంక్రమించిందోనని అయినవాళ్లూ, కాని వాళ్లూ కూడా ఆశ్చర్యపోయారు. ఇలవేల్పు సుబ్రహ్మణ్య స్వామిని వాళ్లనాన్న దూషించారనీ, అందుకా పగను స్వామి యీ రూపంగా తీర్చుకున్నాడనీ, వాళ్లమ్మ, మా నాయనమ్మ అంటుండేది. ఆవిడ మా నాన్నగారికి పినతల్లి. "పుట్టిన మూడేళ్లకే తండ్రిని మింగిందీ గుడ్డి పిశాచ"మని తర్వాత లోకం శ్రీమణిని దుయ్యబట్టింది. మూడేళ్ల పసి మనస్సు కిదంతా ఏమీ తెలియకపోయినా తల్లిమాత్రం మిక్కుటంగా కుమిలి పురిటింట్లో వడ్లగింజ వేసయినా చంపేసుంటే బాగుండేదేమోనని అనుకోవడానికి కూడా సాహసించింది. భర్త చనిపోగానే జ్ఞాతులు ఉన్న కాస్త ఆస్తినీ హరించుకు పోయారు. ఆవిడా, ఆమె గుడ్డి కూతురూ దిక్కులేని పక్షులు కాగా వాళ్లను మానాన్నగారి యిల్లే రెండు చేతులూ చాచి ఆప్యాయంగా ఆహ్వానించింది. తిండికీ గుడ్డకూ లోపం లేకుండా భర్త ఉన్నన్నాళ్లూ కలకల లాడిన ఇల్లాలు ఈ కాలానికి పరులపంచ పట్టడం ఆవిడ నిభాయించుకో లేకపోయింది. మనోవ్యాధి రాక్షసిలా ఆవిడ జీవకణాల్లో విస్తరించి మరి రెండేళ్ల కామె నీలోకంలో ఉండనివ్వ

లేదు. ఈ విధంగా శ్రీమణి మాయింటికి వచ్చి, ఈ విశాల విశ్వంలో కని పెంచే తలిదండ్రులు లేకుండా ఏకాకిగా మిగిలి పోయింది.

శ్రీమణి ఇంట్లోఉన్న ఎవరికీ సమస్యల్ని చిత్రించేది కాదు. కుటుంబంలో కళ్లున్న అందరికి మల్లే ఆమెకూడా వేళకు తిండీ, స్నాన పానాదులూ నిర్వర్తించుకునేది. నలుగురు కలిసి మాట్లాడే చోటికి వచ్చి తనకిష్టమైతే తానూ మాటలు కలిపేది. రేడియోలో శ్రోతలు కోరిన రికార్డులు వస్తే అందరితోపాటు పాడేవాళ్లను విమర్శించేది. ఆమెకు అంగలోపమొకటుందనీ, భావిజీవితమంతా ఆవిడ కంధకారమయమనీ, ఎవరూ గుర్తించడానికి వీల్లేకుండా తానే చేతులారా చేసుకుంది. ప్రపంచం చూడలేని అసంతృప్తి ఆవిడలో జ్వలించి మనస్సును కబళిస్తున్నా అది యితరులకు తెలీని విధంగా కమ్ముకునేది. దానిమీద నిశితంగా ఆలోచించి తర్జన భర్జనలు చేసే అవకాశాన్ని ఆవిడ మా కివ్వలేదు. అసలు శ్రీమణి యొక్క ఈ విధమైన ప్రవర్తనే ఆమె ఇప్పుడు గడిపే జీవితానికి కారణమేమోనని నా సందేహం!

ఒకరోజున నేను నా గదిలో కూర్చుని పుస్తకం చూస్తున్నాను. నా గది కానుకునే ఒక హాలూ, దానిపక్క రెండు గదులూ ఉన్నయ్. ఆ వరసకికి అంతే. రెండు గదుల్లో ఒకటి మా అన్నయ్యది కావడంవల్ల ఇంట్లో వాళ్లెవరూ సాధారణంగా ఆ చాయలకు రారు. హఠాత్తుగా హాల్లో నుంచి అన్నయ్య కేకలు వినిపించినయ్. ఆ గొంతు కటువుగా వలయాలు చుట్టుకుంటూ గాలిని చీలుస్తోంది.

"గుడ్డిముండ దీనికి వేషాలెక్కువైనయ్. పరువు తియ్యడాని కిటు వంటి శనిగ్రహాలు తయారవుతుంటారు"—ఇంకా ఏమేమో అంటున్నాడు. తాను చదువుకున్నవాడనీ సభ్యతెరిగిన మనిషనీ పూర్తిగా మర్చిపోయి వాగుతున్నాడు—ఇవన్నీ విని విని నా గుండెల్లో రక్తం పొంగి పొంగి ముఖాని కెగదట్టింది. చెవుల్లోనుంచి వచ్చే వేడిగాలి చెక్కిళ్లను మండి

స్తున్న ట్లనిపించింది. ముందు పెట్టుకూర్చున్న పుస్తకంలో అక్షరాలు కనిపించలేదు. కాని అక్కణ్ణుంచి కదల్లేక పోయాను. కదిలి అన్నయ్య ముందు పడితే కలిగే పర్యవసానం నాకు ముందే తెలుసు. ఆయన దౌర్జన్యానికి నా చదువుకున్న మెదడు ఎదురు తిరగడం, మా యిద్దరి కేకలకూ ఇల్లు రభస కావడం మామూలే! చిన్నదాన్నీ, పైగా ఆడపిల్లనీ అని అందరూ నాకే బుద్ధులు చెప్తారు.

పాపం శ్రీమణి!—ప్రపంచంలో డబ్బు లేకపోవడం మహాపాపం! దానికి తోడు తల్లీ తండ్రీ లేక, జీవితావసరాలు కల్లలేక ఈ పిల్ల బ్రతికుండడ మెందుకు? అన్నయ్యలాటి వాళ్లతో మాటలు పడడమే ఈవిడ జీవితలక్ష్యం కాబోలు – నా కళ్లు చెమ్మగిల్లినయ్. అన్నయ్య సవ్వడి వినిపించలేదు. పాపం శ్రీమణేమి చేస్తున్నదో అనుకుంటూ బరువుగా లేచి బయటికి వచ్చాను. హాల్లో ఎవరూ లేరు. శ్రీమణి కోసం వెతికిన నాకళ్లకు తృప్తి కలగలేదు.

వీధి వరండాలో నాన్నగారు ఈజీచేర్‌లో పడుకుని చుట్ట కాలుస్తున్నారు. మెల్లిగా వెళ్లి కుర్చీ చేతిమీద కూర్చున్నాను.

"నాన్నా! గుడ్డి పిల్లలకు చదువు నేర్పే విద్యాకేంద్రా లెన్నో ఉన్నయ్ కదూ!" నే నడిగిన ప్రశ్నకంటే ముందు అసలట్లా ఎందు కడిగానో ఆయన గ్రహించ గలిగారు. చిఱునవ్వు నవ్వుతూ "నీకెందుకమ్మా ఇవన్నీ! పెద్దవాళ్లం మేమున్నాం.... ఇంతకూ అదెక్కడుందో చూడు పో?" అన్నారు. నామనస్సు చచ్చిపోయింది. ఏమూలనో నాలో ఉక్రోషం పొంగి ఒక గమ్యమంటూ లేకుండా ఆ యింట్లో వాళ్ళందరి మీదా ప్రసరించింది. స్వర్గంలాంటి ఇల్లుండి, అమ్మా నాన్నా దేవతలనుకునే నాజీవితాన్ని శ్రీమణి రాక్షసిలా కల్లోల పెడ్తున్న దనిపించింది.

గబగబ డాబా మీదికి వెళ్లాను. మనస్సు కలక బారినప్పుడల్లా ఆ గుడ్డిపిల్ల అక్కడే ఉంటుంది. ఏకాంతతలో ఉన్న ఓదార్పు ప్రశాం

తతా అయింట్లో మరి ఎవరివల్లా రాకపోవడమే దీనికి కారణ మను కుంటాను. మెల్లిగా వెళ్లి తన పక్కన కూర్చున్నాను. మనిషి వచ్చిన సవ్వడికి నామీద చెయ్యివేసింది. భుజాలనుంచి చేతుల వరకూ తడిమి గాజులు పట్టి చూచి నేనని నిశ్చయించింది. అంతే నోరైనా విప్పలేదు. మా యిద్దరిమధ్యా కొన్ని నిముషాలు మూకంగా గడిచినయ్. సంధ్యా కాళంలో ఎఱ్ఱ రంగింకా దిగజారలేదు. రాబోయే చీకటి నల్లని నీడలా ఎఱుపురంగు కింక కొంచెం గాఢత్వాన్నాపాదిస్తూ వ్యాపించింది. శీతా కాలం చలికి నిలువలేక సూర్యుడు త్వర త్వరగా తెర మరుగై పోతు న్నాడు. చలి వెన్నులోంచి పుట్టి, గుండెనూ ఎముకల్నీ కదిల్చి వేస్తోంది.

"మణీ! అన్నయ్య కేకలేస్తున్నాడెందుకూ?—" నేనే అడిగాను. నిజానికట్లా అడగకూడదని నాకు తెలుసు. ఒక వ్యక్తి మూకంగా అనుభ వించే బాధను ఎదుటివాళ్లు కూడా మూకంగానే అవగతం చేసుకోవడం మంచిది. నిశ్చలంగా ఉన్న కాసారంలో చిన్న మట్టి పెళ్ల విసిరినా తరంగాలు లేచి ఒడ్డుకు తాకేవరకూ ఆగవు. శ్రీమణి చెంపలకు జారే కన్నీటిలో సంధ్యాకాంతి మెరిసింది.

"లక్ష్మీ! నువ్వు నా కంటే పెద్దదానివే అయినా నా మనస్సు ఆలోచించే దారులన్నీ నీ కందవు. మనస్సులో ఏదో ఒకవిధమైన మధన ప్రారంభమయితే ప్రపంచంలో కావలసినంత అనుభవం వస్తుంది. ఇంతకూ నాకున్న అనుభవం నీకు లే"దన్నది. కానా మాటల్లో అర్థం అంతు పట్టలేదు. పదహారేళ్ల శ్రీమణేనా యీ మాట్లాడే దనుకొన్నాను.

తర్వాత మెల్లిగా చెప్పింది. తను హాల్లో కిటికీ దగ్గర నిల్చు నుండగా అన్నయ్య హాల్లోకి వచ్చాట్ట. కిటికీ కవతలంతా బయలు. దూరంగా ఎక్కడో ఉంది ప్రహరీ గోడ. కిటికీకి కొంచెం దగ్గరగా కారు షెడ్డుంది. డ్రైవరు కృష్ణుడెప్పుడూ అక్కడే ఉండేవాడు. శ్రీమణి కిటికీ దగ్గర చువ్వల కానుకొని కూను రాగాలు తీస్తుండగా, వాడు అవతల

పక్కకొచ్చి "ఏమండీ పాడుతున్నారు!" అని అడిగాడు. దానిమీద ఏవేవో మాటలు జరిగి మనస్సు స్పందించి శ్రీమణి నవ్వుతుండగా వచ్చాడు అన్నయ్య. ఇంతకూ ఆ మాటలలో దూష్యమైందేదీలేదు.

"ఇదే లక్ష్మీ! కారణం. వాడు కారు డ్రైవరు. నేను పరువుగల కుటుంబంలో పుట్టినదాన్ని. గుడ్డిదాన్నైతే కావచ్చు. అంత మాత్రాన సిగ్గూ ఎగ్గూ విడిచి ప్రవర్తిస్తానా?....ఇంట్లోవాళ్లు వేలు చూపితే బయటి వాళ్లు కాలెందుకు చూపరు! అనకూడదు గాని నేనే తన రక్తం చీల్చు కుని పుట్టిన చెల్లెల్నయితే ఇట్లా అంటాడా?" అన్నది. అవి మాటలు కావు. పదునుపెట్టి ఎఱ్ఱగా కాల్చి వదలిన ఉక్కు ములుకులు. శ్రీమణి అందుకుంది.

"నన్ను గుడ్డిదాన్నంటారు. నాకేం గుడ్డితనం? ప్రపంచం గుడ్డిది. కులీనతగల ఆడపడుచును కాబట్టి నేనిట్లా ఉన్నాను. కళ్లు లేనంత మాత్రాన హృదయం లేదనుకుంటారా? మనుష్య సహజమైన వాంఛలు నాలోమాత్ర మెందు కుండగూడదు! దేవుడు రెండు విధాలా నన్ను చిన్న చూపే చూచాడు. కళ్ళతోపాటు హృదయమూ లేకుండా చేసి నన్నొక పిచ్చిదాన్ని చేసి ఉండాల్సింది."....ఉద్రిక్తంగా వచ్చే యీ మాటల్ని ఆవిడ ఎంత గాద్గికంగా, వైలక్ష్యంతో ఉచ్చరించిందో వర్ణిం చడం నాతరం కాదు. ప్రపంచమంతా అది చేసే నేరానికి, శ్రీమణి ముందు సిగ్గుపడి చేతులు కట్టుకు నిలవాలేమో ననిపించింది నాకు.

ఆవిడ మాటల్లో ఎంత సత్యముంది? నిజంగానే తన్ను వలచి వలపించుకోవడానికి ఎవ్వరీ గుడ్డి సౌందర్యంవైపు మొగ్గుతారు? చెయ్యని ఏ పాపానికో ఫలితంగా తన్నీశాపం చుట్టుకుంటే అందుకు తాను బాధ్యురాలా? జీవితంలో ఇటువంటి వాళ్ళ కేవ్యాపకమూ కల్పించకుండా ఉసురుపెట్టే వాళ్లు క్షంతవ్యులెట్లా అవుతారు? నా మనస్సు మనస్సులో

లేదు. మెదడు వేడెక్కి ప్రపంచం మొద్దుపారినట్లనిపించింది. చీకటి కాటుకలా అలుము కుంటుంటే కిందకి పోదామన్నాను. శ్రీమణి లేచింది.

కింద అన్నయ్యా, నాన్నా భోంచేస్తున్నారు. అన్నయ్య ముఖం ఎఱ్ఱగా కంది ఆవేశ పడుతున్నాడు. అమ్మ వడ్డిస్తుంటే నాన్న పరమ శాంతంగా అన్నం కలుపుతున్నారు.

"మీరేమన్నా అనండి నాన్నా! ఈ ఇంట్లోంచి దాన్ని బయటికి పంపడం నాకు ఇష్టంలేదు. తర్వాత మీయిష్టం." ఈ మాటల్లో కరుకుదనం రాటుదేలి చెవుల్ని గింగురు లెత్తించింది. ఇవి సమ్మెట పోటులా శ్రీమణి గుండెల్ని ఎంత గాయంచేసి అదరగొట్టిందో ఇప్పటికీ నే నూహించుకోలేను.

"మరి దాని జీవితంలో వ్యాపక మెట్లారా? ఇంట్లో ఊరికే కూర్చుంటే మెదడెన్ని విధాల పోతుందో నీకు తెలియదూ?" అన్నారు నాన్న.

"అదుపులో పెట్టుకోటం చేతయితే అందరూ సక్రమంగానే ఉంటారు. అయినా గాలికీ ధూళికీ కొట్టుకొచ్చిన వాళ్ళందరికీ ఎంతెంత డబ్బు కర్చుపెడ్తాం నాన్నా?" దానికి తిండీ గుడ్డా అమర్తూ ఉంటే మనమేమీ చెయ్యటం లేదనుకోవటానికి లోకం గుడ్డిదికాదు" గర్జించాడు అన్నయ్య.

లోకం గుడ్డిది కాదూ? ఎదుటి వ్యక్తి హృదయంలో చెలరేగే ఘోషని గ్రహించలేని అది గుడ్డిది కాకపోవట మేమిటి? గుడ్డితనం న్యాయానికి శ్రీమణిది కాదు, ఈ లోకానిదే! ముమ్మాటికీ దీనిదే అంటూ నామనస్సు పిచ్చెక్కినట్లు ఘోషపెట్టింది. లోలోపల ఎంత యుద్ధం జరిగినా నా చేతేమవుతుంది చెయ్యడానికి?

నాన్న మజ్జిగ పోసుకోవడ మైపోయింది, ఆయన ఇదమిత్థమని చెప్పకుండా కంచంలో చెయ్యి కడుక్కుని లేచారు. ఆయన ధోరణే

అంత. ఒక విషయాన్ని పురస్కరించుకుని చివర వరకూ అటో ఇటో తేల్చిచెప్పే పద్ధతి ఎప్పుడూ లేదు. ఇప్పుడు కాకపోతే మరొకప్పుడంటూ వాయిదాలు వెయ్యడం ఆయన కలవాటు. అట్లా అసంపూర్ణాలయిన వాంఛితా లాయన జీవితంలో చాలా ఉన్నయ్.

అంతే! అప్పటికీ ఇప్పటికీ శ్రీమణి అంధ విద్యాలయంలో చేరనే లేదు. ఆ హాల్లో కిటికీ దగ్గరికి పోవడానికి జంకుతూ, లోలోపల కుములుతూనే ఉంటుంది!

ఈ ఆలోచనల్నుండి తెమిలి బయటపడేటప్పటికి ఎదురుగా గుడ్డిబిచ్చకత్తె లేదు. మా ఆయన చిరునవ్వు నవ్వుతూ నన్ను వింతగా చూస్తున్నారు.

ఒకవేళ నేను గుడ్డిదాన్నయితే! ఆయనైనా నన్ను నిరసించే వారేగా! అంతే. గుడ్డితనం మానవుల కెంత ఘోరమైన శాపం!





# తప్పటడుగు

❖

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనృసింహశాస్త్రి

జననం : 1926

చిరునామా : 3-6-593 హిమాయత్‌నగర్, హైదరాబాదు.

కార్యకలాపాలు : —

అభిరుచి : సారస్వతం.

రచనలు : ముద్రితం : 1. 'మిథ్యబ్రతుకులు' కథానికల సంపుటి.

2. వివిధపత్రికలలో కథానికలు, నాటికలు.

అముద్రితం : రేడియో నాటికలు.

అభిమాన రచయితలు : బెర్నార్డ్‌షా.

*

# తప్పటడుగు

ఆ తెల్లటి డ్రస్సు, ఆ తెల్లటి బూటు, ఆ తెల్లటి టోపి, వసంత శరీరానికి చాలా బాగుంటాయని మధు అభిప్రాయం. నువ్వు యెంత స్వచ్ఛంగా వున్నావు వసంతా అని మనస్సులో అనుకుంటూ వుంటాడు మధు. ఆమె కంఠానికి పెళ్ళయిన గుర్తు తాళిబొట్టు తప్ప యింకోటేమీ లేదు. అసలు ఆమె కోరుకోనూ లేదు, మధుకు వాటిమీద అసలే మోజు లేదు. పైగా అట్లా వుంటేనే బాగుంటుందని కూడా మధు అభిప్రాయం.

వసంతా, నువ్వు నిజంగా నర్సు డ్రస్సులో చాలా బాగుంటావు అని అంటూ వుంటాడు కూడ.

అవును లెండి మీకు చీరెలు కొనటం తప్పిపోతుందిగా....। అని అంటుంది వసంత.

అట్లా అని నిజానికి మధు వూరుకోనూ లేదు. అయినా వసంతకు అవకాశం మాత్రం యేముంది అవన్నీ కట్టుకోవటానికి. పగలల్లా యించుమించుగా డ్యూటీలోనే ఉండిపోతుంది! అప్పుడప్పుడు మాత్రం, మధు సరదాపడి, వసంతను శలవుపెట్టమంటూ వుంటాడు. అయితే వసంతకు ఒక్కరోజు శలవుమీద వున్నా, తన ప్రాణమంతా ఆసుపత్రిలోనే వుంటుంది. అందులో పిల్లల వార్డులో పని.

ఎప్పుడు చూసినా వాళ్ళమాటే. వాళ్ళ గొడవే. అందుకనే తెల్లారి లేచినప్పటినుంచి యేదో హడావిడిగానే పనులన్నీ చేసుకుంటూ పోతూ వుంటుంది తనకు యెక్కడ ఆలస్యం అవుతుందో అని. మధు కవుతే సాధారణంగా సావకాశంగా మాట్లాడే అవకాశం ఉదయంపూట యెప్పుడూ కూడా దొరకనే దొరకదు. అందువలన వుదయంపూట యేమీ

మాట్లాడనే మాట్లాడడు. అడపా, తడపా వసంతకు యేదో సహాయ పడుతున్నట్లు అటూయిటూ తిరుగుతూ వుంటాడు యింట్లో మధు. నాచేతికి అడ్డం రావటంతప్ప అంతకంటె వుపయోగం యేమీ కని పించటంలేదు అంటూ నవ్వుతుంది వసంత.

పదిగంటలు లోపుగానే యిద్దరి భోజనాలు అయిపోతాయి. వసంత తన డ్రస్సు విషయంలో చూపించ వలసినంత శ్రద్ధ మధు తన డ్రస్సు విషయంలో చూపించక్కర్లేదు. సైకిలుకట్టు ధోవతి, లాల్చీ, మోకాళ్ళ దాకా వేళ్ళాడే వుత్తరీయం, అవసరాన్నిబట్టి చేతులో బెత్తం. మూడు మూర్తులా ఆయన వేషమే చెపుతుంది ఆయన చేసేదేమిటో. వసంత గబగబ డ్రస్సు వేసుకుని యింకా కొద్ది నిమిషాల్లోనే వెళ్ళిపోవాలి అంటూ తన రిస్టువాచి చూసుకుంటుంది. తాను రిస్టువాచి చూసుకుంటు నప్పుడల్లా మధుకు కూడా వుంటె బాగుంటుందనిపిస్తుంది వసంతకు. ఏమంత దరిద్రంతో కొట్టుకు పోతున్నామని యీ నెలన్నా కొనుక్కో-రాదండీ అంటూవుంటుంది వసంత. అట్లాగేలే అంటూ మధు దాని విషయంలో గట్టిగా ఆలోచించనే ఆలోచించలేదు. అయినా నాకేమిటి దాని అవసరం. గంట కొట్టంగానే లేచి చక్కా-పోతాను. మళ్ళీ యింటికి వచ్చేవేళ గంట కొట్టేస్తారు అని అంటూ వుంటాడు మధు. మధు యింటికి తన బడికి మధ్య గోడే అడ్డం. వసంత సందు మళ్ళేదాకా రోజూ ఆగోడ చాటున నుంచుని చూస్తూవుంటాడు మధు. ఎప్పటికప్పుడు రిక్షాలో బొమ్మని మధు పోరుకూడా. వసంత నడుస్తూ వెళ్ళటం మధుకు యిష్టం వుండదు. సూటిగా యీ విషయం చెప్పడు. అసలు వసంతతో తాను యెన్నో విషయాలు చెప్పాలని, ఆమెలో యేవేవో సంప్రదించాలని, ఆమె ఆసుపత్రి కెళ్ళిన తర్వాత అనుకుంటూ వుంటాడు. కాని, మళ్ళీ యింటికి వచ్చిన తర్వాత ఒక్కటీ జ్ఞాపకం వున్నట్లు కనుపించదు.

అయిదింటి దాక సతమతమయి యింటికి వచ్చిన మధు వసంత లిద్దరు హాయిగా వాకిట్లో వేపచెట్టు క్రింద కుర్చీలలో కూర్చుని మాట్లాడు కుంటూ వుంటారు. ఎంతసేపటికీను, వసంత ఆస్పత్రిలోని విశేషాలు, మధు తన స్కూలులో జరిగిన తమాషాలు చెప్పుకోవడంతోనే సరి పోతుంది. వీళ్ళిద్దరికీ కూడా పిల్లలంటె మహామోజు. బళ్ళోవున్న కాసేపు మధుకు యెంతో ఆనందంగా వుంటుంది. వాళ్ళ చేష్టలు, వాళ్ళ ప్రశ్నలు, వాళ్ళ సమాధానాలు మధుహృదయాన్ని గిలిగింతలు పెడుతూ వుంటాయి. వాళ్ళతో ఆడుకున్నట్లుంటుంది మధుకు. వసంతకు అంతకంటె ఆనందం ఆసుపత్రిలో పిల్లల్ని సముదాయించటం.

ఇవ్వాళ వేణు అనే అబ్బాయిని ఆసుపత్రినుంచి తీసుకుపోయారు. వెళ్ళిపోతూవుంటే నన్ను చూసి ఒకటే యేడుపు. చూసిన వాళ్ళందరూ కన్న కడుపుకంటె, పెంచిన అమ్మే యెక్కువ అంటారు యిదే కామాలు అన్నారు. నా మనస్సుకు యెట్లాగో అనిపించింది. ఎంతో సిగ్గుతో తలవంచుకుంది వసంత.

మధు ఒక్క క్షణం ఆగి "వేలెడు లేడు ఆ మణి పద్యాలన్నీ అప్ప చెపుతాడు. నన్ను వదిలిపెట్టి వక్కక్షణం వుండడు ఆ బళ్ళోవున్న కాసేపు. వాళ్ళ నాన్నకు ట్రాన్స్‌ఫర్ అయిందట. వెళ్ళిపోతున్నాను మాష్టరుగారు అంటూ నమస్కారం పెట్టాడు. వసంతా....నాకు తెలీ కుండానే దుఃఖము వచ్చింది ..." అంటూ గుటక వేశాడు.

ఇద్దరు కూడా కొద్ది క్షణాలపాటు యెవరి ఆలోచనల్లో వాళ్లు వుండిపోయారు.

"ఇవ్వాళ నలుగురి పిల్లల్ని వరసగా తొట్టి మంచాలలో పడుకో బెట్టాను. అందులో ఓపిల్లలేచి ఒకటే యేడుపు. ఎంతమంది సముదా యించినా ఆగలేదు. చివరకు నేను తీసుకునేటప్పటికి చటుక్కున

యేడుపు మానేసింది...." అతి పేలవంగా ఆమె పెదవుల మీదనుంచి చిరునవ్వు అదృశ్య మయింది.

మళ్ళీ యిద్దరూ కొంచెంసేపు మౌనంగానే వుండిపోయారు.

"వసంతా....పిల్లల్ని చూస్తూవుంటే నాకు యేమిటోగా వుంటుంది". ఆపేశాడు మధు, వసంత కళ్ళల్లోకి చూస్తూ.

"పిల్లలు నామీదకు యెగబడుతూవుంటే నాకూ యేమిటో అనిపిస్తుంది...." వసంత ప్రాధేయపు చూపులు మధును వుత్తేజ పరచినాయి.

ప్రక్కయింట్లో గడియారం ఠంగుఠంగుమని కొట్టకపోతే యిలాంటి సంభాషణలే చాలాదాక సాగేవి.

"రేపు మళ్లీ పెందరాళే వెళ్లాలి కూడ. శాంతకు ఆపరేషన్ చేస్తారుట. నేను లేకపోతే మారాము పెటుతుంది...." అంటూ యింట్లోకి వెళ్లి పడుకుంది వసంత.

మధుకూడా వెళ్ళి పడుకున్నాడు.

"పాపా....నేను చెప్పలా....అంతా తగ్గిపోతుంది....నిద్రపో.... మా అమ్మకాదు....నామాట వినవూ...." వసంత కలవరింత బాగానే వినిపిస్తోంది మధుకు.

ఎంత ప్రేమ పిల్లలంటే. నిజంగా నర్సుకు తగిపోయిన దానివి. పాపం అనుకున్నాడు మధు.

ఒక్కొక్కప్పుడు మధుకూడా పిల్లలమీదే కలవరిస్తూ వుంటాడు. తెల్లారిన తర్వాత యిద్దరు కూడా రాత్రి వచ్చిన కలల మీద వ్యాఖ్యానించుకుని నవ్వుకుంటూ వుంటారు.

ఆనాడు ఆలస్యం అవుతుందేమోనని అన్నంకూడా తినకండానే ఆసుపత్రికి వెళ్లిపోయింది వసంత. పిల్లలంటే వసంతకు అంతప్రాణం. మధుకూడా యెప్పుడూ చెయ్యిచేసుకొని యెరుగడు బళ్లో కూడ. ఎవరో మాష్టరు గోపాలాన్ని కొట్టాడని, మనస్సులో యెన్నోరోజుల దాకా

బాధపడ్డాడు. ఓసారి తొట్లోంచి పిల్ల క్రిందపడిపోతే అది తన అజాగ్రత్త వల్లనేమోనని వసంత ఓమూల కూర్చుని తనను తాను నిందించుకుంటూ కళ్లనీళ్లు పైకి కనపరచకండా మధు యెంత బ్రతిమాలినా, వంటింట్లోకి రానిరోజు లున్నాయి. నాకు ఆదివారం వస్తే ప్రొద్దు గడవదు వసంతా అంటూ వుంటాడు మధు.

అవూరికి దక్షిణంగావున్న తోటలోకి యెప్పుడైనా షికారుకు పోతూవుంటారు మధు, వసంతలు. ఆతోటలోకి జనం విపరీతంగా వస్తూ వుంటారు. అందరి ఆడవాళ్ల దగ్గిర ఒకళ్లో, యిద్దరో పిల్లలు వుంటూనే వుంటారు. వసంత మధువంక చూసి వెంటనే తల వంచేసుకుంటుంది. మధు బిక్కమొహం కనిపించకండా బింకంగా వెళుతూ వుంటాడు.

ఆ యిద్దరిలోనూ తీవ్రమైన ఆవేశం, గాఢమైన కోరిక రోజు రోజుకు పెరిగిపోతున్నాయి. వసంత! వసంత ఋతువులోంచి గ్రీష్మం లోకి వచ్చేసింది, మధు ఆశలు చిగిరించేస్తున్నాయి. కోకిలా రవాలు యిద్దర్ని పరవశుల్నిగా చేస్తున్నాయి. ఇద్దరి ఆనందానికి అవధిలేదు. తాను పనిచేస్తున్న ఆసుపత్రికే వెళ్లింది వసంత. బైట వరండాలో విరామం లేకుండా అటూయిటూ పచార్లు చేస్తున్నాడు మధు.

నర్సువచ్చి మగపిల్లాడు అని చెప్పిపోయింది. మధు పొంగి పోయాడు. ఆచిన్న పాప కేవు కేవు అరుపుల్లో వసంత హృదయం వుప్పొంగిపోయింది. మధు జీవితంలో కోరుకుంది వసంత యిచ్చింది. వసంత తన గాఢమైన అనురాగాన్ని పాపలో చూసుకుంది.

మధు దగ్గరగా నిలబడ్డాడు. కళ్ళు రెండు మూసుకుంది గట్టిగా వసంత. మధు మనస్సులో నవ్వుకున్నాడు. ఎన్నాళ్ళ కోరికో యీనాటికి ఫలించింది.

మధు వుయ్యాల పట్టుకు వచ్చాడు. వసంత వుయ్యాలకు అలం కారం చేసింది. మధు బొమ్మలు కొన్నాడు. వసంత బొమ్మలతో ఆడి

స్తోంది పాపని. ఇద్దరూ కూడా మురిసిపోతున్నారు చిట్టి పాపను చూసి. ఒక్క క్షణమైనా పాపని వదలి వుండలేరు. కాని వసంత సెలవు పూర్తి కావస్తోంది. మధు బలవంతపెడుతున్నాడు యింకా సెలవు పెట్టమని. వసంత ఆలోచనలో పడింది. సెలవు పెట్టకపోతే పాపను చూడటానికి ప్రత్యేకంగా యెవరైనా పెట్టవలసి వుంటుంది. పరాయివాళ్ళమీద పాపను వదిలిపెట్టి వెళ్ళటానికి మనస్సు వప్పటంలేదు. రోజూ తనతో కూడా ఆసుపత్రికి తీసుకు వెళ్ళటం సాధ్యమైన పనిగా కనిపించటంలేదు. ఇవన్నీ ఆలోచించే మరికొన్నాళ్ల సెలవు పొడిగించింది. మధు బళ్ళోకి వెళతా డన్నమాటే గాని ప్రాణమంతా యింట్లోనే వుంటుంది.

రోజులు గిర్రున తిరిగిపోవటంతో వసంత డ్యూటీలోకి వెళ్ళవలసిన రోజు వచ్చేసేస్తోంది. తప్పని సరిగా ఓ పనిమనిషిని పెట్టుకోవలసి వచ్చింది. వసంత ఆసుపత్రిలో వున్నప్పుడు, మధు యింటికే వస్తూపోతూ వుంటాడు. ప్రొద్దున్నే లేచినప్పటినుంచి వసంత తన కొడుకు పనులలోనే సతమత మయి పోతుంది. తాను వున్నకాసేపు కూడ కొడుకు విషయం తానే చూడాలని పనిమనిషిని దగ్గరకు రానిచ్చేదికాదు. ఏఒక్క రోజూ కూడ సరియైన టైములో అటు మధు బళ్ళోకి వెళ్ళటంలేదు; ఇటు వసంత ఆసుపత్రికి వెళ్ళటంలేదు.

"మాస్టారూ, థర్డు బెల్ కూడా కొట్టారండి" అంటూ ఓ పిల్లాడు పరుగెత్తుకుంటూ వచ్చి మధుకు చెపితే, "వస్తాన్లే పో" అంటూ కసిరి కొట్టాడు. ఆ పిల్లాడు బిక్కమొహం వేసుకుని బళ్లోకి వెళ్ళిపోయాడు.

"అమ్మగారు, డాక్టరుగారు మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారండి" అంటూ ఆసుపత్రినుంచి ఒకత్తె వస్తే, "వస్తాను నువ్వు పద. అయినా అంతమంది నర్సులుంటే నన్నే పిలుచుకు రమ్మన్నారేమిటి" అంటూ విసుక్కుంది వసంత.

క్రమక్రమేణా, మధు సరిగ్గా పాఠాలు చెప్పడంలేదనే భావం తోటిమాస్టర్లలో బయలుదేరుతోంది. వసంత శ్రద్ధగా నర్సుపని చెయ్యటం లేదనేమాటకూడా అనిపించుకుంది అక్కడి డాక్టరుచేత.

ఎప్పుడూకూడా పిల్లల్ని కొట్టనివాడు ఆనాడు మధు, కాంతారావును కొడుతుంటే అందరూ ఆశ్చర్యపోయారు. ఏ పిల్లాడు ఏది అడిగినా విసుగ్గా కూర్చోమనడంకంటె, ఆప్యాయంగా సమాధానం చెప్పటమనేది మధు పూర్తిగా మరిచి పోయినాడా అనిపించింది.

"అవును మందు త్రాగకపోతే రోగం ఎట్లా నయమవుతుందమ్మా, పిల్లకదా అని వూరుకుంటే ఓ పట్టాన మందు త్రాగుతుందా" అంటూ ఓ పిల్లను బలవంతంగా గదిలోకి తీసుకుపోయింది వసంత ఆసుపత్రిలో. పిల్లలంతా వసంత దగ్గరకు వెళ్ళటమంటే భయపడిపోతున్నారు. తోటి నర్సులుకూడా ఆశ్చర్యపోతున్నారు వసంతలో మార్పును చూసి.

ఆనాడు వసంత కొడుకు గుక్కపెట్టి యేడుస్తున్నాడు. ఎన్నివిధాల సమదాయించినా, యేడుపు తగ్గేటట్టులేదు. మధు బజారుకు పరుగెత్తాడు. వసంత యేమీ తెలియని పనిమనిషిని గదమాయిస్తోంది. ఇద్దరూ కంగారు పడిపోతున్నారు. తలోకరకంగా అనుకుంటున్నారు. వసంతేమో దిష్టి తగిలిందేమో అనుకుంటోంది. మధేమో డాక్టర్ని పిలవాలనుకుంటున్నాడు. ఏడ్చి, ఏడ్చి, చివరకు నిద్రపోయాడు పాప. తొట్టె వూగిస్తూ ఆదుర్దాగా చూస్తోంది వసంత.

ఇంతలోకి, ఆసుపత్రినుంచి వచ్చిన ఓ అమ్మాయి ఎదురుగా నిల బడివుంది.

"కరుణకు ఆపరేషన్ చేస్తారట. మిమ్మల్ని తొందరగా పిలుచుకు రమ్మన్నారు...." అన్నది ఆమె ఆదుర్దాగా.

"నేను లేకపోతే ఆపరేషన్ జరగదా యేమిటి? చీటీ పంపించా నుగా...." అంటూ ఆ అమ్మాయిని విదిలించేసింది వసంత.

ఇంట్లో యిద్దరికీ తొట్టెలో పాపమీదేవుంది ప్రాణం అంతా. వాళ్ళ మనస్సులు యేమీ పనిచెయ్యటంలేదు. అంతసేపు యేడ్చి యిట్టే నిద్ర పోయిందే అని వాళ్ళబాధ. ఆనాడు యేకంగా మధు శలవే పెట్టాడు.

ఎవరో ఆసుపత్రినుంచి అతాత్తుగా వచ్చి, "రమ చచ్చిపోయిం దండీ....మీతో చెప్పిరమ్మని పంపించారు" అంది.

"పాపం చచ్చిపోయిందా....అయినా నాతో చెపితే యేం లాభం, వెళ్ళి వాళ్లమ్మతో చెప్పు." అంటూ వసంత చికాకు పడింది.

ఓ వారం రోజులదాకా చెప్పుకోదగ్గ మార్పులు కనిపించలేదు.

ఆనాడు ఆదివారం. తీరిగ్గా మధు కొడుకును వళ్లో కూర్చో పెట్టుకుని, ముద్దాడుతున్నాడు. వసంత యెదురుగా కూర్చుని పాపను పలకరిస్తోంది.

"ఏమిటీ, పాపకు వళ్లు వెచ్చగా వుంది...." మధు ఆశ్చర్యంగా వసంత వైపుకు చూశాడు.

వసంత గభాలున పాపను తన వళ్ళోకి తీసుకుంది. 'అవునండీ బాగానే వెచ్చగా వుందే....' వసంత చేతులతో పాటు కంఠంకూడా వణికి పోతోంది.

మధు చటుక్కునలేచి వాకిట్లోకి వెళ్లాడు. డాక్టరు ఏదో మందిచ్చి పోయాడన్నమాటేగాని, ఆ రాత్రల్లా జ్వరం వేగిపోతూనేవుంది. ఇద్దరూ కూడా మంచానికి అటువైపు యిటువైపు యెదురుగా కూర్చునే వున్నారు. భళ్ళున తెల్లారిందన్న మాటేగాని, జ్వరంలో మార్పేమీ కనిపించలేదు. ఏమిచెయ్యాలో ఎవ్వరికీ తోచటంలేదు. మందులవుతే పోస్తూనే వున్నారు. మధు వసంత లిద్దరు యెంతో విచారంగా కూర్చుని వున్నారు. తమ జీవితాల్లో యిది వూహించలేని ఒక ఘట్టం. తమకు అతి ప్రియమైనది తమకు దూరంగా అయిపోతోందా అనే భావం యిద్దర్నీ వణికించేసింది. ఇద్దరూకూడా ఒక్కసారిగా తమ జీవితాల్లోని వెనకటి అధ్యాయాల్లోకి

వెళ్ళారు. అక్కడ అనంతమైన శాంతిని, సంతోషాన్ని అనుభవించి నట్లు యిద్దరికీ జ్ఞాపకం వచ్చింది. అయితే యీ మధ్యలో తమ యిద్దరి లోనూ కలిగిన మార్పుకూడా యేదో అస్పష్టంగా, వాళ్ళిద్దరికే అర్థమవు తున్నట్లనిపించింది. కాని వివరంగా వాళ్ళకు యేమీ తెలియడంలేదు. తమ ఆలోచనలన్నీ వెర్రివేమో, తాము అట్లా అనుకోకూడదేమో అన్నట్లు యిద్దరు ఒక్కసారిగా తొట్టివైపు చూశారు.

అటు వసంత ఆప్యాయత గాని, యిటు మధు ఆదుర్దా గాని తాము కోరుకున్నది సాధించలేక పోయినాయి. మానవశక్తికి మించిన పని అయిపోయింది. ఆ క్షణంలో మధు, వసంతల్లో రోదన ధ్వనే మిగిలి పోయింది.

కొన్నాళ్లదాక ఖాళీ తొట్టెవైపు చూడలేక పోయేది వసంత. మధు మొహానికి గుడ్డ అడ్డం పెట్టుకుని వసంతకు కనిపించకండా తన మనో వేదన తీర్చుకుంటూవున్నాడు. వసంత, మధుదగ్గరకు వచ్చినప్పుడు మాత్రం నవ్వుతూ వుండాలనే ప్రయత్నం చేస్తున్నట్లు, మధు కనిపెడుతూనే వున్నాడు. ఇద్దరి హృదయాల్లోను ప్రజ్వరిల్లుతూవున్న ఆబాధను ఒకరి కొకరు చెప్పుకోకుండానే, ఎవరి హృదయంలో వారు దాచేసుకున్నారు. ఇద్దరికీ అతి సన్నిహితమైన ఒక ప్రాణం తమకు కాకుండా అయి పోయింది. ఇప్పుడు యిద్దరికీ కూడా యెవరూలేరు. ఓవిధంగా అందరూ కూడా వీళ్ళిద్దరికీ సన్నిహితమైనవాళ్లే. మధుకు తన బడిపిల్లలు, వసంతకు తన ఆసుపత్రిలో పిల్లలు.

ఇప్పుడిప్పుడే వసంత, ఆసుపత్రికి వెళ్ళినప్పుడు పిల్లల్ని ఆప్యా యతగా చూసుకుంటోంది. మధు అంటే బళ్లోపిల్లలికి కొంచెం కొంచెంగా చొరవ యేర్పడుతోంది. అదివరకు చిరాకుపడి కొట్టిన మధుకు, దెబ్బలు తిన్న రాము దగ్గరకు వెళ్లటానికి తన మనస్సు పూర్తిగా సమాధాన పడటంలేదు. రమ చచ్చిపోయింది. ఈ మాటలే వసంత గుణించుకుంటూ

వెక్కి వెక్కి యేడుస్తోంది. తాను యేదో ఘోరమైన తప్పుచేశాను అని అస్పష్టంగా మధుకు అర్ధమవుతోంది. వసంత ఆసుపత్రికివెళ్ళి అందరితోను అదివరకు మాదిరిగా వుండటానికి భయపడి పోతోంది. తానేదో తప్పు చేసినట్లు తన అంతరాత్మ ఘోషిస్తున్నట్లు అనిపిస్తోంది వసంతకు.

ఎంతసేపు ఆలోచించినా, యిద్దరికీ కూడా తమకు తెలియకండానే తాము చెయ్యరానిది ఒకటి చేశామని మాత్రం బాధ పడిపోతున్నారు.

రోజులు గడిచినకొద్దీ, సంతానం కోసం పరితపించి పోయిన, మధు వసంతలకు బడి, ఆసుపత్రిపిల్లలే స్వంత పిల్లలు అయిపోతున్నారు. మళ్ళీ గతకాలంలోని మనస్తత్వం యిద్దరికీ అలవడింది. మధు యెప్పుడూ తన బళ్ళో పిల్లలమాటే చెపుతూ వుంటాడు. వసంత యెప్పుడు అక్కడ పిల్లలమాటే చెపుతూ వుంటుంది. ఇద్దరూ పిల్లల మాటలు, వాళ్ళ చేష్టలు చెప్పుకుంటూ ఆనందంలో పరవశులయి పోతూవుంటారు. తన అనే మాట అప్పుడప్పుడు మధుకు, వసంతకు స్ఫురిస్తూ వుంటుంది. కాని వీపుమీద తట్టినట్లు యేదో ప్రతిధ్వని వినిపిస్తుంది. మధు, వసంతలు ఒకరికి తెలియకుండా ఒకరు వట్టువేసుకున్నారు. మధు యెంతో అందంగా కనిపిస్తున్నాడు వసంతకు, వసంత యెంతో ఆకర్షణగా కనిపిస్తోంది మధుకు.

'ఆ పిల్లను విడిచిపెట్టి, నేను క్షణం వుండలేనండి. త్వరగా వెళ్ళి పోవాలి' అంటూ చకచక పనులన్నీ పూర్తిచేసుకుని మధు వైపుకు తిరిగి చిరునవ్వు నవ్వి గడపదాటింది వసంత డ్యూటీలోకి వెళ్ళటానికి.

'నేనేనా యింట్లో కూర్చునేవాన్ని, నీను నేను యెప్పుడువస్తానా అంటూ కనిపెట్టుకు కూర్చుంటాడు. నేను వెళుతున్నా....' అంటూ మధు వుత్తరీయం మెల్లిగా బుజంపైకి వేసుకుని, రెండు తలుపులు లాగి తాళం వేశాడు.





# దానకర్ణుడు

❖

శ్రీ ఎం. కులశేఖరరావు

---

జననం: అక్టోబరు 1933

చిరునామా: 129 హరీబావులీ, హైదరాబాదు—2.

కార్యకలాపాలు: లెక్చరరు - నిజాం కాలేజి.

అభిరుచి: సాహిత్య సేవాభిలాష.

రచనలు: ముద్రితం: కొన్ని కథానికలు - వ్యాసాలు.

అముద్రితం: —

అభిమాన రచయితలు: నన్నయ్య - శ్రీనాథుడు - చామకూర - వేంకటరాజు - దాశరథి - కృష్ణచంద్ర.

*

# దానకర్ణుడు

మా గోపాలం బహుశః మీకంతా తెలిసే ఉంటాడు. ఇలా ఎందుకనాల్సి వచ్చిందంటే. గోపాలం జగమెరిగిన వ్యక్తి. జనం ఎక్కువగా కూడే స్థలాల్లో తరచు కనిపిస్తూంటాడు. అంటే—కాలేజీ క్యాంటీన్లలోనూ, సినిమా థియేటర్లలోనూ, అతని దర్శనం మనకు లభిస్తూ ఉంటుంది. అతడు హోటల్లో ఏ మూడవరకపు చిరుతిండి తింటూ కూర్చుంటాడని అనుకోవడానికి ఆస్కారంలేదు. ఎంచేతంటే—మంచి రకానికి చెందిన కేక్స్, సీమవెన్న తప్పితే ఇడ్డెన్లూ మొదలైన ఇతర మామూలు ఉపహారాలవంక అతడు తిరిగికూడా చూడడు. పానీయాల విషయంలోనూ విశిష్టమైన 'ఓవల్టీను, మిలో' లనే సేవిస్తాడుకాని టీ, కాఫీలను చవి చూసి ఎరగడు.

ఇక సినిమాలసంగతి— ఒంటిగా సినిమా చూడ్డం ఎంత అత్యావసర పరిస్థితుల్లోనూ అతనొప్పుకోడు. కనీసం నలుగురు స్నేహితులుంటేనే 'హాలీవుడ్' సినిమాలను చూస్తాడు. సినిమా చూడడమంటే కేవలం విహారార్థం కాదు. నిశితమైన విమర్శలూ, ప్రశంసలూ అతని స్నేహితబృందాని కందజేసి వారి విజ్ఞానాభివృద్ధికి దోహద మవుతాడు.

గోపాలం మంచి రూపసి. గంభీరమైన ముఖం, బలిష్టమైన శరీరం అతని రూపానికి వన్నె పెట్టినవి. అందానికి తగినట్లుగా అతడు మంచి డ్రస్సు వేసుకుంటాడు. సన్నని సిల్కులాల్చి, తెల్లధోవతి అతడు షికారు బయలు దేరునప్పటి దుస్తులు. ఇక కాలేజీలో కన్పిస్తే, ట్వీడు సూటు, ఫెల్టు హ్యాటు, అమెరికన్ నెక్ టై, విలువైన కళ్ళజోడు ధరించి ఉంటాడు. ఒక రోజు ధరించిన గుడ్డలు మరుసటిరోజు వేసికోడు.

ఎవరైనా నాలాంటి వాళ్ళు కారణమడిగితే "జీవితంలో వెరైటీ ఉండాలి. Variety is life" అంటూ వాదిస్తాడు. అతని వాదన ఒప్పుకొని తీరాల్సి వస్తుంది.

గోపాలానికి సినిమాలలో చేరాలని అభిలాషగా ఉంది. కొన్ని నెలల క్రితం H.M. రెడ్డిగారికి కొత్త సినిమానటులు కావలసి వచ్చినపుడు ఆ పోటీలో గోపాలంకూడా తనపేరు వ్రాయించాడు. నటనను గురించి ఎన్నెన్నో పుస్తకాలు చదివి నటన బాగా అలవరచు కొన్నాడు. ఇంటర్‌వ్యూకు వెళ్ళేముందు బ్రహ్మాండంగా రిహార్సల్సుచేసి మా కంతా చూపించాడు. గోపాలం తప్పకుండా 'సినీ యాక్టరు' అవుతాడని మేమంతా అనుకున్నాం. మా సన్నిహిత స్నేహితుడొకడు చలనచిత్ర రంగంలో నాయకుడై పోతాడని చాలా సంతోషించాం. కాని దౌర్భాగ్య వశాత్తు అలా జరుగలేదు. మాతోపాటు గోపాలానివి ఆశలు నిరాశలైనవి. అసలు జరిగిందేమిటంటే రెడ్డిగారు ఇంటర్వ్యూ సందర్భంలో నటుడు N.T. రామారావుతో కలిసి కూర్చున్నాడట. రెడ్డిగారు గోపాలం పర్స నాలిటీకి బాగా ప్రభావితులై, అతన్ని తన నటవర్గంలోకి తీసికొందామను కొన్నా ప్రక్కనున్న రామారావు నిరాకరించాడట. గోపాలం స్క్రీను పైకి వస్తే రామారావువంటి హీరోలకు ఇక సినిమారంగంలో స్థానం ఉండడం కష్టమని భయపడి అతనలా చేశాడని అంటాడు గోపాలం. అతని మాటలు వింటూంటే నిజంగా అలానే జరిగి ఉంటుందనిపిస్తుంది. దాని కీసంఘటనే నిదర్శనం.

ఈ సంవత్సరం విద్యార్థిసంఘ ప్రారంభోత్సవ సందర్భంలో కాలేజీలో నాటక ప్రదర్శన ఏర్పాటు చేశారు. కార్యదర్శి. గోపాలాన్ని నాటకంలో పాత్ర ధరించవలసిందిగా కోరాడు. ఎంచేతోగాని గోపాలం దానికి నిరాకరించాడు. "నీ నటనాసామర్థ్యాన్ని నిరుపయోగ పరుస్తున్నా"వని మేమంతా మందలిస్తే చివరకు Fancy dressing లో పాల్గొంటానని మాతో

చెప్పాడు. కానీ తానెటువంటి వేషాన్ని ప్రదర్శించబోతున్నాడో మాకెవరికీ తెలియపియలేదు. ప్రదర్శన ప్రారంభింపబడినప్పటినుండీ గోపాలం రంగంపైకి ఎప్పుడు వస్తాడోనని మేం ఎదిరి చూచాం. నిర్ణీత కార్యక్రమం జరిగిపోయిన తరువాత రంగంపైకి Oxford college girl వస్తూందని ఎనౌన్సు చేశారు. అద్భుతం: పూర్తి పాశ్చాత్యవస్త్రాలతో అదేనడవడితో రంగంపైకివస్తే గోపాలం ఇతడేనా అనిపించింది. దాంతో మనవాడికి ప్రథమ బహుమతి దక్కిపోయింది. ఇంతటి నటనానైపుణి కలిగిన వాడికి సినీరంగంలో స్థానం లభించకపోవడం విచారకరమైన విషయమే. ఎంత నిరుత్సాహం కలిగినా, గోపాలం పట్టుదలగల మనిషికావడంచేత అధైర్య పడడు. ఎప్పటికైనా సినీ హీరోగా ప్రఖ్యాతిని సంపాదించగలననే దృఢ విశ్వాసం అతనికి ఉన్నది.

ఇన్ని రంగాల్లో అతనికి ప్రావీణ్యం ఉన్నా, చదువులో అతను ఏమాత్రం వెనుకబడినవాడు కాడు. ఇంగ్లీషులో జరిగే ప్రతిపోటీలో - అది వక్తృత్వంగానీ, వ్యాసరచనగానీ - అతనిదే ప్రథమ బహుమానం. ఇక రాజకీయాలను గురించి అతనితో ఏదైనా ప్రస్తావిస్తే రష్యా విదేశాంగ విధానం మొదలు రాజప్రముఖ రహస్యాలదాకా ఏకధాటిగా చర్చిస్తాడు. అతడు ఇంగ్లీషు మాట్లాడుతూంటే పాశ్చాత్యులు మాట్లాడే భాషకన్నా ఉత్తమంగా ఉంటుంది. అతనికి ఉన్న ఆంగ్లభాషాభిమానమే కాబోలు అతనిని ఉత్తమ భాషాభ్యసనానికి పురికొల్పింది. ఇంగ్లీషులో మనకేదైనా అర్థం తెలియని శబ్దం కనిపిస్తే డిక్షనరీ చూడనక్కరలేదు. గోపాలాన్ని కనుక్కుంటే శబ్దార్థవ్యాఖ్యాన విశేషార్థాలను మన కందజేస్తాడు.

గోపాలం మహాదాత. ఇటువంటివాళ్ళు ఈ కాలంలో కోటికి ఒక్కడైనా కనిపిస్తాడో లేదో! ఏదైనా వస్తువు మీరు గోపాలాన్ని అడగండి. అది అతని దగ్గర ఉంటే కాదనకుండా మీకిచ్చేస్తాడు. తిరిగి మీరిస్తే పుచ్చుకుంటాడు. మీరు ఒకవేళ యివ్వకపోయినా యివ్వమని అడుగడు. కనీసం

ఆ వస్తువునుగూర్చి ప్రస్తావించడు. అలా చేయడం అతనికీ, ఎదుటివారికీ గౌరవలోపమని అతడు భావించడమే కారణం. అంచేత అతనిదగ్గర పుచ్చుకున్న వస్తువును తిరిగి ఇవ్వాలన్న నిర్బంధం లేదు. అతని వస్తువేదైనా మనం పోగొడితే మనం అణుమాత్రం విచారించాల్సిన అవసరం లేదు. అతనూ విచారించడు! అసలు ఆ వస్తువు అతనిదైతేగా! నిజం విచారిస్తే 'నాది' అనబడే వస్తువ అతని దగ్గిర ఏదీలేదు. క్షవరంచేసుకొనే బ్లేడు మొదలుకొని మెడలో ధరించే నెక్టై వరకూ, అరువుతెచ్చిన వస్తువులే. కాని, అతన్ని చూచినవారికి గాని, అతనితో సంభాషించిన వారికి గాని, అతడు అరువు వస్తువులు ఉపయోగిస్తాడని అసలే తెలియదు. ఒకప్పుడు పరీక్షల సమయంలో నా పౌంటెన్‌కలం పనిచేయడం మానివేసింది. చాలామందిని కలమివ్వమని అర్థించాను. ఎవ్వరూ ఇవ్వలేదు. చివరకు గోపాలాన్ని అడగడమే తడవుగా 'పార్కర్' కలం ఇచ్చివేశాడు. అలనాడు మహారథి కర్ణుడు యుద్ధసమయంలో ఒకానొక యాచకునికి తన సర్వస్వంగా పరిగణించే అస్త్రాలను దానం చేశాడని పురాణగాథ వింటూఉంటాం. పరీక్షల సమయంలో ఒక విద్యార్థి తనకలాన్ని తోడి విద్యార్థికొరకు త్యాగం చేయడంకూడా కర్ణుని త్యాగానికి ఏమాత్రం తీసిపోదు. ఐతే దురదృష్టవశాన గోపాలం నామధేయం పురాణాల్లో కనుపించకపోవడం విచారణీయాంశమే - సరే - ఒకనాడు ఆ పవిత్రమైన - నా వరకే - కలాన్ని జేబులో వేసికొని ఇంటికి బస్సులో వస్తూంటే ఒకానొక పిల్లదొంగ తన హస్తలాఘవాన్ని దానిపై ప్రయోగించాడు. దానితో ఆ కలంతో వియోగం సంప్రాప్తించింది నాకు. గోపాలం కలం ఇలా నా జేబులోంచి మరొకడిజేబులోకి దిగడంతో నేను చాలా బాధపడి గోపాలం కనిపించినపుడు సవివరవృత్తాంతమంతా సవినయంగా మనవి చేసికొని త్వరలో కలానికి సరిపోయే ఖరీదు ముట్టజెబుతానని విన్నవించుకొన్నాను. ఆశ్చర్యం! గోపాలం దాతృత్వం చూడండి! తనకేమీ డబ్బు

ఇవ్వనక్కరలేదనీ, పోయిందానికి విచారం ఏమాత్రం వద్దనీ, ఇంతకూ ఆ లేఖినీరాజం తనది కాదనే పరమరహస్యాన్ని బయలు పెట్టాడు. దాంతో నా మనస్సులో చెలరేగుతున్న పెనుతుఫానుకు శాంతిమార్గం లభించింది.

ఇంతకీవిచారించాల్సిన విషయంఒకటి అనుకోకుండా జరిగిపోయింది. గోపాలం బి.ఏ. ప్యాసుకాక పోవడమే ఆ విషాద సంఘటన. అతనికి చదువుకోవడం చేతకాకకానీ, తగినన్ని పుస్తకాలు లేకకానీ, అలాకాలేదు. అతని దగ్గర ఉన్నన్ని పుస్తకాలు— అవి ఎవరివైనా కానీయండి— నాకు తెలిసినంతవరకూ, ఏ విద్యార్థిదగ్గర లేవు. సరికొత్త పుస్తకం మార్కెట్టులోకి వచ్చిందే తడవుగా గోపాలం పుస్తకాలబీరువాలో కని పించేది. ఇక చదువు విషయం చెప్పవలసి వస్తే గోపాలాన్ని ముందుగా పేర్కొనక పోతే నా మనస్సు ఒప్పుకోదు. కాలం వృథాపుచ్చడమంటే గోపాలానికి గిట్టని పని. అదను దొరికి నప్పుడల్లా పుస్తకాలు తిరగ వేయడమే అతని 'హాబీ'. ఇదే అతని మిత భాషిత్వానికీ, గాంభీర్యానికీ దారి తీసినది. ఇన్ని సద్గుణాలు కలిగి చివరకు బి.ఏ. ప్యాసుకాలేక పోయాడంటే కారణాంతరాలు లేకపోలేదు. గోపాలానికి తన పలుకు బడిపైన గాఢమైన నమ్మకమున్నది. కిళ్ళీకొట్టు నుంచి కాఫీహౌజు వరకు అతనికి కావలసిన సరుకులు క్రెడిట్‌పైన ఇస్తారు. వారంతా ఈతనిపైన ఇంతనమ్మకం కలిగి ఉండడం ఆశ్చర్యకరమైనదే. అసలు జరిగేదేమి టంటే కిళ్ళీ కావాల్సివచ్చి గోపాలం కొట్టుకు వెళ్ళుతాడు. అక్కడ అర్ధణా కిళ్ళీ కొని పదిరూపాయలనోటు అతని చేతిలో పెట్టేస్తాడు. అతను మిగతడబ్బు ఇవ్వ బోతే ఇప్పుడక్కరలేదనీ, అతని దగ్గరే ఉంచమని చెప్పేస్తాడు, దాంతో వ్యాపారి బోల్తాకొట్టి గోపాలం ఘరానా ప్రవర్తనకు లొంగిపోతాడు. అతడు కిళ్ళీలు అందివ్వడం ఈయన అందుకొనడం యథేచ్ఛగా సాగిపోతుంది. ఇతను పదిరూపాయల విషయం ఎత్తడు.

అతడు కిళ్ళీ డబ్బులు ప్రస్తావించడు. గోపాలం పదిరూపాయ లిచ్చాడన్న మాటేగాని, తనూ, తన స్నేహిత బృందం కలిసి కనీసం నలభైరూపాయల కిళ్ళీలు కాజేస్తారు. ఇటువంటి వ్యాపారం గోపాలం ప్రతివాడితో అంటే హోటలు, టాక్సీడ్రైవరు, జనరల్‌స్టోర్సు మొదలైన వారితో జరిపివేస్తాడు. ఇంతటి అనన్యమైన చాకచక్యం కలవాడు కాబట్టే పర్సులో పట్టుమని పదిపైసలు లేకపోయినా, పాతికమందికి పార్టీయివ్వగల ప్రతిభావంతుడు. కాని ఇలా ఎంతకాలం గడుస్తుంది! దీపావళి వచ్చింది. వ్యాపారులంతా తమ ఖాతాలను తిరగేసి లెక్కలు చూసుకుంటున్నారు. గోపాలం ఎవ్వరికీ వందరూపాయలకు తక్కువ బాకీ పడలేదు. బిల్లులు పరంపరగా వర్షించాయి గోపాలంపైన. సూక్ష్మగ్రాహి కాబట్టి ముందే మేల్కొన్నాడు మా స్నేహితుడు. వ్యాపారులనంతా తగిన సమాధానాలతో తృప్తిపరచి, స్వగ్రామంవెళ్ళి వారంరోజుల్లో డబ్బు ముట్టచెబుతానని వాగ్దానం చేశాడు. అదే ప్రకారం గది ఖాళీచేయకుండానే వెళ్ళిపోయాడు. మూడురోజులలో తిరిగి వస్తానన్న మిత్రుడు వారంరోజులైనా రాలేదు. ఇప్పటికికూడ రాలేదు. బహుశః ఇక రాడేమో అని అనుమానంగా ఉంది మాకంతా.





# దుష్టసంహారం

❖

శ్రీ కె. యల్. నర్సింహారావు

---

జననం : 1927

చిరునామా : 1-8-452, చిక్కడపల్లి, హైదరాబాదు—1.

కార్యకలాపాలు : ఆలిండియా రేడియో స్టాఫ్ ఆర్టిస్ట్.

అభిరుచి : నాటకరంగం.

రచనలు : ముద్రితం : ఆదర్శలోకాలు, గెలుపునీదే (నాటకాలు)
తెలంగాణా తీరుతెన్నులు (లేఖలు)
ఒకరోజు (నాటిక)

అముద్రితం : అడుగుజాడలు, సుడిగుండాలు, కాల
ప్రవాహం, కొత్తగుడి (నాటకాలు.)

అభిమాన రచయితలు : గోపీచంద్, బుచ్చిబాబు, చలం,
కొడవటిగంటి, శ్రీశ్రీ, శరత్.

# దుష్టసంహారం

ఈ లోకం చెడిపోవడం మొదలెట్టాక 'జ్ఞానం సంపాదించిన' మేధావులంతా బాగుచేయడానికి ఆలోచనలు మొదలెట్టారు.

"ఈతుక్కు ధర్మాలు మారా" లన్నారు కొందరు.

"ఈ చచ్చునీతులు పోవా" లన్నారు మరికొందరు.

"నూతన వ్యవస్థే రావా" లన్నారు మిగతావారు.

ఎలాగైతేనేం? అందరూ దాదాపు ఒకేరకంగా అన్నప్పటికీ వారి మార్గాలవల్ల లోకం బాగుపడ్డదనే సంతృప్తికన్న బాగుపడలేదనే అసంతృప్తే ఎక్కువగా కనబడడం మొదలెట్టింది.

ఇది కనిపెట్టి-

"తుపాకి సంపాదించిన" వీరుడు రాజయ్య కాస్త "అసలు మనుషులే మారా"లన్నాడు.

"ఇదెక్కడి మం"దని ఆశ్చర్యపడ్డారు దూర మాలోచించలేని మందమతులు.

"అమ్మో! భయంకర" మని భయపడ్డారు చాలామంది.

"అసలు మందు యిదే. దీనితోగాని లోకం బాగుపడదు. రాజయ్య అవతార మూర్తే" నని బలపరచారు అసంతృప్తివాదులు.

రాజయ్య బృందం అందరిలాగా ఆలోచించడ మొకసారీ, ఆచరించడ మొకసారీ చేయదు. రెండూ ఏక్దమ్మున కావాల్సిందేకానీ వాళ్ళ కార్యక్రమం నెరవేరడానికి ముందు కొంత విభజన చేసుకోవలసొచ్చింది. అదిమాత్ర మెంతసేపు?

'తన మంచివాళ్లు; యితర చెడ్డవాళ్ళు' అని. ఈ చెడ్డవాళ్ళవల్లనే లోకం చెడిపోతున్నది; వీళ్లను హతమారుస్తే గాని బాగుపడదనే నిర్ణయాని కొచ్చాక యిక పని శరవేగంతో మొదలయింది.

దానితో లోకం అల్లల్లాడి పోయింది. ఇదేం ఘోరం? ఎక్కడి సిద్ధాంత మిది? అని రకరకాల ఆలోచనలు లోలోన చేసినవారు లేక పోలేదు.

సరే - దానికేం? ఎవరికి తోచిన ఆలోచనలు వారివి.

అలాగే రాజయ్య ఆలోచనలుకూడా.

అయినా తండ్రి మందలించాడు-

"నీ సిద్ధాంతం ఏమీ బాగా లేదు"

"అదలాగే వుంటుంది. మీ పాత రకాలకు లోకం బాగుపడడం ఇష్టముండదు."

"ఇష్టమున్నా మార్గ మిది కాదు."

"ఇంకో మార్గమేం చచ్చింది?"

'మనుషుల్లో వున్న కుళ్లను తీసివెయ్యాలిగాని. కుళ్లున్న మనుషులను చంపడంకాదు గొప్పతనం.'

'మీదో వెర్రి ఆలోచన కాకపోతే మనుషులు లేంది కుళ్ళెలా వుంటుంది? కనుక మనుషులు పోతే కుళ్ల దే పోతుంది'

'అయితే కుళ్లలేని మనుషు లెవరు?'

'అది గ్రహించిన వాళ్ళం.'

'నీ వాదం తప్పు.'

'కాదు, మీదే.'

'ఎలా?'

"ఎలాగేమిటి? ప్రత్యక్షంగా కనబడుతూనే వుందిగా. ఇంతవరకు మీ సిద్ధాంతాలవల్ల లోకమేమైనా బాగుపడ్డట్టుందా?"

శాంతంగా ఆలోచిస్తే బోలెడంత బాగుపడ్డది"

"అందుకేనా రోజురోజుకు తినతిండి, కట్టగుడ్డ, ఉండ నిల్లు లేని వా రెక్కువవుతున్నారు?"

'అంతా ఒకేసారి మార్చగలమా?'

'మార్చలేనివాళ్ళు గాజులు తొడుక్కొని మూలన కూర్చోవడం మంచిది. కాని మార్చగలిగే వాళ్లను ఆటంక పెట్టడం ద్రోహం.'

'మంచీ చెడూ తెలియకుండా హత్యలేమిటి?'

'మంచీ చెడూ తేల్చుకున్నాం.'

'అది బెడుస్తుంది.'

"మీరు పిరికి వాళ్ళు. ధైర్యంలేదు."

'నీ ధైర్యమే ఎదురు తిరుగుతుంది. నా మాట విను.'

'లోకాన్ని బాగుచేయ దలచుకున్న వాళ్లు ఎవరిమాటా వినక్కర లేదు' అని తుపాకి తీసికొని బైటికడుగు వేయబోయాడు రాజయ్య.

'పిల్లకాయ ఆలోచనలు చేయకు. చెడిపోతావు. ప్రమాదం. వెళ్ళకు వెళ్లకు' అని దుఃఖిస్తూ గడపకడ్డంగా నుంచున్నాడు తండ్రి.

'ఈ విప్లవా న్నెవరూ అడ్డలేరు' అని తుపాకి నింపుకొని తండ్రిని నెట్టి పడవేసి వెళ్లిపొయ్యాడు రాజయ్య.

* * *

తండ్రన్నట్టు రాజయ్య మార్పుతీసుకొని రావడం అంత తేలికగా లేకపోయింది. తన బృందం ఒక ప్రక్క కాలుస్తుంటే-చెడ్డవాళ్లుకూడా పురుగుల్లాగా చచ్చిపోకుండా ఎదురు తిరగడం మొదలెట్టారు. అంతేకాదు తన మంచివాళ్లుకూడా కొందరు చెడ్డవాళ్లతో చేరిపొయ్యారు.

అయితే - యిక్కడ కొంత ప్లానును మార్చుకోవలసొచ్చింది. ఏమంటే తననుకున్న మంచివాళ్లుకూడా చెడ్డవాళ్లలో కలుస్తుంటే మంచీ చెడూ తేల్చుకోవడం కష్టమైంది, అనుభవమిమ్మిద.

అందుకని మంచివాళ్లూ చెడ్డవాళ్లూ యిట్టే తేలిపోయ్యేందు కోబ్రహ్మాండమైన ఎత్తెత్తాడు. ఇక తాను అడవిలో వుండి దుష్టసంహారం చేస్తాననీ, తనతో వచ్చేవాళ్లంతా మంచివాళ్లూ, ఊళ్లో వుండే వాళ్లంతా చెడ్డవాళ్లని తేల్చాడు. ఆ దెబ్బతో అసంతృప్తి వాదులంతా అతనితో అడవిత్రోవపట్టారు.

అడవి కెళ్లినప్పటినుండి యుద్ధవ్యూహము మార్చేశాడు. అంతా రాజనీతి, యుక్తులతో పనిసాగించాడు.

ఎప్పుడో అర్ధరాత్రులందు చెడ్డవాళ్ల చేతుల్లో ఆయుధంలేనిది కని పెట్టి హఠాత్తుగా సింహప్పిల్లలాగా వచ్చి మీదపడి వాళ్లు ఎన్నిసార్లు చెడ్డపనులు చేశారో అన్నిసార్లు కత్తులతో గాట్లుపెట్టి తుపాకులతో పొడిచి చిత్రహింసచేసి శవాన్ని కనబడకుండా మాయం చేసేవాళ్లు.

ఈ మాయ యుద్ధం తీవ్రతరం అయ్యాక పరిస్థితులలో విపరీత మైన మార్పు రావడం మొదలెట్టింది. అయితే అది రాజయ్య అనుకున్న మార్పుకాకపోవడం కొంత విచారమే!

ఏమంటే రాజయ్యబృందం అడవి కెళ్లిందనే గాని ఆనాటి అడవి మనుషుల్లాగా అక్కడి ఆహారానికి అలవాటు పడలేకపోయారు. ఆహార విషయంలో మాత్రం ఈనాటి మనుషుల్లాగా మెలగాల్సి వచ్చేసరికి మళ్లీ ఎలాగో ఒకలాగు వూరితో సంబంధం పెట్టుకోవలసొచ్చింది.

అందుకోసం మళ్ళీ తన ప్లానును మరికొంత మార్చుకోక తప్ప లేదు. తన బృందాన్ని చెడ్డవాళ్లకు పట్టివ్వకుండా, అన్నం పెట్టి రక్షణ యిచ్చిన వాళ్లల్లా మంచివాళ్లేనని ప్రకటించాడు రాజయ్య.

అయితే యిదే ఆలోచన వూళ్ళోవుండే చెడ్డవాళ్లకూడా కలక్క పోలేదు. అడవిలో వాళ్ళకు అన్నం పెట్టినా, రక్షణ యిచ్చినా చంపేస్తా మన్నారు. అంతేగాదు....చాటుచాటుగా రాజయ్య బృందాన్ని పట్టేసే యెత్తులుకూడా వెయ్యడం సాగించారు. అయితే యేం? చెడ్డవాళ్ళ

ఆటలు సాగవని అవతారమూర్తి రాజయ్యకు తెలియందికాదు. చాటు చాటుగా వచ్చి మంచివాండ్ల ఇండ్లలో భోంచేసి చెడ్డవాళ్లను చంపి అడవి కెడుతుండేవాడు. ఆవేళా అంతే. వెంకన్న యింటికి భోజనాని కొచ్చాడు.

.... .... .... .... .... ....

భోంచేసేటప్పుడు....

'మీరడవుల్ల ఎందుకుంటున్న' రన్నాడు వెంకన్న.

'చెబుతాగాని, ఇంటిచుట్టు కాపలావుందా?' అన్నాడు రాజయ్య.

'మాసిట్టిదే వుండదిగని, ఎందుకో చెప్పరూ?'

'ఆఁ! ఏమన్నావూ? అడవులలో ఎందుకుంటున్నామని కదూ?'

'గంతే.'

'ఎందుకేముంది? లోకాన్ని బాగుచేయడానికే'

'ఏలోకమండీ? అడవిలోకమా? మా లోకమా?'

'మీలోకమే'

'మరి మేము యీడ మీరు ఆడ వుంటే ఎట్ల బాగుపడి సత్తం? అసలు నాకు తెలువకడుగుత....మీరు అడవుల కెందుకు పోవాల్నుండీ.... యీడ్నే వుండకూడదుండీ?'

'ఈ చెడ్డవా ళ్ళూరుకోరు.'

'ఆళ్లను మీ జోలికి రానిత్తఁవా? మేం లేఁవూఁ?'

'మీరిలా యిక్కడుండి అన్నం పెట్టవలసిన వాళ్లేకాని....మాతో పాటు కష్టపడలేరు.'

'మీకన్నం బెట్టింది తెలిత్తే వూళ్లోల్లు వూరుకోరంట.'

'వాళ్ళంతా చెడ్డవాళ్లు.'

'ఓరుండీ?'

'అదే ఊళ్లోవాళ్లు.'

'నన్నేనానుండి....మీరు సెడ్డోడనేది?'

'ఎబ్బే : నిన్నుకాదు, ఊళ్లోవాళ్ళను.'

'నేనూ వూళ్లోన్ని కానుండీ ?'

'నీవు మంచివాడివే'

'మంచోళ్లంతా అడివిలుంటరేఁవో ?

'అలా అని కాదులే.'

'ఏఁవోనుండీ ! ఈడవుండి, మీకు అన్నం పెడుతున్నంగని, పెద బయమైతనే వుండది, ఊళ్లోల్లు యాడసంపుతరో అని. అందుకని నేనూ మీతో అడవికొచ్చి మంచోన్నయిపోత.'

'లాభంలేదు. నీవిక్కడుండటమే బాగు.'

'ఊళ్లోలతో దెబ్బలు తినటం బాగంటరా ?'

'ఆదుష్టులెవరో చెప్పు. వాళ్ళను సంహరిస్తాం'

'ఒక్కరై తేగద-ఊరంత'

'అయితే అందర్ని హతమారుస్తాం'

'నన్నుగూడనానుండీ?'

'నిన్నుగాదు'

'అందరు చచ్చినాక నేనేంచేత్త?'

'మాతోపాటు వుందువుగానిలే'

'యాడ? అడివిలనా?'

'అవును.'

'అడవికొద్దంటిరి గదనుండీ?'

'ఇప్పుడు కాదు. మన శత్రువులంతా నాశనమయ్యాక.'

'ఇంతట్ల ఆల్లే సంపేటట్టున్నారు.'

'ఆఁ! మేము లేఁవూ?'

'మీకేం తెలుత్తయి - మా కట్టాలు. అడివిల కూకుంటిరి. ఎప్పుడో బువ్వకొచ్చి పోతరు.'

'ఆఁ! మిమ్ముల కాచుకొనే వుంటాం తెలుసా?'

'ఏం కాసుకోనో? ఈలపెట్టు దూరంల వుంటరా?'

'ఓ! అలాగే' అని అబద్ధమాడాడు రాజయ్య.

'ఈలేత్తే యినబడుద్దా?'

'ఆ' అని భోంచెయ్యడం పూర్తిచేశాడు రాజయ్య,

'అట్టయితే ఊల్లోలు సంపటానికొచ్చిన్రు. ఈలేత్తున్నా' నని హఠాత్తుగా ఈల వేశాడు వెంకన్న.

ఎక్కడ్నుంచి మూగిందో పెద్దవాళ్ళ గుంపంతా వెంకన్న యిల్లు ముట్టడి వేసింది.

రాజయ్య తత్తర పడ్డాడు. ఏమీ తోచక-

'అప్పట్నుంచి ముచ్చట అంతరార్థమిదా? ఈల వేసిందిందుకా?' అని గర్జించాడు.

"నన్ను సంపటానికొచ్చిన్రు. ఆల్లందర్ని సావగొడతనంటిరి. ఇంగ సంప" మన్నాడు వెంకన్న.

"నిన్ను కాదు; నన్నే చంపడానికొచ్చా" రని నీళ్ళుమింగాడు రాజయ్య.

★

# దేవుని మరణం

❖

శ్రీ గిడుతూరి సూర్యం



జననం: 1921

చిరునామా: నారాయణగూడ, హైదరాబాదు—2.

కార్యకలాపాలు: సినిమా రచనలు, సహాయదర్శకత్వం.

అభిరుచి: సారస్వతం, చిత్రలేఖనం, నటన.

రచనలు: ముద్రితం: "మానవుడు" (మూకాభినయ నాటిక) "మైఁగరిబ్ హుఁ" ('మూర్తి' ఉరుదు నవల కనువాదం.); పత్రికలలో అనేక కథలు.

అముద్రితం: నాటకాలు: "గురూజీ" "యుగసంధ్య" "ఆహుతి."

నాటికలు: "అనార్కలి" "నిరుద్యోగి" "వెలుగు" "సంఘశక్తి" "కల్పవృక్షం"

నవల: "వెన్నెల"

రేడియో నాటికలు: "కన్నబిడ్డలు" (బహుమతి నొందిననాటిక)

కావ్యం: "చక్రఘోష."

అభిమాన రచయితలు: పోతన, తిక్కన, పెద్దన, విశ్వనాథ, శ్రీశ్రీ, ఆడెన్, ఓడెట్టి, పుష్కిన్, పికాసో.

# దేవుని మరణం

నారాయణరావు గదిలో కూర్చున్నాడు. నిన్న వచ్చిన రెండు ఇన్‌లాండు కవర్లు ఎదురుగా చాపమీద మొహం చిట్లించుకొని కూర్చున్నాయి. వాటికి సమాధానం వ్రాయాలనుకున్నాడు రావు. దగ్గు వచ్చింది. ఆగింది. ఆ వుత్తరాలు పూర్తిగా మరోసారి చదివి సమాధానం వ్రాయాలనుకున్నాడు. ఒకటి తమ్ముడు లక్ష్మణరావు దగ్గరనుంచి వచ్చింది. మరొకటి భార్య విమలదగ్గరనుంచి వచ్చింది. తమ్ముడు ఉత్తరం తీసుకున్నాడు. చదివాడు.

"అన్నయ్యా! ఉత్తరాలకు సమాధానమే రాయవు. ఇక్కడ నేను ఎన్ని బాధలు పడుతున్నానో ఆ భగవంతుడికే తెలుసు. నాన్న ఉంటే యిలా చేసేవాడా? ఆయన నిన్నెలా పెంచాడో జ్ఞాపకం చేసుకో. అసలు నన్ని యం. బి., బి. యస్. కోర్సులో ఎందుకు చేర్చావు? చేర్పించిన వాడివి ఆ హోదాకు తగినట్టు బట్టలు పట్టించడం, జీతాలు వగైరా సక్రమంగా కట్టడం ఎందుకు చెయ్యవు? ఎలాగో కష్టపడి కోర్సు పూర్తి చేయించావు. ఈ ఒక్క పదిహేనురోజులు గడిస్తే చాలు. పరీక్షఫీజు అప్పుచేసి కట్టాను. హాస్టల్‌బిల్లు అలాగేవుంది. అప్పులన్నీ తీరుస్తేగాని నేనిక్కడ్నుంచి రావడానికి వీల్లేదు. నువ్విదివరలో ఎన్నడూ నన్నింత కష్టపెట్టి ఎరుగవు. ఈ ఏడాదే చాలా బాధలు పెట్టావు. అయినదేదో అయిపోయింది. వెంటనే డబ్బు పంపించు. నీదగ్గు తగ్గిందని వ్రాశావు. సంతోషం. నాన్న జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నీగురించి భయం వేస్తుంది. ఆరోగ్యం జాగ్రత్త. నేను డిగ్రీ తీసుకున్న తర్వాత నీకేం భయం ఉండదనుకో. వదినెగారు పుట్టింటికి వెళ్ళారని వ్రాశావు. వచ్చారా? ఆమె పైకి

కోపిష్టిలా కనిపించినా చాలా మంచిది. నా నమస్కారాలు చెప్పు. నమస్తే."

ఉత్తరం చదివిన తర్వాత మరణశయ్యమీద తండ్రి జ్ఞాపకం వచ్చాడు నారాయణరావుకి. తమ్ముణ్ణి చేతుల్లో పెడుతూ తండ్రి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

"నాయనా! వీడ్ని మీచేతుల్లో పెడుతున్నా. నిన్నెలా పెంచానో వాణ్ణలా పెంచలేక పోయాను. వాడికి మీరే తల్లిదండ్రులు. నువ్వు చదివిస్తావో, ఏం చేస్తావో. ఒక యింటివాణ్ణిచేసి వాడి రెక్కలమీద వాడు ఆధారపడేవరకు ఆదుకో. ఆ తర్వాత నీయిష్టం."

రావు కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. తండ్రి చనిపోయేనాడే అతనికి ఉద్యోగం అయింది. తన సంపాదనతో తండ్రిని పోషించలేక పోయానే అని మధన పడ్డాడు రావు. తాను పొందిన సుఖంలో ఆవగింజంతయినా తన తమ్ముడు పొందలేదు. కారణం తల్లికి ఆలస్యంగా కాన్పురావడం, ఆమె తమ్ముణ్ణి కని మరణించడం, తండ్రికి బంగారం వ్యాపారంలో నష్టం రావడం, పేదరికాన్ని సహిస్తూ తనని అతికష్టంమీద బి. యల్ వరకు చదివించడం.

మంచి దుస్తులు, ఆటవస్తువులు, స్నేహితులు, సినిమాలు, హోటళ్లు, దేశాటన - వీటితో చిన్నతనంనుంచీ కాలేజీ జీవితం వరకు రావుకు హాయిగా, నిర్విచారంగా గడిచిపోయింది. కారణం తండ్రే.

తండ్రి చనిపోయేనాటికి రావు తమ్ముడు అయిదోఫారం చదువుతున్నాడు. అతడ్ని ఎలాగయినా పెద్ద చదువు చదివించాలని రావు నిశ్చయించుకున్నాడు. అంచేతనే తన మనస్సుకు వ్యతిరేకమయినా లంచాలు పుచ్చుకునేవాడు. ఆడబ్బు ఎవ్వరికి తెలియకుండా బ్యాంకులో వేశాడు. ఆఖరికి తనభార్య విమలకు కూడా తెలియనివ్వలేదు. తమ్ముణ్ణి చదివిస్తున్నాడు. లక్ష్మణ్‌రావు యింటర్ ప్యాసవగానే యం. బి. బి. యస్ లో చేరతానన్నాడు. అన్న ఒప్పుకున్నాడు. వొదినెకు ఆశ్చర్యం కలిగింది.

"ఏమండీ! మీకొచ్చే జీతం ఇంట్లోకే చాలడంలేదు. ఒక పూట కుండే మరోపూటకు వుండటంలేదు. ఈ పరిస్థితుల్లో ఎలా చదివిస్తారండీ. ఏదైనా ఉద్యోగంలో చేర్పించ కూడదా?" అని విమల భర్తతో చెప్పింది. ఇన్నాళ్ళూ దాచిన రహస్యాన్ని ఆరోజు భార్యకు వెలిబుచ్చుతూ బ్యాంకు పుస్తకం చూపించాడు. ఇంకా నాలుగువేల రూపాయలు విల వున్నాయి. విమల తనకళ్ళు తానే నమ్మలేక పోయింది. తనను ఎంతో ప్రేమిస్తున్న భర్త, తనకు తెలియకుండానే బ్యాంకులో డబ్బువేశాడే అని విస్తుపోయింది. అంత డబ్బు బ్యాంకులో ఉన్నా, తిండి దగ్గరగాని బట్టల విషయంలోగాని యింట్లో సరిగా యివ్వక యమబాధ పెట్టాడే అని బాధపడింది. అతనంటే ఆమెకు అనుమానం కలిగింది. అతనుచెప్పే ప్రతి మాటకి, చేసే ప్రతి చేతలకు అనుమానం విమలలో ప్రబలింది. అతన్ని నమ్మడం అసంభవ మనిపించిందామెకు. అప్పటినుంచీ ఆ యిద్దరి జీవితాల్లో ఎడమొగం పెడమొగం. ప్రతి చిన్న విషయంలో కీచులాట.

రావు బి.యల్. ప్యాసయినా ఉద్యోగంలో పైకి పోకుండా ఉండ డానికి కారణం అతను లంచాలు తినడమే. ఆకాశ రామన్న ఉత్తరాలు కుప్పలుగా రావడంవల్ల పై అధికారులు జోక్యం కలుగజేసుకోవలసి వచ్చింది. రావుకు హెచ్చరికకూడా యిచ్చారు. ఈ దఫా ఉద్యోగంలో నుంచి తీసేస్తారన్న సంగతికూడా రావుకు రూఢిగా తెలిసింది. అప్పటి నుంచి లంచాలు తీసుకోవడం మానేశాడు, జీవనోపాధి పోతుందేమోనన్న భయంవల్ల. అందువల్లనే తమ్ముడికి డబ్బు పంపే విషయంలో కటకట.

సరళ నారాయణరావు స్నేహితుని భార్య. ఆమెకు తన ఆఫీసులో టైపిస్టు ఉద్యోగం యిప్పించాడు రావు. ఆమె ఆఫీసులో ఎవ్వరితోనూ మాట్లాడదు. తన పనేదో తానుచేసుకొని యింటికి వెళ్ళిపోయేది. ఆమె గుండెల్లోని అఖాత విషాదగాథ రావు కొక్కనికే తెలుసు. అంచేతనే అతను ఉద్యోగం యిప్పించింది. సరళ ఆరేళ్ల కొడుకు బడి అయిపో

గానే తల్లి ఆఫీసు బయట వేచి ఉంటాడు. తల్లిరాగానే కలిసి వెళ్ళి పోతాడు. ఆ కుర్రాడంటే రావుకు ఎంతో యిష్టం. తన బిడ్డలాగే చూసు కొనేవాడు. అప్యాయంగా హృదయానికి హత్తుకొనేవాడు. ఒక్కొక్క ప్పుడు యింటికి తీసుకువెళ్లేవాడు. విమలకూడా ఆ పిల్లవాడ్ని ప్రేమతో చూసుకొని పిండివంటలు చేసిపెట్టేది. తనకూ అలాంటి బిడ్డపుడితే ఎంత అనందించే దానినో అని అనుకొనేది. రావుకు ఆ కుర్రవానిమీద అంత మక్కువ కలగడానికి కారణమేమా అని విమల అప్పుడప్పుడు ఆలోచించక పోలేదు. సరళ విషయం ఒకసారి రావు తనతో చెప్పాడు.

"సరళ యింటర్ చదివింది. నా స్నేహితుడ్నే ప్రేమించింది. తల్లిదండ్రులతో చెప్పింది, వర్ణాంతర వివాహానికి వాళ్లు ఒప్పుకోలేదు. ఆమె యిల్లు విడిచింది, వాణ్ణే పెళ్ళిచేసుకుంది. వాడికి ఉద్యోగం దొరక లేదు. సరళే ఉద్యోగంచేసి పోషించాల్సి వచ్చింది. చివరికి ఒక కంపె నీలో టైపిస్టుగా చేరింది. కొడుకు పుట్టాడు. ఇద్దరు ఎంతో ఆనందించారు. తమ సంతోషాన్ని యీ ప్రపంచంలో ఎవ్వరూ అడ్డలేరని తలపోసింది. నేను చిరునవ్వు నవ్వా. ఒకరోజున సరళ ఆలస్యంగా యింటికొచ్చింది జీవచ్ఛవంలా. భర్తమొహం చూడలేక పోయింది. పెద్దపులిని చూసిన జింకలా బెదరిపోయింది. ఆమె వాలకం చూసి భర్తకు అనుమానం వేసింది. రవికె చినిగింది. బుగ్గమీద ఎవరో కొరికిన మచ్చ. వాడికి ఎక్కడలేని కోపం వచ్చింది. తిట్టాడు. కొట్టాడు. ఆమె బాధపడలేదు. కాని చివరికి యిల్లువిడిచి వెళ్ళిపోయాడు. ఆమె కూలిపోయింది మొదలు నరికిన వృక్షంలా. ఆమె బిడ్డను కౌగలించుకొని ఏడ్చింది. తనకీ ప్రపంచంలో ఎవ్వరూ లేరని ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. కాని పిల్లవాడ్ని చూడగానే ఆమెకు ధైర్యంచాల్లేదు. బిడ్డకోసమే బ్రతికింది. మొదట మా ఆఫీసుకు ఉద్యోగం కోసం వచ్చినప్పుడు గుర్తుపట్టలేక పోయా. నన్ను గుర్తుపట్టి జరిగిన సంగతంతా చెప్పింది. ఉద్యోగం

యిప్పించా. విమలా ! ఆమెను యెవరు చెరచారో తెలుసా ? మెత్తనికత్తి, ఘరానాగా కార్లోతిరిగే మనిషి. ఆమె పనిచేసే కంపెనీ ప్రొప్రయిటరు, ఆమె సంసారంలో నిప్పులు పోశాడు. అందుకే ఆమెకు నేను అప్పుడప్పుడు సహాయం చేస్తూ ఉంటా."

విమల ఆగాథ విని నమ్మింది. కాని అది తన భర్త చెప్పడంవల్ల నమ్మలేక పోయింది. తన భర్తకు సరళమీద రోజు రోజుకు అనురాగం ఎక్కువవడం ఆమె సహించలేకపోయింది. పైగా రావు రోజూ రాత్రి ఎవి మిధి కొట్టగానే యిల్లు విడిచి వెళ్ళిపోతాడు. రాత్రి ఏమూడు గంటలకో వస్తాడు. ఇది విమల అనుమానాన్ని రెట్టించింది. తన భర్త సరళ యింటికే వెళ్తున్నాడని నిర్ధారణ చేసుకుంది. ఎంతోకాలం ఓపిక పట్టింది. చివరికి ఒకరోజున నిలబెట్టి అతను చేస్తున్నది అన్యాయమని చెప్పింది. సరళను తిట్టింది. రావుకు కోపం వచ్చింది. చెంప పగిలేట్టు కొట్టాడు. బయటకు వెళ్ళిపోయాడు. ఆనాడు రావు కళ్ళవెంట నీళ్లు తిరిగినయ్. విమలమీద చెయ్యిచేసుకోవడం అతని వైవాహిక జీవితంలో అదే మొదటి పర్యాయం. అతని మనసులో మనసు లేదు. నిజం చెప్పాలనుకున్నాడు. చెప్పలేక పోయాడు. భార్య హృదయంపై తలఆన్చి పిల్లవానిలా ఏడవా లనుకున్నాడు. దగ్గు ఎక్కువగా వచ్చింది. రాత్రి రెండింటికి యింటికి వచ్చాడు. తాళం పెట్టుంది. అతని గుండెలు ఝల్లుమన్నాయి. విమల ఎక్కడికి వెళ్ళిందా అని ఆలోచించాడు. ఒకవేళ ఆత్మహత్య చేసుకోను వెళ్ళిందా అన్న భావన అతనికి కలిగింది, హృదయం కంపించింది. అలా ఎప్పుడూ చేయదని మనసు సమాధానపరచింది. అతని మెదడులో అనేక ఊహలు మేకులు కొట్టినట్లయింది. విమల కనిపిస్తుందేమోనని పిచ్చివానిలా రోడ్లన్ని తిరిగాడు. సరళ యింటితలుపు కొట్టాడు. తలుపు తెరచింది సరళ. "మీరా? ఏమిటీ యిలాఉన్నారు. లోపలికి రండి." అని రావును లోనకూర్చో బెట్టింది. రావు అంతకుముందు విపరీతంగా దగ్గాడేమో నోటివెంట పెదవి

సందునుంచి నెత్తురుకారింది. సరళ నెత్తురుచూచి భయపడింది.కొంగుచించి తుడిచింది."ఎవరయినా కొట్టారా"అని అడుగుతూ రావు నొసలు పట్టుకొని చూచింది. జ్వరం మండిపోతోంది. రావు గదంతా ఎవరికోసమో కలయ చూశాడు, కనిపించక లేచాడు. "అవును సరళా! జీవితానికి పెద్ద దెబ్బే తగిలింది" అని వెళ్ళబోయాడు. వెళ్ళొద్దని సరళ బ్రతిమాలింది. రావు చిరునవ్వు నవ్వాడు. పిల్లవాడ్ని చూశాడు. ముద్దు పెట్టుకొని వెళ్ళి పోయాడు. తిన్నగా యింటికి వచ్చాడు. తప్పక విమల వచ్చి ఉంటుం దని మనసులో తలపోశాడు. కాని రాలేదు. పొరుగింటి వాళ్లు కళాపి జల్లుతూ రావునుచూసి "ఏదో పుట్టింటినుంచి టెలిగ్రాం వచ్చిందట. రాత్రే వెళ్ళిపోయింది. ఈ తాళంచెవి మీకిమ్మంది" అని తాళంచెవి యిచ్చారు. గబగబా తలుపు తెరచాడు రావు. ఉత్తరం కనిపించింది. "నా మనసు ఏమీ బాగోలేదు. కొన్నాళ్లు పుట్టింటిలో ఉండి వస్తాను" అని వ్రాసింది. రావు మనసు కొంత శాంతించింది. వెంటనే ఉత్తరం వ్రాయాలను కున్నాడు. కాని రాయలేదు. ఒక పదిరోజులు గడిచిన తర్వాత వ్రాశాడు. జవాబు వచ్చింది. విమల కోపం తగ్గలేదు. రావు దగ్గు ఎక్కువయింది. భోజనం సరిగా చెయ్యలేక పోతున్నాడు. రెండ్నెల్లు గడిచాయి. ఏనుగు లాంటి మనిషి పీనుగులాగయ్యాడు. ఆఫీసులో అందరికి ఆశ్చర్యం కలిగింది. విమల వచ్చేవరకు తనింట్లోనే ఉండమని సరళ బ్రతిమాలింది. వినలేదు. "ఏ ముండ యింటికి పోతాడో యింటిపట్టే ఉండడు. అందుకే పాపం ఆపిల్ల పుట్టింటికి పోయింది." అని యిరుగుపొరుగువా రంటుంటే రావు విని నవ్వుకొనేవాడు. భార్యకు ఉత్తరం వ్రాశాడు.

విమల దగ్గరనుంచి జవాబు వచ్చింది. అదే యీనాడు ఎదురుగా చాపమీద ఉంది. ఆ పుత్తరాన్ని రావు తీసుకొని మరొకసారి చదివాడు.

"మీరు కులాసాగా ఉన్నారను కుంటాను. నన్నే మీరు క్షమించాలి. భర్త ఎటువంటివారయినా భార్య సహించి అతనితో కాపురం చేయడమే

గొప్పతనం. నేను బలహీనురాలిని. ఆ కారణంవల్లనే ఈ సత్యాన్ని గ్రహించలేకపోయాను. ఈ ప్రపంచంలో నాలాంటి బలహీనులు పుట్ట కూడదు. కళ్లుమూసినా తెరచినా మీరే కనిపిస్తున్నారు. మీదగ్గు ఎలా ఉంది? మందుతీసుకోమని ఎన్నిసార్లు పోట్లాడినా మీరు వినిపించుకోరు. మరది చదువు పూర్తయింది. ఈ నెలాఖరుకు వచ్చేస్తాడు. బలవంతంగా మీనోట్లో మందుపోస్తాడు. అప్పుడుగాని మీరు వినరు. నేను ఒక వారం రోజుల్లో అక్కడికి వస్తున్నా. వీలయితే ఒక పాతిక రూపాయలు పంపించండి."

రావు నవ్వుకున్నాడు విమల అమాయకత్వానికి. ఆరెండు ఉత్త రాలు ప్రక్కకు పెట్టి ముందు తమ్మునికి సమాధానం వ్రాశాడు.

"తమ్ముడూ! నీవు త్వరలోనే వస్తున్నందుకు సంతోషం. నేను నిన్ను కష్టపెడుతున్న మాట నిజం. అందుకు నాన్న నన్ను క్షమించడు. అయన్ని త్వరలోనే క్షమాపణ వేడుకుందామనుకుంటున్నా. రెండు రోజుల్లో నీకు మొత్తం డబ్బు పంపుతున్నా. నీ చదువు పూర్తిచేయించి నందుకయినా నాన్న నన్ను క్షమిస్తాడనుకుంటున్నా. మీ వొదిన విష యంలో నీవు వ్రాసినది అక్షరాలా నిజం. ఉత్త వెర్రిబాగులది. ఒక వారం రోజుల్లో యిక్కడుంటుంది. నాదగ్గు పూర్తిగా నయమయింది. ఇప్పుడు రావడంలేదు."

రావుకు వోపలేని దగ్గు వచ్చింది. నెత్తురుకూడా పడింది. అలాగే కాసేపు కళ్లు మూసుకొని బాధ వోర్చుకున్నాడు. విమలకు ఉత్తరం వ్రాశాడు.

"విమలా! నీవు ప్రేమతో వ్రాసిన ఉత్తరం అందింది. నేను కేవలం అసమర్థుణ్ని. ఎవరికీ పనికిరానివాణ్ని. నేను పూర్వజన్మలో ఏం పాపం చేసుకున్నానో ఇప్పుడు అనుభవిస్తున్నాను. నాకు నీ హృదయంలో తావిచ్చినందుకు ధన్యుణ్ణి. నేనూ బలహీనుణ్ణే. లేకపోతే అమాయకురాల

మైన నీమీదకు లేచిన చేయిని ఆనాడే నరికి పేయవలసింది. పిరికివాణ్ని గనకనే ఆ శక్తి నాకు లేకపోయింది. నువ్విక్కడ కొచ్చినప్పుడు సరళ విషయం తెలియపరుస్తా. రేపు నీకు 50 రూపాయలు పంపుతున్నా."

రావుకు మళ్లీ దగ్గు వచ్చింది. రెండు ఉత్తరాలు పోస్టులో వేశాడు దగ్గుతూనే.

లక్ష్మణరావుకు అన్న పంపిన మనియార్డరు, ఉత్తరం అందాయి. అన్నగారి దగ్గు తగ్గిందని చదివి సంతోషించాడు కాని అతని కేదో అనుమానం వేసింది. మళ్ళీ చదువుకున్నాడు. అనుమానం ఎక్కువయింది. ఆరోజు ఆపరేషన్ టేబిల్‌మీద ఎవరో రోగి మరణావస్థలో ఉన్నాడు. అతడి మొహంలో తన అన్న మొహం కనిపించింది. ఒకసారి కళ్లు మూసుకొని తెరిచాడు. మళ్ళీ అన్నమొహం కనిపించింది. ముచ్చెమటలు క్రమ్మాయి. తనకలాంటి భావన ఎందుకు కలిగిందో ఊహించలేక పోయాడు. మనసు దిట్టపరచుకున్నాడు. వెంటనే వెళ్ళి అన్నగారిని చూడాలనిపించిండి. రైలు ఎక్కాడు.

రావు పంపిన డబ్బు ఉత్తరం విమలకు అందాయి. ఉత్తరాన్ని హృదయానికి హత్తుకుంది. మూడు నెలల గుండెబరువు ఒక్కసారే తగ్గిపోయిం దామెకు. ఆరాత్రి ఆమెకు హాయిగా నిద్రపట్టింది. మంచి కల వచ్చింది. సావిత్రి సత్యవంతుల్లా యిద్దరూ సుందరవనంలో విహరిస్తున్నారు. ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. ఆచెట్టు, పూలతో పండ్లతో బంగారు ఛాయతో వెలిగిపోతోంది. ఆచెట్టుమీద గూళ్లు కట్టుకొని పక్షులు హాయిగా కాపరం చేస్తున్నాయి. విమల చెట్టువంకే చూస్తోంది. ఆచెట్టు నున్న పసుపురంగు ఆమె పాదాలకు ముఖానికి పూసినట్లనిపించింది. ఆమె చూస్తుండగానే విపరీతమయిన గాలి వచ్చింది. పూలు పండ్లు జలజలా రాలాయి. ఆకులు కూడా రాలిపోయాయి. చెట్టంతా మ్రోడయింది. కొమ్మ ఫెళఫెళా విరిగి భర్తమీద పడింది. ఎవరో తనమెళ్ళో నల్ల

పూసలతో కూడిన మంగళసూత్రం తాడును బలవంతంగా తెంచిన ట్లయింది.

విమల ఉలిక్కిపడి లేచింది. ఆమెకు భయం వేసింది. ఆమర్నాడే రైల్లో భర్త దగ్గర కొచ్చింది. రావు ఆఫీసులో ఉన్నాడు. సాయంత్రం యింటికి వచ్చాడు. విమల అతన్ని గుర్తుపట్టలేక పోయింది. భర్తను కౌగలించుకొని వలవలా ఏడ్చింది. రావు ఓదార్చాడు. లోపలనుంచి వచ్చే దగ్గును బలవంతంగా ఆపుకున్నాడు.

"విమలా! వచ్చావా? ఇక నాకేం భయంలేదు. హోటలు కూడు పడలేదు విమలా! అందుకే చిక్కిపోయా. దగ్గుకు మందు తీసుకుం టున్నా. తమ్ముడు వచ్చి మందిచ్చే లోపుగానే నయమయిపోతుంది. ఇక వొళ్ళు చేస్తా. కోడి రామ్మూర్తంత కానా? ...విమలా! ఒక్కమాట. ఇవ్వాళ ఒక్కరోజే నన్ను బయటికి వెళ్ళనివ్వు. ఇదే ఆఖరిరోజు. రేపటి నుంచి వెళ్లను" అని రావు బయటికి వెళ్లిపోయాడు. విమల కుడికన్ను అదిరింది. ఆమె దుఃఖానికి అంతులేదు. ఇన్నాళ్లు కాపురం చేసినా భర్తను అర్థం చేసుకోనందుకు కుమిలి పోయింది. భర్త అలా అవడానికి కారణం తనేనవి వాపోయింది. ఎక్స్‌ప్రెస్‌లో లక్ష్మణరావు వచ్చాడు. మరిదిని చూడగానే విమలకు మరీ దుఃఖం వచ్చింది. అన్నగారి ఆరోగ్యం తెలుసుకోగానే లక్ష్మణరావు గాబరాపడ్డాడు.

"అన్నయ్య ఎక్కడికెళ్ళా డొదినా!"

విమల మాట్లాడలేదు. అతను మళ్ళీ అడిగాడు.

"ఏమో నాయనా! త్వరగానే వస్తారు."

లక్ష్మణరావుకు విమల గొంతులో ఏదో వేదన కనిపించింది. అను మానం కలిగింది. చెప్పేవరకు వూరుకోలేదు. చివరికి విమల చెప్పింది.

"మీ అన్నగారిలో ఉన్న బలహీనత అదొక్కటే నాయనా! నీకీ సంగతి తెలిసినట్టు వారికి తెలిస్తే చాలా బాధ పడతారు."

"అవును. మనోబాధవల్ల దగ్గు మరింత హెచ్చయి. ప్రమాదం కలగొచ్చు" అని లక్ష్మణరావు భావించాడు. "నేవెళ్లి తీసుకొస్తా వొదినా" అని చెప్పబోయి ఊరుకున్నాడు.

"వొదినా! నువ్వెళ్లి అన్నయ్యను తీసుకురా! సరళతో మాట్లాడు."

"విమల ఆలోచించింది. బయల్దేరింది. లక్ష్మణరావు తోడుగా వెళ్ళి వెలుపల దూరంగా నిలబడ్డాడు. విమల తలుపు కొట్టింది. సరళ తలుపు తెరచింది.

"ఎవరమ్మా మీరు ? ఏం కావాలి?"

విమల లోపలికి చూచింది. మంచం మీద ఎవరో పడుకున్నారు ముసుగుపెట్టి. 'తన భర్తే. అనుమానం లే' దనుకుంది విమల.

"నేనా. ఒక అభాగినిని. పతిభిక్షకోసం వచ్చాను. నాపేరు విమల. నారాయణరావుగారి భార్యను" సరళకు ఆశ్చర్యం కలిగింది.

"మీరా! లోపలికి రండి. మీమాటలు అర్థంకావడంలేదు. లోపలికి రండి."

విమల తిన్నగా మంచం దగ్గర కెళ్ళి ముసుగుతీసింది. ఆమె గుండెల్లో పెద్దరాయి పడ్డట్లయింది. ఆ వ్యక్తి తన భర్తకాదు. సరళకొడుకు.

"మావా రెక్కడో చెప్పండి" - విమల ప్రాధేయపూర్వకంగా అడిగింది. సరళ తల తిరిగింది. చేతులు చెవులను గట్టిగా మూశాయి. కోపంకూడా వచ్చింది. నారాయణరావు కళ్ళల్లో కనిపించాడు. శాంతించింది.

"విమలా! నీవు పొరపడుతున్నావు. ఆయన దేవుడిలాంటివారు. ఒకరిని యెన్నడూ కష్టపెట్టి ఎరుగరు. ఒకరు కష్టంలో ఉంటే చూడలేరు. వారు నాకెంతో సహాయం చేసిన మాట నిజం. వారే మాకు అన్నం పెట్టారు. కన్న తండ్రిలా కనికరించి మాకు నీడనిచ్చిన కరుణమూర్తి. వారెప్పుడూ యిక్కడికి రారు. రెండుమూడు మాసాల క్రితం

ఒకరాత్రి నాలుగ్గంటలకి మాయింటి కొచ్చారు. నోటివెంబడి నెత్తురు కారింది. తుడిచాను. ఎవరికోసమో ఇల్లంతా చూశారు. వెళ్లిపోయారు. ఆ రోజునుంచి ఆఫీసులో వారిని చూస్తున్నా. ఆయన ఎలాగో అయి పోయారు. నాతో మాట్లాడ్డంకూడా తగ్గించారు. చాలా చిక్కిపోయారు. మీరు వచ్చేవరకు మా యింట్లో భోంచెయ్యమని బ్రతిమాలాను. వినలేదు. మొన్ననే ఆఫీసులో అన్నారు. 'సరళా! ఒక వారంలో నాభార్య వస్తోంది. ఇకనాకు యిబ్బంది ఉండదు.' ఆరోజునుంచి ఆయన మొహంలో జీవకళ ఉట్టిపడుతోంది. ఈ వేళకూడా ఆయన మొహంలో ఆనందరేఖలు వెలిశాయి. ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. విమలా! వారు యింటికి రాలేదా?" అని సరళ అడిగింది. విమల మ్రానులా నిలబడి పోయింది. సొమ్మసిలి పడిపోతుంటే సరళ పట్టుకొని పడుకోపెట్టి మొహాన నీళ్లు జల్లింది.

"వొదినా!" అని లక్ష్మణరావు దిక్కులు పిక్కటిల్లేలా అరచాడు. సరళ బయటికొచ్చింది. రోడ్డుమీద జనం గుంపులుగా పోగయ్యారు. ఏమిటో లెమ్మనుకొని సరళ లోపలికి వెళ్లింది విమలను సేదదీర్చడానికి.

లక్ష్మణరావు వొడిలో నారాయణరావు తల ఉంది. చొక్కానిండా నెత్తురు. అన్నను రెండు చేతుల్లో ఎత్తుకొని సరళ గుమ్మంవద్ద కొచ్చాడు.

"బాబూ! మేం ఈయన రిక్షా తీసికెళ్లి యజమానికి యిచ్చేస్తాంగాని మీరు యింట్లోకి తీసుకెళ్లండి" అన్నారు రిక్షావాళ్లు. సరళ రావును చూసి కెవ్వున కేకవేసింది. రావును మంచంమీద పడుకోబెట్టమంది. డాక్టరు కోసం పరుగెత్తింది. విమల కళ్లు తెరచింది. భర్తను చూచింది. "వొదినా! నువ్వు కొంచం ధైర్యంగా ఉండాలి. ఏమాత్రం పెద్దగా ఏడ్చినా అన్నయ్య మనకు దక్కడు."....అని అన్నాడేగాని అతని గుండెలు వేగాన్ని ఏస్టెతస్కోపువల్లా లెఖ్ఖపెట్టలేం. విమల గజగజా వొణికి పోతోంది. దుఃఖం కట్టలు తెగిన ఏరులా పొంగివస్తోంది. చీరకొంగు

నోట్లో పెట్టుకొని ఏడుస్తోంది. సరళ డాక్టరును తెచ్చింది. విమల సరళను కౌగిలించుకుంది. డాక్టర్ యింజక్షన్ యిచ్చాడు. ఉదయాన్నే హాస్పిటల్‌లో చేర్పించ మన్నాడు. వెళ్లిపోయాడు. వీధిలో కుక్క భోరుమని ఏడ్చింది.

నారాయణరావు నెమ్మదిగా కళ్లు తెరచాడు. విమల కనుపించింది. "విమలా!" అని చేయిపట్టుకున్నాడు. నన్ను ఎన్నడూ విడిచి పోవద్దన్నట్టు విమల భర్తచేతిని గట్టిగా పట్టుకుంది. నారాయణరావు అర్థం చేసుకున్నాడు. అతని కనుకొనలనుంచి రెండు వేడి అశ్రుకణాలు రాలాయి. తమ్ముడ్ని చూశాడు.

"తమ్ముడూ! వచ్చావురా! ఇహ నాకేం భయంలేదు. విమలా, తమ్ముడొచ్చాడు. నేను చనిపోను." విమల భర్త నోరుమూసింది. మంగళసూత్రాన్ని కళ్ళకద్దుకొని దేవిని ప్రార్థించింది. అన్నగారి మాటలు వినగానే తమ్ముడు దుఃఖం ఆపుకోలేక "అన్నయ్యా" అని పెద్దగా అరచి కౌగలించుకొని ఏడ్చాడు. విమల బావురుమన్నది. సరళ కళ్ళవెంట ధారగా కన్నీరు ప్రవహించింది. పిల్లవాడు త్రుళ్ళిపడి మంచం మీదనుంచి లేచాడు. రావు దగ్గుతున్నాడు. పిల్లవాడు ఏడుపు మొహంతో తల్లిప్రక్క నిలబడి "అమ్మా! తాతయ్య అలా దగ్గుతున్నాడేమే" అన్నాడు.

దగ్గు ఆగింది. ఆయాసంతో ఎదురొమ్ములు పైకీ క్రిందికీ కొట్టుకున్నాయి.

"తమ్ముడూ! నువ్వుకూడా.... ఏడుస్తున్నావా?.... డాక్టర్.... ఏడుస్తాడా?.... వొదినెకు.... ధైర్యం చెప్పవూ?" అని రావు అంటూ ఉండగానే మృత్యుదేవత అతని ఊపిరితిత్తుల్ని ఒక్క తన్ను తన్నింది. మానవుడు పెనగు లాడుతున్నాడు.

"తమ్ముడూ! ఇక నేను బ్రతకను.... నాన్న క్షమించాడు.. వొదినెను నీ కప్పగిస్తున్నా.... ఒక కంట సరళను కూడా చూడు నాయనా.... విమలా!.... నాదేమైనా తప్పుంటే క్షమించు."

అంతా ఒక్కసారే గొల్లుమన్నారు. లక్ష్మణరావు కొయ్యబారి పోయాడు. అన్న రహస్యాన్ని మ్రింగేశాడు. కాని అది అతని ప్రేవుల్ని తొలిచేస్తోంది. 'హంతకుడు. అన్నను హత్యచేసిన కూనీకోరు' అంటోంది అతని హృదయం.

అన్న సైకిలురిక్షా తొక్కుతున్నాడు. తమ్ముడి చదువుకోసం అన్న రిక్షాతొక్కుతున్నాడు. దగ్గుతున్నాడు. నోటివెంట నెత్తురు కారుతున్నా రిక్షా ఆపకుండా తొక్కుతున్నాడు. గుక్క తిరగకుండా దగ్గుతున్నాడు. రిక్షా చక్రం గిరగిరా తిరుగుతోంది. అన్న జీవిత శకటంయొక్క ఇరుసు విడిచింది చక్రం. గిరగిరా తిరుగుతోంది. ఒంటరిగా రోడ్డుమీద పరుగెడుతోంది. వేగం తగ్గింది. సువ్వలు కనిపిస్తున్నాయి. ఆగింది. క్రిందపడి గిలగిలా కొట్టుకుంటోంది.

"అన్నయ్యా" అని భూనభోంతరాలు బ్రద్దలయ్యేట్టు కేకపెట్టాడు లక్ష్మణరావు, ఆ రహస్యం తనకు అన్నకే తెలిసినట్టు.

(ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రంవారు నిర్వహించిన కథానికల పోటీలో ప్రథమ బహుమతి పొందినకథ. ఆ. ఇం. రే. వారి సౌజన్యంతో.)



# నవ్వుల గజ్జెలు

❖

శ్రీ భాస్కరభట్ల కృష్ణారావు



జననం : 19 డిసెంబరు 1918

చిరునామా : A—10—643 హిమాయత్‌నగరం, హైదరాబాదు.

కార్యకలాపాలు : ప్రోగ్రాం అసిస్టెంటు, ఆలిండియారేడియో.

అభిరుచి : రేడియోనాటికలు, గ్రామస్థుల కార్యక్రమాలు రచన, నిర్వహణ.

రచనలు : ముద్రితం : కృష్ణారావు కథలు-కథల సంపుటి. 1955
చంద్రలోకానికి ప్రయాణం-కథలు. 1955

అముద్రితం : సంధ్య - నవల.

అభిమాన రచయితలు : క్రిష్టాఫర్ ఇషర్‌వుడ్, జీన్ పాల్‌సార్త్రే, విలియం సారాయన్, వర్జీనియా ఉల్ఫ్, జేమ్సు జాయెస్.

# నవ్వుల గజ్జెలు

"వేడిగా ఏ మేముంది ?"

"వడ, దోసె, ఇడ్లీ, పూరీ, బోండా, మైసూరుపాక్" ఏక బిగిని రాము పాఠం వల్లించాడు. బాల్యపు కంఠ మాధుర్యం యింకా చెదరి పోలేదు. వాడి చూపులు ఫామిలీ రూమ్స్ తలుపులకేసి పదే పదే పరుగు లెత్తుతున్నాయి.

"రెండు ప్లేట్లు ఇడ్లీ చట్నీ పట్రా !"

రాము వడిగా వంటింటివేపు నడిచాడు. నడుస్తుంటే శరీరంలోని బిగి స్పష్టంగా కనుపిస్తోంది. మధ్యలో అతనికి ఏదో పొరపాటు చేసినట్టు తట్టింది. గిరుక్కున వెనక్కి మర్లాడు. ఆ వూపుకి పచ్చటి శరీరంలో రంగు రంగుల ఇంద్ర ధనుస్సు మసిలింది.

నొప్పుల ఒళ్ళు ఎందుకో జిలజిల మంది. చప్పున ఆర్డర్ తీసు కున్న టేబిల్ దగ్గరకు వెళ్ళి "ఇడ్లీ లేదని" సమాధానం చెప్పాడు.

"ఇందాక వున్న దన్నావే ?"

ఆర్డర్ యిచ్చిన కుర్రాడు ఆలోచనలో పడ్డాడు.

"అయితే.... రెండు కప్పుల టీ పట్రా !"

"రెండు టీ" అని రాము గట్టిగా అరిచాడు. అరుపు వేగంతో వంటింట్లోకి వెళ్ళాడు. వంటింటి కౌంటర్ పైన "టీ" కనపడక పోవ డంతో ఎంతో విసుక్కున్నాడు. కౌంటర్ మీద మోచేతులు ఆనించి, వదులు వదులుగా నిలబడ్డాడు. కొంతసేపటికి టీ కప్పులు కనపడ్డాయి. వెంటనే అవి అందుకుని దుడుకుగా టేబుల్ దగ్గరకొచ్చాడు. కప్పుల అంచులు ఒరుసుకుని నడకలో టీ సాసర్లలో పడింది. టీ తగిలి, చేతి

బొటనవ్రేలు చురుక్కుమంది. చెయ్యి వణికింది. చేతిలోంచి కప్పు జారి ఆర్డరిచ్చిన కుర్రాడి ఒళ్లో పడింది. అతను దిగ్గున లేచి రాముని ఫెళ్ళున చెంపమీద కొట్టాడు. ఆ దెబ్బకి రెండవ కప్పు, ఎడమచేతి సాసర్‌లోంచి దొర్లి టేబుల్ పైన ముక్కలు ముక్కలైంది. టీ నాలుగు వేపులా చిమ్మింది. కొంత తనపైన పడేసరికి రాముకి మెళకువ వచ్చింది. పాముకి మల్లే "టీ" టేబులు పైన పాకి అంచుల్ని ఒరుసుకొని, రాము కాలి బొటన వ్రేలిపై పడింది. చెంప చురుకుతో కాలి చురుకు పెనవేసుకుంది. రాము శరీరంపైన పడగలు విప్పి, పాములు, జెర్రులు పాకాయి. ఒళ్ళు జిల జిలమని ఉప్పొంగింది. నరాలు బిగుసుకు పోయినాయి. మనసులో కోపం లేదు. కాని ఏదో ఒళ్ళు తెలియని ఉద్రేకం పొంగి రాము ఆర్డర్ యిచ్చిన కుర్రాడిని ఫెళ్లున కొట్టాడు. చెంప బుర బుర పొంగింది....రాము కళ్ళు మిణుగుర్లు కక్కాయి....ఉత్తర క్షణంలో జెర్రులు పాకడం మానుకున్నాయి....నరాల బిగువు సడలి, ప్రశాంతత ఆవరించింది. హోటలులోని మనుషులు ఈ సంఘటనకి ఏక కంఠంతో గొల్లుమన్నారు. కౌంటర్ మీది యజమాని తిట్ల వర్షంతో లేచాడు. దెబ్బలతో, తన్నులతో రాముని హోటల్‌లోనుంచి తరిమాడు. రాము గుడ్డల్ని అతనిపై గిరాటు వేశాడు. రాముకి ఎందుకో యజమానిపై తిరగబడదామన్న వాంఛే కలగలేదు. నరాలన్నీ సడలి ఒక విధమైన ఆనందం కమ్మింది. ఎందుకో శరీరం తడిబట్టకు మల్లే బిగుసుకు పోయింది. కళ్ళముందు నగ్నంగా రోడ్డు పరుచుకొని వుంది. బరువుగా అడుగులువేస్తూ రాము ముందుకు సాగాడు. హోటలులోని గోల క్రమంగా తగ్గి శరీరాన్ని తేలికపరచింది. కొంతదూరం అనాలోచితంగా నడిచాడు. కాళ్లు ఎందుకో పీక్కు పోతున్నాయి. ఎక్కడికి వెళ్ళటానికి తోచలేదు. కొద్దిగా ఆకలనిపించింది. ఆకలిని దులిపేసుకుని, రోడ్డు ప్రక్కనున్న మైదానంలో గుమిగూడిన ఒక గుంపులోకి వెళ్ళాడు.

గుంపుని చీల్చి మధ్యకు వెళ్ళడంలో, తనకు రెండింతలు పొడుగున్న మనిషి కాలు తొక్కాడు. "తిప్పి కొడితే మోకాలంత లేవు. కాలు తొక్కుతావా వెధవా?" అని అతను కస్సున లేచాడు. అంతకుముందే జరిగిన హోటలు సంగతి జ్ఞాపకం వచ్చి, రాము పిల్లికి మల్లే ముందుకు వెళ్ళి మొదటి వరుసలో కూర్చున్నాడు. అక్కడ మొగకోతి, ఆడ కోతిని బతిమాలుతున్నది. ఆడకోతి తల్లిగారింటికి వెడతానని మగకోతిని భయపెట్టుతున్నది. మగకోతి దగ్గరకు వెళ్ళడానికి ప్రయత్నిస్తున్నది. తల నిమరడానికి చూస్తోంది. ఆడకోతి గుర్రుమంటున్నది. ఆ కోతుల్ని చూస్తే నవ్వు వచ్చింది కాని, వాటి ఆలుమగల భాగోతం రాముని ఎందుకో "కలత" పెట్టింది. అతనికి ఆడకోతి తల నిమురాలనిపించింది. దిగ్గున లేచి రాము ఆడకోతి వేపు వెళ్లాడు. కోతులాడించేవాడు రాముని చూచి "అరే కుర్రాడా, కూర్చో" అని గద్దించాడు. రాముకి ఎందుకో కోతుల వాడు ఆడకోతిని నిమురుదామని లేచిన తనని "కుర్రా"డనటం వెగటుగా తోచింది. ఆ మాటతో ఉత్సాహం చచ్చింది. వెనక్కి వెళ్ళి తన మొదటి చోటుకి వచ్చి కూర్చున్నాడు. మగ కోతికీ, ఆడకోతిని బతిమిలాడి బతిమిలాడీ విసుగెత్తింది. అంత బతిమిలాడించుకోవడం చూచి రాముకి ఆడ కోతిపైన కోపం వచ్చింది. ఇంతలో మొగకోతి కర్ర తీసుకొని, ఆడకోతివెంట పడింది. ఆడకోతి కోతులాడించేవాడి చుట్టూ దొరకకుండా పరుగెత్తుతున్నది. వాడిచుట్టూ....అది అలా తిరుగుతుంటే, వాడిపైనా ఆ కోతిపైనా కోపం మరింత ఎక్కువైంది. మొగకోతి వేగం హెచ్చింది. త్వరగా ఆడకోతిని సమీపించి, రెండు బాదింది. ఆడకోతి కీచు కీచు లాడింది. మొగకోతి చెప్పినట్లల్లా వినడం మొదలు పెట్టింది. రాముకి ఎందుకో ఆడ కోతిని మక్కలు విరగదన్నాలని ఆ తర్వాత తల నిమురా లని అనిపించింది. ఆట ముగిసింది. కోతులాడించేవాడు డబ్బులు అడుక్కుంటున్నాడు. రాము అక్కడనుంచి లేచి, తిరిగి నడక సాగిం

చాడు. రోడ్డుపైన ఒక జంట చిరునవ్వులతో ముందుకు సాగింది. రాము తన కళ్ళని ఆ జంటకి వప్పగించాడు. జంట మూలమలుపు దాటింది. రాము తన కళ్ళను రోడ్డుపైకి మళ్ళించాడు. పర్దాతో ఒక రిక్షా ఎదురుగా వచ్చి, రాముని దాటేసి వెళ్ళింది. రాము కళ్ళు ఆ పర్దాని చీల్చడానికి ప్రయత్నించాయి. రోడ్డు ప్రక్కన ఆగిన కారులో నలుగురు యువకుల మధ్యనుంచి ఒక అమ్మాయి నవ్వు గలగల మంది. ఆ రవళిలో రాము చూపులు లీనమైనాయి. ఒక అమ్మాయి గాలికి ఎగురుతున్న కొంగుతో, సైకిలు పైన రాముని దాటేసి వెళ్ళింది. రాము చూపులు చక్రాల వేగంలో యిరుక్కొని పోయినాయి. ఎందుకో రాముకి ఆ సైకిలుని నిలుచున్న పాటున పడగొట్టా లనిపించింది. రాము సైకిలు మళ్ళిన సందులోకి వెళ్ళాడు. సైకిలు కనపడలేదు. ఏదో పోగొట్టుకున్న వాడికి మల్లే సందును ఒక్కసారి దిగులుగా కలియ జూశాడు. సందులో చీకట్లు అలుముకొంటున్నాయి. కళ్ళముందు మసక తెరల్ని ముంచుతున్నాయి. చీకట్లల్లోకి వెళ్ళడానికి అతని మనస్సు ఒప్పుకోలేదు. తిరిగి హోటలుకు వెడితే బాగుండు ననిపించింది. కాని తనని నిలుచున్న పాటున తరిమి వేసిన యజమాని తనకి ఆశ్రయ మిస్తాడన్న నమ్మకం లేదు. తనకు ఎక్కడా తలదాచుకోవడానికి చోటు లేదన్న తలపుతో రాముకి ఎంతో భయం వేసింది. ఆకలి వేస్తున్నది. తినడానికి ఏమైనా దొరికితే బాగుండు ననిపించింది. పోనీ చొక్కాలు అమ్ముకుంటే? చిరిగిన చొక్కాలు ఎవ్వరూ తీసుకోరనే అధైర్యం వెంటనే రాముకి తగిలింది. బిచ్చమెత్తు కుంటే? హోటలు ముందు రోజూ బిచ్చమెత్తుకునే బిచ్చగాళ్ళ దురవస్థ అతనికి జ్ఞాపకం వచ్చింది.

వెళ్ళగొట్టే ముందు తన యజమాని పనిచేసిన రోజులకు జీతమైనా కట్టిస్తే బాగుండేది. తనగతేమో ఆలోచించకుండా నిర్దాక్షిణ్యంగా వెళ్ళ గొట్టాడు. తాను రెండు సంవత్సరాలు చేసిన చాకిరీ అయినా అతనికి

గుర్తుకు రాలేదు. ఎన్నడూ లేనిది, యీ మధ్యనే తాను ఎన్నోసార్లు హోటల్‌లో తిరగబడటం జరిగింది. ఎందుకో యీమధ్యనే తనకు చిరాకు ఎక్కువైంది. ఎందుకో ఉదయం లేచేసరికల్లా, వళ్లు పచ్చిపుండుగా ంటుంది. ఎందుకో ఎండలో నిలబడా లనిపిస్తుంది. కెలికి కయ్యం ట్టుకోవాలని వుంటుంది. ఎవరినైనా కొట్టి, తన్నులు తినాలని రిక కలుగుతుంది, ఉద్రేకం పొంగించుకొని ఉపశమించుకోవాలని స్తుంది. పట్నమంతా ఒకటే పనిగా తిరగాలని వుంటుంది. దీని కంత కారణ మేమిటో రాముకి ఎంత ఆలోచించినా ఏమీ పాలు పోలేదు. ముకి ఏమీ తోచక వచ్చిన దారి పట్టాడు. అప్పటికే తాను తిరిగిన రోడ్డుపైన దీపాలు పెట్టివున్నాయి. దీపాల వంక చూస్తూ ముందుకు సాగడం మొదలెట్టాడు. పైన ఆకాశం మబ్బులతో పచ్చిగర్భిణిలా వుంది. వాన వస్తుందన్న భయమేసి, వడివడిగా నడిచాడు. వంద అడుగులు వేశాడో లేదో చినుకులు ప్రారంభమైనాయి. మరి కొంత దూరం నడిచే సరికి, పెద్ద జల్లు వచ్చింది. రాము వెంటనే ఒక కొట్టు చూరుకిందికి చేరుకున్నాడు. చినుకులు పడనిచోట నిలబడ్డాడు. కొట్టులోని దీపాల వెలుతురులో రకరకాల చీరెలు జిగేలు మంటున్నాయి.

రంగు చీర లన్నింటిని కప్పుకొని, వాటి మెత్తదనాన్ని తాకి ఆనందిస్తూ అక్కడే ఆ కొట్టులోనే పడుకోవా లనిపించింది. కాని కొట్టువాడి నల్లని లావుపాటి శరీరం చూచి భయమేసింది. వర్షం క్షణక్షణానికి ఎక్కువవుతున్నది. వర్షం తుంపరలు తుంపరలుగా రాముపైన పడుతున్నది. కడుపులో ఆకలి కలవర పెడుతున్నది. కాని వానతెరల్లోంచి వీధి దీపాలు ముచ్చటగా కనబడుతున్నాయి. ఏ హోటల్‌కైనా వెళ్ళి తిరిగి సర్వర్‌గా చేరితే? ఆకలికి కడుపులో ఏదో నులి ప్రారంభమైంది. అది నిముష నిముషానికి హెచ్చుతున్నది. చీరెల కొట్టువాడు కొట్టు కట్టేసే సన్నా

హాంలో ఉన్నాడు. దూరాన ఎక్కడో ఒక కుక్క ఏడుస్తున్నది. తనకి మల్లే ఆకలివేసికాబోలు. కుక్కమో స్తరుఆకలికి మనిషి ఎందుకు ఏడ్వడూ? ఏమో.... ఎందుకో లోపల లోపల కుళ్ళి బాధపడతాడు. అయినా ఈ అర్థరాత్రి ఉద్యోగం ఎవరిస్తారని? రాముకి తిరిగి తన హోటల్‌కి వెళ్ళి సర్వర్‌ని ఎవరైనా పట్టెడన్నంకోసం బ్రతిమలాడడం మంచిదనిపించింది. యజమాని రాత్రిపూట హోటల్‌లో వుండడు. అందువల్ల ఏ సర్వర్ ఐ[illegible] కనికరించ వచ్చు! కొట్టువాడు కొట్టుమూశాడు. కొట్టు ముందుభాగం గు[illegible] చీకటిలో మునిగింది. కొట్టువాడు కారెక్కి యింటికి వెళ్ళిపోయాడు. వర్ష[illegible] ఇంకా ఎడతెరిపి లేకుండా కురుస్తూనేవుంది. మధ్యమధ్య గాలి రివ్వున వీస్తున్నది. చలి ఎక్కువవుతున్నది. రాము చంకలోని చొక్కాలు తీసి, ఒకదానిపైన ఒకటి తొడుక్కున్నాడు. ఇక చంకలో రెండు ధోవతులు మాత్రం మిగిలాయి. ఇంకా చలిగానే ఉంది. రెండు ధోవతులు మడతపెట్టి కప్పుకున్నాడు. వర్షం వెలిసే సూచన ఎక్కడా కనబడలేదు. రెండు గంట లయింది. ఆకలికి కడుపులో పేగులు అరుస్తున్నాయి. హోటల్‌కి వెళ్ళ టం ఆ వానలో అసాధ్యమనిపించింది. వానలో బయలుదేరి వున్న రెండు బట్టలు తడుపుకోవడానికి రాము మనస్సు ఒప్పుకోలేదు. కొట్టుముందే ఆకలిపడక వేయడానికి నిశ్చయించుకున్నాడు. కప్పుకున్న ధోవతి తీసి కింద పరిచాడు. ఇంతలోకే తడుస్తూ ఒక కుక్కకూన కొట్టు కప్పుకిందికి పరుగెత్తుకొచ్చింది. రాము దాన్ని వెళ్ళగొట్టే ఉద్దేశ్యంతో దాని కడుపు పైన ఒక తన్ను తన్నాడు. కుంయిమని ఏడుస్తో అది ఒకమాటు కొట్టు దాటి వెలుపలకు వెళ్ళి, వానకి తిరిగి లోపలకు వచ్చింది. రాముకి దాని అవస్థ చూచి జాలివేసింది. ఏడుస్తో, అది తనకు ఎదురుగా వున్న మూలకి నక్కి పడుకుంది. రాము చేసేదేమీ లేక, తాను పరుచుకున్న ధోవతి మీద మేను వాల్చాడు. మిగిలిన యింకొక ధోవతి కప్పుకున్నాడు. ఈదురుగాలికి కళ్లు పొడుచుకున్నా నిద్ర రావడంలేదు.

చలీ, ఆకలీ పోటీలు పడుతున్నాయి. రెండు కలిసి, అప్పుడప్పుడు సమిష్టిగా, అతనిపైన ముట్టడి జరుపుతున్నాయి. వాటి తాకిడికి రాము క్రమంగా రోడ్డు దీపాల వంక చూస్తూ లొంగిపోతున్నాడు. జ్వరంతో శరీరం సలసల కాగుతున్నది. చలి మరీ ఎక్కువవుతున్నది. కళ్లు తదేకంగా దీపాలవేపు చూస్తున్నాయి. అయిదు.... పది.... యిరవై నిముషాలు గడిచాయి.... కుక్కకూన ఎదురుగా వున్న మూలలోంచి లేచి రాము పక్కలోకి వచ్చి పడుకుంది.... రాము కుడి చెయ్యి అనాలోచితంగా కుక్కకూన పైన బడి, దాని తల నిమరడం మొదలుపెట్టింది.... కూన మరీ రాము దగ్గిరికి జరిగింది. రాము కళ్లు బరువుగా మూతలు బడ్డాయి.... అడకోతి కిచకిచలు, రిక్షా చక్రాల గజ్జెలు, కారులోని అమ్మాయి నవ్వులు, గాలిలో ఎగురుతున్న పమిటలు, అతని చెవుల్లో గలగలా మోగినై.

అడకోతి కుప్పిగంతులు.... రిక్షాల పమిటెలు.... నవ్వుల గజ్జెలు... గాలి పర్దాలు అన్నీ వింటూ చూస్తూ కొట్లో కనిపించిన రంగురంగుల చీరెల కప్పుకొంటూ, నిద్రలో మునిగాడు. కొంతసేపటికి వాన వెలిసింది. .... కుక్కపిల్ల అతని చెయ్యి తప్పించుకుని తిరిగి వీధి కెక్కింది.





# నిట్టూర్పు

❖

శ్రీ నెల్లూరి కేశవస్వామి

---

జననం : 15 సెప్టెంబర్ 1920

చిరునామా : A—6—360 ఆజంజాహి రోడ్, (కాచీగూడ) హైద్రాబాదు-దక్కన్.

కార్యకలాపాలు : ప్రభుత్వోద్యోగి.

అభిరుచి : సాహిత్యం, సంగీతం, స్పోర్ట్స్

రచనలు : ముద్రితం : } కథలూ, నాటికలూ, వ్యాసాలూ.
అముద్రితం :

అభిమాన రచయితలు : ఐషర్‌వుడ్, కిషన్‌చందర్, గోపీచంద్.

*

# నిట్టూర్పు

లేదు సూరీ! లేదు.... తెరిపిలేని ఈ ఫైళ్ళ పరంపరకు అంతు లేదు. చెదలుపుట్టలా, బ్రహ్మజెముడులా తరిగిన కొద్దీ పెరిగే ఈ ముళ్ళ కంపకి నా జీవితమే అంకితమై పోయిందనీ, వీటి మధ్యే నేను నలిగి నశించి పోతున్నాననీ నీకు తెలీదూ?.... అంతా తెలిసి కూడా ఎంత అమాయకంగా complain చేస్తావు సూరీ! నేను వుత్తరాలు రాయడం లేదనీ. ఆశ్చర్య మేమిటంటే నువ్వూ నాలాంటి గుమాస్తావే అయి కూడా ఇంకా జీవితంలో వెలుగులకోసం, ఆనందాలకోసం ఎట్లా వెతగ్గలుగు తున్నావా? అని. మన కాలేజీరోజులూ, అప్పటి స్వేచ్ఛావిహారాలూ, వూహా సౌధాలూ, ప్రేమ కలాపాలూ ఇంకా.... ఇంకా నీకు జ్ఞాపకం వస్తయ్యా సూరీ? కవిత్వపు పిచ్చి నిన్నింకా వదల్లేదా? మీ town లో వున్న ఆ పాడుపడ్డ దేవాలయాన్ని ఎంతగా వర్ణించేశావు? అ వర్ణన ఎంత కృత్రిమంగా వుందో కూడా గమనించలేని పరిస్థితికి దిగజారిపోయావా సూరీ?

నన్నూ రాయమన్నావు. దేన్ని గురించి రాయను? ఈ ఆఫీసు నాలుగు గోడల మధ్య ఖైదీగావున్న నేను దేన్ని గురించి రాయను?.... పోనీ, మా ఆఫీసు భవనం గురించి రాయనా? నీ పాడుపడ్డ దేవా లయంతో పోలిస్తే ఈ మహానగరంలోవున్న నా ఆఫీసు ఇంద్ర భవనమై పోదూ! నిజంగా మా ఆఫీసు భవనం పేరుకూడా ఇంద్ర భవనమేనని నీకు తెలుసా? పూర్వం ఏ మహారాజో నిర్మించుకున్న ఇంద్ర భవనం ఇది. చుట్టు పక్కల కనుచూపు మేరలో ఎక్కడా పూరిల్లుగానీ, ఆఖరికి పెంకుటిల్లేనాగానీ కనుపించదు. అన్నీ దివ్యసుందర హార్మ్యాలే! వాటిలో

నివసించే దేవతలూ, అప్సరసలూ కార్లల్లో షికార్ల కెళుతుంటే రోడ్డు పక్కన బస్సుకోసం నిలుచున్న నేను, ఒక్కొసారి నన్ను నేనే మరిచి పోతుంటాను. కాని ఆ మరుక్షణం నా స్మృతి పథాన నా అద్దె కొంప, మురికి కాలువ, రోగిష్ఠి భార్య, చింకిరి గుడ్డల్లో పిల్లలూ, చంకలోవున్న ఆఫీసు ఫైళ్ళు కనిపించగానే వులిక్కిపడి తేరుకుంటాను. కలలు కరిగి పోతాయి; దేవలోకంలోంచి నన్నెవరో అమాంతంగా నరకకూపంలోకి తోసివేసినట్టనిపిస్తుంది....ఇది కవిత్వంకాదు సూరీ! కరడు కట్టిన కఠిన సత్యం! బూజుపట్టిన నీ దేవాలయపు కవిత్వంలోకంటే ఎన్నోరెట్లు నిజాయితీవుంది దీనిలో....

ఆఁ సుశీల ఏలావుందని అడిగావుకదూ? ఎల్లా వుంటుంది! ఎప్పటిలాగే క్షయ. క్షీణిస్తో హాయిగా కాలంవెళ్ళబుచ్చుతోంది. త్వరలోనే ముక్తి కలగవచ్చు— మొన్న సుశీలని చూసి రాజా ఏమన్నాడో తెలుసా? నేను హంతకుణ్ణట. ఆమె జీవితాన్నీ, అందాన్నీ, ఆనందాన్నీ హరిం చేస్తోన్న హంతకుణ్ణట. పువ్వుల్లో పెట్టి పూజించదగ్గ కోమలాంగిని చేతులారా చంపుకుంటున్న హంతకుణ్ణట!.... సూరీ! రాజా విదేశాలకు వెళ్ళి చాలా విషయాలు నేర్చుకు వచ్చాడు. మనం పుస్తకాల్లో చదివి మురిసి పోయే విషయాలెన్నో వాడు కళ్ళారా చూసివచ్చాడు. అవన్నీ ఇక్కడ లేవేమా అని వాపోతాడు. విసుక్కుంటాడు.... నా గురించీ, నా జీవితవిధానాన్ని గురించీ ఘంటన్నర లెక్చరిచ్చాడు. నీ దగ్గరికి వాడిని వొహసారి పంపిస్తాను. అక్కడ ఇంతకంటే పెద్దలెక్చర్లిచ్చే అవకాశం వుంటుంది. నువు వోపిగ్గా వినాలి. వాడి మాటలు నిజంగా వినటానికి ఎంతో సొంపుగా, అందంగా వుంటాయి. ఆ కాస్తసేపూ మనమూ మనుషులమేనేమో అనే భ్రమకూడా కలుగుతుంది! అవును. ఇల్లా ఎందు క్కాగూడదూ? అనే పిచ్చి ప్రశ్న హృదయంలో మొలకెత్తుతుంది కూడాను....

నాలో రావలసిన మార్పుల నెన్నింటినో చాలా విపులంగా శాంతంగా బోధించాడు రాజా. ఇల్లు మార్చాలన్నాడు, పుష్టినిచ్చే ఆహారం తీసికోవాలన్నాడు, మంచిమంచి మందులు వాడా లన్నాడు, వెంటవెంట దుస్తులు మార్చాలన్నాడు.... నిజమే, ఈ మార్పులన్నీ రావాలి, నిజమే.. కాని.... కాని సూరీ! నా ఈ గానుగెద్దు జీవితంలో మార్పు అంటూ వుందా? గానుగ జీవితాన్నించి తప్పించుకు పారిపోకండా నా మెడకు తగిలించిన ఈ ఆర్థిక దుస్థితిని ఏం చెయ్యను?.... 'మరి ఇంతమంది పిల్లల్ని ఎందుకు కన్నావ్?' అని నిలవదీసి అడుగుతాడు రాజా. ఏం చెప్పను? నేను, నాకూ నాభార్యా పిల్లలకేకాక దేశానికే ద్రోహం చేస్తోన్న ద్రోహినంటాడు; ఏంచెప్పను? వెంటనే నన్ను ఇహమీదటేనా పిల్లలు కలగకండా Operate చేయించుకోమంటాడు. ఏంచెప్పను?.... ఏమీ చెప్పలేక మొహం తేలేస్తే, నా వేపు కోపంగా, జాలిగా చూస్తో, 'నోరులేని పశువులు మీకంటే నయం!' అంటాడు రాజా.... కాదన్నానా నేను!....

అదిగో ఆఫీసరు Call bell మోగుతోంది. టేబిలుపైని ఫైళ్ళు కళ్ళెఱ్ఱ జేస్తున్నాయి. నా కింతకంటే వ్యవధిలేదు. శలవు.





# ప్రమాదవశాత్తు

❖

శ్రీ కొండి కృష్ణమూర్తి




జననం : 18-10-1925

చిరునామా : 5/549 కిషన్‌పురా, వరంగల్.


కార్యకలాపాలు : ఉపాధ్యాయవృత్తి, సారస్వతసేవ.

అభిరుచి : కథారచన, నాటకాలు, చిత్రరచన.

రచనలు : ముద్రితం : 1. కథలు రాయడమెలా ?
2. కృష్ణమూర్తి కథలు.
3. కృష్ణాంజలి.

అముద్రితం : 1. కృష్ణపక్షజీవితాలు, 2. కల్పన,
3. సంసార సాగరంలో సహధర్మచారిణిలు, 4. అవివాహితుడు.

అభిమాన రచయితలు : ఇబ్సెన్, ఛెకోవ్, మపాసా, టాల్‌స్టాయ్. శరత్, ప్రేమ్‌చంద్, అబ్బాస్, చలం, కొడవటిగంటి.

# ప్రమాదవశాత్తు

పొద్దున్నే ఐదున్నరకి లేవాలి. వీధీ, దొడ్డీ తుడిచి, నీళ్ల జల్లాలి. నిన్నటి వంటకు వాడిన రాసెడు అంట్లూ తోమాలి. పశువులపాక సాపు చేసి రెండు బర్రెల పాలూ పితకాలి. ఇంటిల్లి పాదికీ లేచేటప్పటికి పళ్ల తోముకునేందుకు నీళ్ళు తోడాలి.

ఏడింటికి అందరికీ కాఫీ సిద్ధం చెయ్యాలి. తను మాత్రం తాగ కూడదు. ఎందుకంటే మామగారి మేనత్త కాఫీ తాగినవాళ్ళ చేతిమీదుగా అన్నం తినదు. ఎనిమిదింటికి మడిగట్టుకుని పదింటిలోపల పదిమందికీ వంట చెయ్యాలి. లేకపోతే భర్త కోర్టుకు పోవడం ఆలస్య మవుతుంది. ఈలోపల అందరికీ స్నానాలకి వేడినీళ్లు సప్లై చెయ్యాలి. మధ్యలో ఆడబడచు లెవరన్నా కాఫీలకి ఆర్డర్లిస్తే ఆ పురమాయింపులన్నీ ఆద రించాలి. మడిమాత్రం చెడకూడదు. వేళకు మరిదిని కాలేజీకి, భర్తను కోర్టుకు పంపాలి.

మామగారు 11-30 కు గాని తినడు. ఆయన తినందే ఆడవా ళ్లెవరూ విస్తరి వేసుకోకూడదు. అందరూ తింటేగాని తను తినలేదు.

మళ్ళా భర్తకు రెండు గంటలకు టిఫినూ, మూడు గంటలకు అందరికీ 'టీ' ఇవన్నీ అయ్యేటప్పటికి రాత్రి వంట. రాత్రి పని ముగిసే ప్పటికి పది అవుతుంది. అందరికీ పక్కలు అమర్చి, తర్వాత తను నిద్ర పోవాలి.

కాపరానికి వొచ్చినప్పట్నుంచీ సూక్ష్మంగా చంద్రకాంత దినచర్య ఇది. లోకంలో బానిసత్వం తొలగిపోయిందనే అపభ్రమలో ఎవరన్నా

వుంటే చంద్రకాంతంవంటి వాళ్లను ఎంతో మందిని చూపగలను.... "ఓరగబడక. ఈ శతాబ్దంలో కూడా అదేం ఖర్మ!" అంటే చెప్పలేను.

ఇంతయినా ఆ ఇంట్లో ఒకళ్ళకీ చంద్రకాంతమీద ప్రేమ, సాను భూతి అనేవి లేవు. రుచులు కుదరలేదనో, పెరుగు పులిసిందనో, నీళ్లు మరగలేదనో ఈసడింపులూ, సాధింపులూ.

విధవాడబడుచుకి వేరే పనేలేదు. తిని కూచుని "ఆడబడుచు అర్ధ మొగుడు" అంటూ దీర్ఘాలు తీస్తూ, చంద్రకాంతని కోసి పెట్టడంతప్ప వేరే పనిలేదు.

చంద్రకాంత తండ్రి గౌరవ కుటుంబీకుడు. కుటుంబరావు పేరు తగినట్టే కుటుంబం కూడా పెద్దదే. నలుగురు మొగపిల్లలూ, ఆరు గురు ఆడపిల్లలూ. అందులో ఆఖరామె చంద్రకాంత. తరతరాలు ఊరికే కూచుని తినడంవల్లా, ఆరు పెళ్ళిళ్ళు అమోఘంగా చేయడం వల్లా కుటుంబ పరిస్థితి ఆర్థికంగా చితికిపోయినా, గౌరవ ప్రతిష్ఠల విషయంలో వేలెత్తి చూపలే రెవరూ.

ఆఖరిబిడ్డ చంద్రకాంత ఎంతో గారాబంగా పెరిగింది. చంద్రకాంత సుఖపడదని ఎవరూ అనుకోలేదు; ఆ భయమే కలగలేదు.

చంద్రకాంత భర్త సర్వేశ్వర్రావు ప్లీడరీ చేస్తున్నా భారమంతా సర్వేశ్వరుడిమీద వదలేసి, పెత్తనమంతా తండ్రికీ, అక్కగారికీ వొదిలి, నాలుగురాళ్లు తెచ్చి ఇంట్లో పడెయ్యడమే ఆశయంగా గల సాత్విక మహాశయుడు.

తండ్రీ, విధవక్కగారూ, పెళ్ళికాని చెల్లెలూ, కాలేజీలో చదివే తమ్ముడూ, తండ్రి మేనత్తా....అందర్నీ అతనే పోషించాలి.

చంద్రకాంత దినచర్య చెప్పడంలో నా వుద్దేశం ఆవిడ కష్టాలన్నీ ఏకరువుపెట్టి మీ సానుభూతిని పొందేలా చేద్దామని కాదు.

అంతకంటె ఎక్కువగా కష్టపడే వాళ్ళుకూడా వుంటారు. ఐనా ఏమాత్రం సౌఖ్యపు ఛాయల దరిదాపులకైనా చంద్రకాంతలా చేరనివాళ్లు అరుదుగా వుంటారనుకుంటాను. భర్త ప్రేమని పొందగలిగినట్టయితే చంద్రకాంత అంతకంటె రెట్టింపు కష్టాన్ని భరించ గలిగేది. సర్వేశ్వరావు స్వభావాన్ని చిత్రించడం కష్టం. ఈ క్రింది సంఘటన విన్నాక ఏమనుకోవాలో నాకే తెలీలేదు.

* * * * *

సర్వేశ్వరావు ఏడున్నర గంటలకు భోజనంచేసి మామూలుగా క్లబ్‌కి పోతాడు. రాత్రి పన్నెదైతేగాని రాడు. అందులో ఆడేది కాంట్రాక్టు బ్రిడ్జి. ఒక్కోరోజు రాత్రి రెండు గంటలుకూడా అయ్యేది.

చంద్రకాంత పనులన్నీ పూర్తయ్యాక తన గదిలోకి పోయి, భర్తకోసం నిరీక్షించి, నిరీక్షించి నిద్రపోయేది.

ఆ రోజున తలుపు తట్టినట్లయింది. వెళ్ళి తలుపుతీసింది,

ఎదురుగా మామగారు! చిరునవ్వుతో "ఏమే, కోడలా ఏంచేస్తు న్నావ్?" అన్నాడు.

చంద్రకాంత ప్రాణం పైకెగిరిపోయినట్టయింది. హడలిపోయింది. వెంటనే తలుపులు బిగించుకుంది. గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. కాళ్ళు వణకసాగాయి. భయంతో క్రుంగిపోయింది.

మామగారి విషపుదగ్గు, సకిలింపూ వినబడ్డాయి....

మర్నాటినుంచి విధవాడబడుచు కొత్త ఫర్మానా జారీచెయ్యసాగింది "తండ్రి నీళ్ళుపోసుకున్నంతసేపూ, అన్ని చేదలూ నీళ్ల చేదాలని," "మామగారంటే దైవ సమానుడు. అలాంటివాళ్ళకు ఏ సేవైనాచెయ్యాలి" అని బోధచేసింది.

"మీ నాన్నగారు కదా; నువ్వు మాత్రం సేవ చెయ్యకూడదా" అందా మనుకుందో, అందో చంద్రకాంత; నరరూప రాక్షసిలాంటి ఆ

యిల్లుబట్టిన విధవాడబడుచు మీద విరుచుకుపడింది; "నాకే ఎదురు చెబు తావు టే! ఆమాత్రం మామగారికి సపర్య చెయ్యకూడదూ? పత్తిత్తవు బయలుదేరావని. చూడండి ఎంత పొగరో? శతకోటి జంగాల్లో బోడి జంగమని. అక్కడికి తానొక్కత్తే పతివ్రతా శిరోమణి ఐనట్టు" అంటూ. ఇంటి పెంకులు ఎగిరిపోసాగాయి.

మనదేశంలో మధ్యతరగతి కుటుంబాల్లో వితంతువులు చేసే అఘాయిత్యాలు ఇంతా అంతా కాదు! ప్రతి ఇంట్లోనూ వాళ్ళమూలంగా ఎంత గోల జరుగుతుంది. ఈ మాటలురాసేది స్త్రీజాతిని, వితంతువుల్ని కించపర్చాలని కాదు. వాస్తవవిషయ మంతే!

అయితే అలా ఎందుకు జరుగుతుందీ అంటే కారణం లేకపోలేదు. మానవులకు సహజమైన జీవితంనుండే వాళ్ళు బలవంతంగా వేరుచేయ బడతారు. దానిక్కారణం మతం. పురాతనాచారాలు మొదలైనవి. సహజ ప్రవృత్తుల్ని అణగద్రొక్కుకున్నప్పుడు వాటిని మంచిమార్గాల్లోకి సబ్లిమేట్ చెయ్యకపోతే ఇలాంటి విషమ పరిణామాలకు దారితీస్తాయి.

ఎన్ని కష్టాలన్నా భరించింది గాని, ఈ బాధని చంద్రకాంత సహించలేకపోయింది.

రాత్రి భర్త కాళ్ళమీదపడి, ఏడ్చి విషయమంతా పూసగ్రుచ్చినట్టు చెప్పింది.

"ఐతే నన్నేం చెయ్యమంటావ్? నీకోసం మా వాళ్ళతో తగవు లాట ఎక్కడ పెంచుకోను? ఏదో నీ చాకచక్యంతో నువ్వే సర్దుకుపోవాలి. అయినా ఎప్పుడూ ఆడవాళ్ళ మానాన్ని రక్షిస్తో కూచోడమేనా మా పని? ఎవరిమానం వాళ్ళు కాపాడుకోవాలంతే!" అని కసిరాడు.

చంద్రకాంత కన్నీటితో తడిసిన తలగడా తన గుండెల్లో దాచు కుంది.

* * *

వారంరోజుల పనిమీద సర్వేశ్వర్రావు బొంబాయి వెళ్ళడంతో కథ క్లయిమాక్స్ అందుకుంది.

ఆ వారం రోజుల్లోనే తండ్రీ, కూతురూ చంద్రకాంతమీద కసి తీర్చుకున్నారు. ఒకనాటి రాత్రి ఆ యింట్లో బిగ్గరగా ఏడుపులూ, పెడ బొబ్బలూ, పిడిగుద్దులూ వినపడ్డాయి ఇరుగుపొరుగువారికి. మరునాడు పొద్దున్నే వాళ్ళకి నీళ్ళూ, కాఫీ సిద్ధమవలేదు. వీధికూడ శుభ్రంకాలేదు.

ఇంకా లేవలేదనుకుని చంద్రకాంత గదిలోకి వెళ్ళారు. ఆమె అక్కడలేదు.

ఇంటిల్లిపాదీలేచి ఇల్లూ, దొడ్డీ, బావీ వెతికారు, కాని కనపడలేదు.

చివరికి ఊరిబయట చెర్లో దొరికింది చంద్రకాంత శవం.

ఆ దృశ్యాన్ని ఇప్పటికీ మరువలేను. నిర్మలమైన ఆమెమొహంమీద ముత్యాల్లా మెరిసే నీటిబిందువులూ, నల్లని ముంగురులూ, వాడని ఆ తేజస్సు, చంద్రబింబంవంటి కాంతీని.

తర్వాతకథ ఊహించుకోలేనంత కష్టమైంది కాదు.

శవపంచాయితీలో "ప్రమాదవశాత్తు మరణం"పొందినదని తేలింది. నిజమేమైనా "మా వంశానికి తీరని కళంకం తెచ్చింది, పాతకి" అని ఆ కుటుంబీకులు ఇప్పటికీ ప్రచారం చేయడం మాత్రం నిజం!





# ప్రాణదత్త

❖

శ్రీ వేటూరి ఆనందమూర్తి

---

జననం : 1930

చిరునామా : A—1—294 నల్లకుంట, హైద్రాబాదు.

కార్యకలాపాలు : తెలుగు లెక్చరర్ - వాఙ్మయ పరిశోధన.

అభిరుచి : లలిత కళలు.

రచనలు : ముద్రితం : వివిధ సాహిత్య వ్యాసములు.
అగుమంచికథ (పరిష్కృతము)

అముద్రితం : పూలవిందు; ముకుందమాల; ఆధునిక భారతీయ చిత్రకళ (అనువాదము)

అభిమాన రచయితలు : నన్నయ్య; తాళ్లపాకవారు; విశ్వనాథ; కొడవటిగంటి; పాలగుమ్మి.

*

# ప్రాణదత్త

అది మార్చి యిరువది యొకటి. నా పనులన్నియు తీర్చుకొని కారులో మధ్యాహ్నము పండ్రెండు గంటల కింటికి వచ్చితిని. భోజనాదికమయిన పిదప నా గదిలో పడుక కుర్చీలో మేను వాల్చితిని. ప్రక్కనే టేబిల్‌మీద నరవిందుని 'సావిత్రి' పుస్తకమున్నది. దానిక్రింద నేదో కాగితమున్నది. తీసి చూచితిని. జోషీగారు మాయూరు వచ్చిరట. వారు విప్రవినోదుల వంటివారు. బ్రతికియున్నవారిని మాయముచేయ గలరట, మరణించినవారికి ప్రాణముపోయ గలరట. ఏనాడో పోయినవారిని కూడ పేరున బిలిచి ప్రాణములతో రప్పింప గలరట. అది యొక ప్రకటన పత్రము. కనుకట్టు విద్య కాబోలును. కాకున్న మన కీయవస్థ లెందుకు? మన కీశోకమెందులకు? నాలో నేను నవ్వుకుంటిని. కాగితము రెండవ ప్రక్క పెట్రోలు కంపెనీ ఐ. సీ. ఏ. ప్రకటన చిత్రమున్నది. ఒక కళేబరమునకు ఐ. సీ. ఏ. పోసినారు. అది నవచైతన్యముతో ప్రాణ శరీరమాయెను. "యాత్రలందు కారునందు నింపి యనుభవింపుడు" అని ప్రకటస మున్నది. కాగితము మడిచి నలిపి దూరముగా పారవేసితిని.

ఎండ తీవ్రముగనే యుండెను. దొడ్డి ^ని జిల్లేడుచెట్టు కాయ లెండలకు పగిలి బూరుగు గదిలోని కెగిరి వచ్చినవి. దెమ్మ తగులగా నేల కంటుకొని పోయినవి. బజారునుండి తెప్పించుకొన్న పది పౌనుల మంచుగడ్డను నా పాదములకడ పెట్టించుకొంటిని. ఎదుటనున్న రిఫ్రిజరేటరులోని పండ్లు నాలుగు తెప్పించుకొని తింటిని. కనులెదుట కుడ్యముపై నా గురుదేవుని చిత్రపటమున్నది. దాని క్రింద గాంధీ మహాత్ముని పటము. ఒక ప్రక్కగా రామకృష్ణునిది. మూటిని తిలకించి

తిని. సావిత్రిని చేతబట్టుకొని పుటలు తిరగవేసితిని. గోడ గడియారము టక్కు టక్కు మనుచునే ఒంటిగంట కొట్టినది. నేనొంటరిగా నుంటిని. నే నేకాకిని. పడకకుర్చీలో కనులు మూసికొనియే ఆలోచించ సాగితిని. నాది రాజయోగము.

కాలము గడిచిపోయినది. ఎంతకాలమునుండియో దేశముచూడవలె నన్న నా వాంఛ మీరిపోయినది. బండినిండుగా పెట్రోలు పోసికొనిబయలు దేరితిని. ఎచటికి ? కన్యాకుమారికి, కన్య ! కుమారి ! ఆవేగ మధికమై నాబండి మనోవేగమున వెడలిపోవుచున్నది. చక్రముపై చెయివేసితి నంతియే. నేను తోలుచున్నట్లే కనపడదు. కాలచక్రము తిరిగిపోవునట్లు నాబండి గిఱ్ఱున తిరిగిపోవుచున్నది. అగును. ఈతూరి కన్యాకుమారికే. ఏల ? పూర్వము వెడలి యుంటిని ఉత్తర దేశములకు. కాని నాకచట నేమియు గోచరింపలేదు. హిమాలయముల యౌన్నత్యము వీక్షించితిని. మధ్య భారత వైశాల్యము దర్శించితిని. ప్రాక్పశ్చిమ సముద్రముల గాంభీర్యము నవలోకించితిని. కాని నా మనసు కుదుటబడలేదు. నా యూహలు, భావనలు హిమగిరి శిఖరముల మీదిమీది కెటనో పోయినవి. కొంతవరకు వాని గమనము గుర్తింప గల్గితిని. ఆపై యెరుగరాదు. నాపని తెగిన గాలిపటమువలె నైనది. చెట్టునుండి గూడు వదలి చెదరి పోయిన పిట్టవలె నైనది. చేయి మిగిలి పోయినది. చెట్టు వట్టిపోయినది, తెగిన గాలిపటము తిరిగి నాచేతి కందునా ? చెదరిపోయిన పిట్ట తిరిగి చెట్టును చేరునా ? ఏమో....ఎవరికెఱుక ? గాలిపటము నాకందదేమోగాని యెచటనో పడుట మాత్రము తథ్యము. ఏగాలి వీచిన నటు తొలగి పోవును. మరి పిట్టయో ! గూడు వదలి పిట్ట యేమి చేయును ? తిరిగి తిరిగి పిట్ట గూడు తిరిగి ఛేరవలసినదే. భావనాసముద్రమున నంతులేని యాత యిది యెంతకాలము ? అందుచేతనే నేను కన్యాకుమారికి వెళ్లట, ధనుష్కోటిని దర్శింతును. ఆహా ! ఆ సన్నివేశ మెంత చిత్రమైనది !

ఎంత పవిత్రమైనది! అచట మూడు సంద్రములు ముప్పిరి గొనునట. మూడు దిక్కులు మొనసిపోవునట. ఆ యంచున నాకసము సంద్రమై ంద్రమాకసమై యుప్పొంగి పోవునట. ఆశల కన్నిటికి నంతు చిక్కు ట. చూడ దలచిన వన్నియు చూపు కందునట. ఈ తలపులు రాగానే లో నేదో యానందము తాండవించినది. నా బండివేగ మధికమైనది. భావనావేగ మంతకు మించినది. త్వరలో నా యగ్రమును చేరుదునా? ఆకన్య ననుభవింతునా? అసలా యగ్రబిందువును పొందగలనా? పిపాసార్తుడు తియ్యనీరుకై నూతిలో చేదవేసినట్లు పోయితిని పోయితిని కాని పొందలేక పోయితిని. పొందితినేమోనని చూచుకొంటిని. అది మరికొంత ప్రక్కగా జరిగినట్లు తోచినది. దోబూచులాడినది. సరిగా గుర్తింపలేక పోతిని. అయినను తత్సమీపమున నున్నట్లు మాత్రము వ్యక్తమైనది. మరి దానిని నేను పొందుటెపుడు? నేను పూర్ణుడనైనపుడు. అది యెపుడు? ముందు ముందు, బహు ముఖములై బయల్వెడలిన నా భావములన్నియు నేకముఖమై యెటకో కేంద్రీకృత మగుచున్నట్లుండెను. అంతలో నాకెంతయో మనశ్శాంతి. ఆకసమున కేసి చూచితిని. ఇది తూరుపు. ఇది పడమర, ఇది దక్షిణము అని యనుకొను విభాగమేదియు నా కగుపించలేదు. లేనిదాని నున్నదనుకొని చూడనున్న నన్ను చూచి నగుచున్నట్లు సముద్ర జలములు నురుగులతో, పరుగులతో నాపాదములంటి పరియాచకము లాడినవి. దానిలో ప్రాక్సముద్ర జలములేవి? పశ్చిమ సముద్ర జలములేవి? దక్షిణ సముద్ర జలములేవి? ఎట్లు కలిసి పోయినవి? నాకా సన్నివేశమంతయు విచిత్రముగాను, అననుభూతపూర్వకముగాను తోచెను. ఆ కెరటములనుండి నాలో నేదో నవ్య చైతన్యము ప్రవేశించినట్లయినది. నా యానంద మర్ణవ మైనది. అందు తరంగములు తాండవించినవి. దాని లోతులు తీయబోయినాను. ఈ యానందతరంగముల తాకిడికి నాలోని శోకమూర్తి నా చూపులకు

దూరదూరములకు తొలగిపోయెడి దిక్పతివోలె తొలగి పోయినది. అప్పుడు నా శరీరమున ప్రత్యణువు విద్యుద్ఘటన మొందినట్లు స్పందించినది. ప్రక్కనే శిశిరమున నాకులు రాల్చిన యశోక మొకటి యుండిన నా మనసు చిగిర్చి పూలు తొడుగగా నా యశోక మపర్ణ గానట్లున్న నా హృదయ మార్ద్రమైనది. నా పాదముల నా యశోకమును స్పృశి తిని: తత్‌క్షణముననే యది చిగిర్చి, రెమ్మ తొడిగి పూలుపూయ నా భించినది. వసంత ముదయించినట్లయినది, ఆ కొమ్మలపై చిలుకలు చే కిలకిల పలికినవి. నేనెంతయో ఆనందించితిని. చుట్టును పరికించితిని, నేనొంటరిని. నే నేకాకిని. నా యానందమున పాలుపంచుకొనువారెవరును లేరా ? నా హృదయ మేలనో తిరిగి యార్ద్రమైనది. సర్వ మానవకోటిని ధనుష్కోటికి రప్పించినచో వారందరు నీయానందమును పొందుదురు కదా ! పోనీ....నాలో గల్గిన యానందమును, నవచైతన్యమును నలుగురకు నందిచ్చినచో ! ఆ యూహ నాకు నచ్చినది. కాని నలుగురకు పంచినపుడు నా చైతన్య మంతమొందునా ? భయము కల్గినది. నా వెఱ్ఱి కాని....ఆ యాకసమున కంతమున్నదా ? ఆ సముద్రమున కంతు చిక్కునా ? చైతన్యమును గూర్చిన వెఱపు నాకేల ? లోభము లేక నేనిచ్చుచుండ నాకిచ్చువారుండరా ? నాకే లేని లోప మేరికో అంటగట్టు టేల ? ఆ సమాధానము నాకు నచ్చినది. అందుకే పోవలయును. అందరకు నీ యనుభూతి నందీయవలెను.

వెంటనే బండిని మరలించితిని. నామార్గమునకు కావేరులు, కృష్ణలు, గోదావరులు అడ్డురాలేదు. అవి వసుదేవునకు మార్గమిచ్చిన పుణ్యనదివోలె నిచ్చినవి. మఱి ! నేను కొనిపోవునది వాసంతమును కదా ! ఆనందమునుకదా ! సృష్టి యనుభవించి యెఱుగని సుందర చైతన్యమును కదా ! అందుచేతనే అవి దారి నిచ్చినవి. నేను వానిని

దాటిపోయితిని. ఎదుట వింధ్య గిరులు. ఆనా డగస్త్యునకు తలవొగ్గిన వింధ్యశిఖర మీనాడు నాకై మరింత వాల్చినది. నాబండి గంతున దానిని గమించినది. వెనుదిరిగి చూడలేదు, కాని నాకెఱుకయే ... నేను వచ్చినంతమేర వసంతలక్ష్మి నవచైతన్యముతో, పురుషుని గూడిన ప్రకృతివలె నన్ను వెంటనంటి వచ్చుచునే యున్నదని. నా గమనవేగ మధికమైనది. నేను ముందునకుబోవుచుండగా జగము వెనుకకు బోవుచున్నట్లు తోచినది. అదేమి? నన్నుజూచి వెఱచినదా? ఈర్ష్య వహించినదా? నాతో కలసి రాదేమి? ఆ దోష మెవరిది? ముందునకు బోవు నాదియా? వెనుకకు బోవు జగమునదా? కాదుకాదు. జగము విడిచి ముందుకుపోయి చేయునదేమి? ఆగుదును. ఆగి జగత్తును నాతోబాటు తీసికొని పోవుదును. అంతటితో నాబండి యాగిపోయినది. హిమాలయ పాదమూల మది. ఆ శిఖరౌన్నత్యము నాకు నవ్వుగొల్పినది. అహంకారముతో తల నిక్కించికొన్నట్లున్నది. ఒక్క భూకంపము చాలును. శిఖరము శిఖరము నేలమట్టమగునే? ఆగష్టు ఇరువది తొమ్మిది స్మృతికి వచ్చినది. టెన్సింగ్ నోర్కె దానినెక్కి యేమి యనుభవించినాడు? కన్యాకుమారిలో నేను పొందిన యనుభూతిని తాను పొందియుండునా? అసంభవము. ఇప్పుడు నేను కన్యాకుమారిని హిమాలయములకు దెచ్చితిని. కనుక నా కనుభూతి యధికమైనది. సప్తశృంగ మధిరోహించితిని. అప్పటి నా దృష్టిపథమున నావల చైనాదేశము, నీవల భారతవర్షము గోచరించినవి. అహంకారమున నిక్కియున్న దీనికి శృంగభంగమైనచో! ఏమగును? నేను క్రిందికి దిగివత్తును? అప్పుడు చైనాదేశమంతయు భారతవర్షమగును. అట్లననేల? భారతవర్షమంతయు చైనాదేశ మగును. అంతయు "లెవెల్" అగును. ఈనాడు విషువద్దినము. పవలు రాత్రియు సమానమే. ఈ సమతతో దేశములన్నియు నేకమైనట్లు తోచెను. మానవత కూడా నేకమైనది.

సప్తమశృంగమందే యుంటిని. మంచుచే గప్పబడిన హిమగిరి శిఖరము ధవళమైయున్నది! అపర్ణయు నందే యెందో ఉన్నది. మహేశ్వరు డిట తపమునకై వచ్చియున్నాడు. అందుచే నంతయు ప్రశాంత ముగా నున్నది. ఈశ్వరుని వృషభవాహన మటనే యెటనో పరుం నెమరువేసికొనుచున్నది. ఆ శిఖరస్వరూప మా భావమును దలపించినది కాని, చిత్రము! ఈ ధవళ గాత్రము నిండు చూలాలు. డొక్క లెగు వేసి ప్రసవించిన ట్లొక్కమారు మంచుకొండ యెగసియెగసి ఛటుక్కు జారిపోయినది. కనుమూసినంతలో నా లోయనుండి నాయెదుట నొక చిన్న సెలయేఱు, దానిలో నారడుగుల పొడవుగల తెల్లని పెద్ద పెట్టె యొకటి కొట్టుకొని వచ్చినది. దానిపై చెరిగిపోయిన ప్రాచీనకాలపు లిపి యున్నది. తంటాలుపడి దానిమూత తెఱచితిని. సన్నని వలిపము చాటున నెవరో స్త్రీ మూర్తి. ఆమె యపర్ణయా? శైలబాలయా? స్వచ్ఛమైన యామెమోము కాంతులు విదియనాటి చందురుని పలుచని వెన్నెలలు పచరించినవి. ఆమె యవనీతలంబున కవతరించిన తరుణ శశిలేఖ. హిమాచ్ఛాదితయై యున్నది. మోమున వలిపము తొలగించి చూచితిని. నిద్రాముద్రితమైయున్న యామె మోము దశమి చందురుని తలపించినది. కాని చంద్రున కున్న కందామె మోమునలేదు. కళలు మాత్రము మాయలేదు. దృష్టిమాత్రమున నామె సర్వ శరీరమును పరికించితిని. చైతన్యరహితమైన యా మూర్తి పుత్తడి బొమ్మ. నిశ్చలమై. నిర్వికారమై యున్నది. అప్పటి నా మనస్థితి కూడ అట్లే యుండినది. ఏ శిల్పి చేసిన దీప్రతిమ? ప్రతిమ చేసిన శిల్పి ప్రాణము పోయలేకపోయెనా? ఐనచో నాతని శ్రమ దేనికొఱకు? ఆమెకు జీవము రారాదా? ఈ తలపులలో నేదో మమత నాలో కల్గినది. నేను మానవుడను. నా హస్తమామె హస్తమును స్పృశించినది. జీవాణుస్పర్శవలన నామె హస్తములోని శైత్యము నాలోనికి ప్రవేశించినది. నాలోని చిరుపేడి యామె హస్తము

లోనికి ప్రసరించినది. నేను స్పృశించినంతమేర నామె హస్తమున చైతన్యము కలిగినది. చైతన్యమున్నంత మేర నా కనుబంధ మేర్పడినది. ఆ యనుబంధ మనురాగమై, బీజమంకురించి మొక్కయై, వృక్షమై, పూలు పూసి, కాయలు తొడిగినట్లు విస్తరించినది. నా హస్తస్పర్శ యామెకు చైతన్యమిచ్చునని నేనెఱుగను. పాదస్పర్శమున సపర్ణమైన యశోకము సపర్ణ కాలేదా? అప్పుడు నా కర్థమైనది. భుజస్కంధమునఱకు నామెను స్పృశించితిని. ఎంతవరకు స్పృశించితినో అంతవఱకు చైతన్యము కల్గినది. ...ష్మమాపకమున పాదరసమెక్కినట్లు నాలోని చైతన్య మామెలోని ...క్కుచుండెను. నా కానందము కల్గుచుండెను. నా యానందమును పంచుకొనుటకు చుట్టు నెవ్వరును లేరు. ఆమెను బ్రతికించుకొన్నచో? ఆమె నాది. ఆమెను నేను ప్రేమింతును. ఈ ప్రేమ యెట్టిది? మాతృ ప్రేమయా? సోదర ప్రేమయా? మధుర ప్రేమయా? అవిచ్ఛిన్నమైన ప్రేమస్వరూపమున కీయవధు లేమి? జగమున ప్రేమ కొక్కటే స్వరూపము. ఆ త్వరలో నారెండు హస్తములు ఆమె మోమును స్పృశించినవి. ఆమె కనులు తెరచినది. మోము విప్పినది, తల త్రిప్పినది. ఆమోమున పదునారు కళల చంద్రు డుదయించినాడు. దానితో నామె నేత్రములు సింధునదీ తోయముల వింతవిన్యాసము చూపినవి. ఆమె చక్షువులు నా చక్షువులకు ప్రీతిని గొల్పినవి. నా కామె దర్పణ మయినది. ఆమె నాయది. ఆమెను నేను ప్రేమించుచున్నాను. నే నామెను ప్రేమించుచున్నట్లు నా కప్పటివఱకు స్పష్టముగా తెలియదు. ఆమె వక్షమును స్పృశించినాను. హృదయమున చైతన్యము కల్గినది. టక్కుటక్కుమని స్పందనము వినవైనది. అవ్యక్తమైన యా స్పందనము నా వీనులలో వ్యక్తభాషణ మొనర్చినది. ప్రేమించు—జీవించు, ప్రేమించు—జీవించు, ప్రేమించు—జీవించు అని న న్నుద్బోధించినది. నాలోని ప్రత్యణువును నామెలోని ప్రత్యణువును స్పృశించినది. నా మన స్సామె మనస్సును సంగమించినది. నా

యనురాగ మంబరమైనది. దిక్కులు తెరచుకొనినవి. దాని యంచులు చూడబోయినాను. ఆమె జీవమూర్తియై "తండ్రీ! తండ్రీ!" యనుచు లేచినది.

"మీ రిట నుంటిరా?"

"నే నెవరు? నన్ను నీ వెఱుగుదువా?"

"నన్ను మీరెఱుగరా? మిమ్ము నేను గుర్తింతిని."

"నీవు నన్ను గుర్తించితివా? నేను నిన్ను గుర్తించ లేకుంటినే?"

"అగును. మీ స్వరూపము మారినది. అందుచే స్వరూపము మార్పులేని నన్ను మీరు గుర్తింపలేకున్నారు. మఱి నేను స్వరూపము మారలేదు. అందుచే మారిన మీ స్వరూపమును గుర్తించితిని."

"నాకు నీమాట లవ్యక్తములుగ నున్నవి, ఇది సంభావ్యమా? మారని స్వరూపము మారిన స్వరూపమును గుర్తించుటయా? ఇది లోక విరుద్ధము కదా!"

"అట్లుకాదు. నేను స్థిరముగనుంటిని. అందుచే మీ యస్థిరత్వ గుర్తించితిని. ఇక మీ యస్థిరత్వములోనే స్థిరత్వము నెలకొనుగాక!"

ఆ మాటలలోని యర్థ మేదో నన్ను ముగ్ధుని గావించి మురిపించినది. కట్టు కొయ్యకు గట్టివేసిన గోవువలె నా మన స్సామె చుట్టును తిరుగు లాడినది.

"మరి 'తండ్రీ' యని సంబోధించితి వెవరిని? నీ వెవరవు? నే నెవరను? ఆ ప్రశ్నకూడ నిన్నే వేయవలసి వచ్చినది."

"మా తండ్రినే స్మరించినాను. నేనెవరనో నాకెఱుక జేసిన వారు మీరే. మీ మూలముననే నేను నన్నెఱిగినాను. మిమ్ముల నెఱిగినాను. ఇక మన పూర్వమేల? అపూర్వము ముందున్నది. మీరు నాకు ప్రాణ దానము చేసినారు. అందుచే నేను ప్రాణదత్తను. ఇప్పుడు నేను ప్రాణ మను, మీ రీశ్వరులు. అందుచే మీరు నా ప్రాణేశ్వరులు."

"ఈ విజ్ఞానమంతయు నీ కెట్లు వచ్చినది?"

"మీ మూలముననే"

"అయిన మీ తండ్రిగారేరీ?"

"ఏమో. బహు కాలమైనది. వారు జగత్ప్రభువులు. నేను వారి బిడ్డను. నన్నెంతయో గారాబుగ పెంచిరి. వివాహము చేసిరి. కాని నాకా సౌభాగ్యము లేకపోయినది. వారు నన్ను దిగవిడచి హిమాలయ ములకు పోయినారు. నేను మూర్ఛపోతిని. మూర్ఛదేరి మిమ్ము జూచి తిని. మీరు నన్నువిడచి చనలేదని యెఱిగితిని. కాని నేను మా తండ్రి గారిని విడచి వచ్చితిని. నన్నిక కాలమేమియు చేయజాలదు. దేశములు నా కడ్డురావు. ఈ ప్రాణమయ శరీరమున కిక చ్యుతిలేదు. నన్ను విడువని వారిని నేను విడువను. నన్ను విడచిన వారినీ నేను విడవను. అందుచే నా దొక్కకోరిక! అన్నియు తీరినవి. తీర్తురా?"

"అది యేమి? నేను తీర్పజాలుదునా?"

"తప్పక తీర్చుకోగలము. రండు. మన దాంపత్యము లోకమున కారాధ్యము. మన కారాధ్యము. జగచ్ఛక్తి. మన కింత చైతన్య మొసగిన యా దివ్యశక్తిని ప్రార్థింతము. రండు. మన యైక్యములో సర్వశక్తి మంతుడైన జగత్ప్రభువు పరిపూర్ణత్వము స్థాపించుకొని తాను మనముగా మారిపోవును. మనము మారుటన్న జగము మారుటయే. ఒక్కమీట నొక్కగానే వెలుగు జగతి వెలిగినట్లు ఒకడు పొందిన యనుభూతి నొరులకు పొందించును జగతి. అది లోకము ముందుగతి. జగమెఱుగని యనుభూతి. అప్పుడు మనము ధనుష్కోటి శిఖరమును స్పష్టముగా పొందగలము. మీ కొదువ తీరును."

"నేను ధనుష్కోటి చూడబోతినని నీకెట్లు తెలియును?"

"చిత్ర మేమియు లేదు, అందరకు తెలిసినదే. లేకున్న మీకీ శక్తియు రాదు. నాకీ జీవమును లేదు. రండు, నాతోకూడిన మీ రిపుడు

పరిపూర్ణులు. భగవంతుని మన మీ యిలకు గొని రావచ్చును. మనకిక కన్యాకుమారి ప్రాప్యస్థానము. హిమగిరి ప్రవేశమార్గము. మానవత భగవంతుని పొందబోవు దశలో నున్నది. అదియే దివ్యజీవనము. అదియే మనవాంఛ. మానవవాంఛ."

ఆ మాటలలో నా శరీరము తన్మయత్వము చెందినది. నా కనుల యెదుటనే యీ యనంతావకాశమున జిల్లేడు బూదులవలె నేవేవో జీవాణుపులు చలించుచు చలించుచు—ఒకటిగా చేరి, ఆర్ద్రితచెంది, యైక్యమై, స్థూలరూపముదాల్చి నెమ్మదినెమ్మదిగా భువికి దిగుచుండినట్లు గోచరించినది. గాలిలో తెలిమబ్బులవలె నేవేవో విగ్రహములాడినట్లయినది. నా కదియంతయు దిగ్భ్రమగా నుండెను. కాని ప్రాణదత్త సాహచర్యమున నా కాసంస్కారము గల్గినది. ఇక నా కనులు తిరిగిపోవు."

"తల్లీ" అన్న కంఠ మాకసమునుండి వినవచ్చినది. ప్రాణదత్త యాశ్చర్య మేమియు లేక నేరికో కనులు మూసి సాష్టాంగ నమస్కృతి యొనర్చినది. నేనును గావించితిని. మేము సప్తమ శృంగమున సహస్రార పీఠమున నుంటిమి. మా శిరస్సుల నేదియో దివ్యహస్తము తాకినది. తోకచుక్కవలె నేదియో దివ్యశక్తి మాలోనికి ప్రవేశించినది. లేచి చూచుకొంటిమి. నా మోమున రాగరేఖలు, ఆమె మోమున కుంకుమ రాగరేఖలు. కనుల యెదుట నొక మహనీయ కమనీయ రూపము.

"తండ్రీ! మా కోరిక తీరినది. మా కోర్కె తీరినది. మీరే తీర్చినది."

నా కానందము పట్టరాకపోయినది. లేచి పరుగున వెళ్ళి వారి పాదముల బట్టుకొనబోతిని. కుడ్యమునకు నా తల తగిలినది. నేను నా గురుదేవుల శ్రీచరణ సన్నిధి నుంటిని. నా పాదములకడనుండిన మంచుగడ్డ కలవలె కరిగి నీరై పోయినది.



# రంగు లంగయ్య

❖

శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి



---

జననం : జులై, 1930

చిరునామా : 466, గౌలిగూడ, రామమందిర్, హైదరాబాదు.

కార్యకలాపాలు : నిజాంకళాశాలలో తెలుగులెక్చరర్, తెలంగాణా రచయితల సంఘం సహాయకార్యదర్శి.

అభిరుచి : సాహిత్యం, సాంఘిక సమస్యలు.

రచనలు : ముద్రితం : —

అముద్రితం : —

అభిమాన రచయితలు : నన్నయ్య, తిక్కన, విశ్వనాథ, పుట్టపర్తి నారాయణాచార్య, ఆళ్వారుస్వామి, దాశరథి, నారాయణరెడ్డి, ప్రేమ్‌చంద్, గాలిబ్, జోష్.

*

# రంగులంగయ్య

పదెండేసాలాయె రంగులంగయ్య ఈ ఊరికెల్లివోయి. వోని సంగతే మర్చిపోయిన్రుమంది. పొద్దుగల లింగన్నొచ్చిండంట. వోనికీసంగతి జెప్తే నగీనగీ సస్తడు. కల్లంకాడ కావలిగాసి మాపటాల ఇంటిముంగల గూకోని సుట్ట తాగుతుంటే లింగన్నొచ్చిండు. "ఏం! లింగన్నో బంగా రామై పోతివి. తాల్కుదారీ దొరికినట్టుండది నా ప్రాణానికి. కనుపడత లేవూ?" అంటని పిల్చి ముచ్చట మొదలుపెట్న. ఇంగ ముచ్చట్లంటే లింగయ్యకు పని ఉన్నగూడక్క గట్లనే కూకుంటడు. నీవు తిరపతికి వోయి నప్పుడు మసూరికో రంగులంగయ్య వచ్చిండె. ఏమి ఏసం, ఏం ఏసం! వస్తే ఏమైందంటని అడిగిండు లింగన్న. గట్లడగాంటన చెప్పిన.

ఆయాల్ల అయితారం. పొద్దస్తనం పొలంకాడ పనిజేసి అల్చి ఇంటికొస్తుంటే తోవల వోన వూపుడూపిందనుకో. తడిసి ముద్దైన. మీ అమ్మ యాడికి వోయిందిరా అంటని నారిగాన్నడిగిన. వోడేమో బట్ట గిట్టేసుకొని యాడికో తయారైండు. యాడికో పోతుండవు అంటని అడిగిన. "ఆడికే, అమ్మవోయిన తానికి. ఆల్చమైతే జాగ దొరకది. తప్పెటమీద ఊరంత సాటిచ్చిన్రు. దొరోల్లింటికాడ నాతట్కు బాగోతం ఆడతరంట. కుండల బువ్వుండది, పట్వాల జరకంత అంబలి ఉండది. అస్కుంత దిని నిన్ను నన్ను రమ్మంటని సెప్పి సంటోన్నెత్కొని అప్పుడే వోయింది. నేను వోతుండయ్యో జల్దిరా. గాంచునూనె గూడ లేదు కందిల్లకు." ఏంజేతు! రెక్కాడితేగాని బుక్కాడదంటని శాస్త్రం జెప్పినట్లు ఆడ కష్టపడపోతే ఓపూట కెల్లేది కష్టం. పనిజేసి ఇంటికొస్తే అడిగెటోడే లేకపాయె. ఎవడు వెట్టిండో ఏమోగాని గీసంసారం

మా చెడ్డది. ఎవని శావట్కంటని జేయాలె. ఎంతకంటని జేయాలె. ఎవరు తిట్నాపడాలె. రెక్కలిరగ కష్టం జేసినా పనంత పాతరేసిన వంటని కర్మమయ్యంటడు. ఏందో ఏంపాడో నాదో బత్కు. నిత్తె ఇట్ల అనుకుంటే పోతదా. గిది ఇప్పటిప్పటి ఏడ్పైతేకద. చిన్నప్పటి సంది ఉండదేనాయె. ఆస్కింత అంబలిదాగి నేను గూడ జూడవోయిన బాగోతం. వోన పడ్డది అంత బుర్జబుర్జ. అట్లనే గూకున్నరు తప్పదార మంది. ఆడ దీపాలు గూడ్క పెట్టలేదింగ. అర్గుల మీన దొర కుర్చేసు కోని కూకున్నడు. గాయన పక్కన ఇంగొగాయన ఎవరో కూకున్నడు. యాడికెల్లొచ్చిండో యేమో నల్లద్దాలు పెట్కున్నడు, నాతరీల నల్లగ కనపడతదో సిత్రం. మంది దొరసుట్టు మూగిన్రు. నేనుబోయి సూతును గద ఆ కొత్తగొచ్చిన పెద్దమంచి అంగి సిత్రంగుండది. తమాసంటే తమాసనుకోరాదు. అంగి ఎర్రగలేదు. కర్రెకలేదు. దానిమీన తేళ్లు, పాములూ, గాడుదులూ, పందులూ, మనుసులూ, అచ్చరాలు అన్నుం డయి సూడు. ఒక్కరంగా ఏం లెక్క. అన్ని రంగులుండయి. నేను రంగులంగయ్య అంట పెట్న వోని పేరు. బాగోతం అల్చమైందంటని గాయన నిలబడి సబ జెప్పె. మనమంత మొద్దులమంట. న్యాలం అన్యాలం ఏదెల్వదంట. గలీజులమంట. రకంగిట్ట గట్టమంట. ఇమానం లేదంట. ఇంగెమేమో గిట్టనే జెప్పిండనుకోరాదు, సదువుకోండి. ఊరు సాపుగా పెట్టుకోండి. టీకాలుగిట్ట తీపిచ్కోండి. మీరు మంచోళ్ళు. చదువు నేర్చుకోండి అంటని శనామంది పట్నంకెల్లొచ్చి సెప్పిపోయిరిగద నారి గాని ఇసుంటోన్ని ఎన్నడు చూడలేదు. "సుతారం చెప్పవట్టివి. గటొంకట శానమంది ఇసుంటోల్లు గనపడతరు. గిట్లదిట్టరనుకో. సర్కార్ల కొలువు జేసెటోల్ల గూడ్క గిసువంటి అంగులే తొడుగుతరు" అన్నడు లింగన్న. "అంత బుర్జఉండది. ఇయాల్ల బాగోతం గిట్టేం ఏం లేదంటని దొర మమ్ముల్నందర్ని వొమ్మంటనె. రంగులంగయ్య

సబ జెప్తుంటే దొర ఎనక నిలబడ్డ మనుషులు గుసగుసలాడు కున్నరు. వీడేంటికంట ఈ ఊరికొచ్చెనో తిక్కతిక్క మాట్లాడుతుండడు." ఇంగా అల్సమైతే మాటదక్కదంటని దొర ఇంట కొమ్మన్నడో ఏమో! మేమంత ఇంటికి పోయినం.

పొద్దగల బాజేపల్లికి వోవాల్నంటని రైలెక్క నీకే టేసనకు వోయన. బాజపల్లిలోనే ఉండై గుండ్కలు, అండాలు, పగ్గాలుగిట్ట. నాతిరి రంగు లంగయ్య కనపడ్డడు. ఆయాల్ల గాడేంటికో ఆల్సమైంది. రైలోల్ల నూరికె దిట్టిండుగా అయ్య. తిక్కట్లకేమో పైసలు దీస్కుంట రంటగాని ఇంతజాంగిట్ట జెయ్యరంట. సర్కారోల్లకు పైసలతోనే అక్కరుండదంటగాని మందికి మేలుజెయ్యాలంట లేదంట. అంటని ఏమేమో తిడుతుండడు. జరసేపటికి గాడొచ్చినాక్క గాయ నేడబ్బలెక్కిండో నేనదే డబ్బలెక్కిన. యాడికెల్లొస్తుండరో తప్పదారమంది. పెదింత సామానుండది. నిలవడదమంటే సోటులేదు. కొందరేమో పండుకున్నరు. అదేందో, పైసలు సమానంగనే ఇచ్చి దొరల్లాక పండుకోకపోతె ఏమాయెనో, రంగు లంగయ్య ఎవరో గొంగటోడు కుర్చిమీన గూకుంటే వోన్ని బాసలదిట్టి లేపిండు. ఊకెనన్న గూసోక తిట్టవట్టిండు డబ్బలున్నోళ్ళందర్ని. ఇంగో టేసనొచ్చినాంక ఆడ వోఆడిపిల్లెక్కిందిరా. పాపం సోరది. సంకల పిలగాడుండడు. నెత్తిన మూటుండది. పాపం! ఎంతదూరంకెల్లి వచ్చిందేమో ఎగతేకు తుండిది. సెమ్టలొస్తుండై దానికి. కొంతమంది దుడ్డాగాండ్లు అగ్బార్లుగిట్ట సదువు తుండరు. కొంతమంది పురాస్తుగ గూశోని పత్తాలాడు తుండరు అంతమందిల. సదుర్తే సోటు లేకపోలేదు. యెళ్ళక పోయనాగ నాకు లేకపోతే లేకపోయెగాని గాపిల్లకు జరచోటు ఇయ్యక పోయిరి. రంగు లంగయ్యను జూసి "ఆ పిల్లతల్లి మీద గూడక్క దయరాదా నీకు. పెద్దపెద్ద ముచ్చట్లు చెప్తవు జరసోటియ్యంట నడిగిన దైర్నంజేసి. వోనికి కోపమొచ్చి. మాతాన తిక్కట్లు

లేవంటని, మేము గాడ్దులమంటని ఏమేమొ తిట్తుంటే తిక్కట్లు సూసె టాయనొచ్చిండు. మేమంత తిక్కట్లు సూపించినం. రంగు లంగయ్య నడిగిండు. తిక్కట్టులేదు పిక్కట్టులేదు. "సారిః సారిః" అనే అంటాడు గాని తిక్కటు సూపియ్యడు. ఈసారి తీసుకుంటననేమతలబో ఏంపాడో. ఆపిల్లతల్లికి ధైర్నమొచ్చిందనకో గైఁ మనంటలేచింది వోనిమీదికి. 'వీని నోట్ల మన్నువొయ్య! వీన్ని కచ్చేరికి పట్టిచ్చు దొరా! మాతాన తిక్కట్లు లేవంటని తిట్తున్నడప్పటినుంచి, పండుగ సాయగాడున్నట్లున్నడు వీని పీనిగెల్ల. బైరూపులాల్లలాక, పగటేశగాల్లలాక ఏసమేసుకుని మందిని బెదిరిస్తుండుడు' అంటని ఊపుడూపింది. గిసుంటోల్లందర్ని దిట్టాల్నం టని నాకు దూప ఉండది శనాకాలం సంది. ఇన్ని ఒద్దులైన నాకు కలిసిరాలే. ఇనిస్పిటరు వోన్ని దోడుకుపోయుండు యాడికో.

ఇన్నావు లింగన్నా. గిసుంటోల్లింగా ఉన్నరు. మన దేశంపొంటి. మనం జర్ర చదువుకుంటే వీళ్ళన ఏడు చెర్లలీల్లు దాపించొచ్చు. మాప టాల సదువుకోను వోదమంటే తీర్తేనా. ఇంటి గాల్కడుండదిగద. మల్లెప్పుడన్న రా!

లింగన్నెల్లి పోయిండు, కోడెదూడ వెంటపెట్కోని చేతులో పెండగంప తీస్కోని మల్లివచ్చి బువ్వదిందురా అంటని లోపలికి విల్చింది.

*



# లంకా పునరుద్ధరణ

❖

శ్రీ కాళోజి నారాయణరావు



జననం : 9-9-1914

చిరునామా : నక్కలగుట్ట, హనుమకొండ, వరంగల్.

కార్యకలాపాలు : అధ్య : తెలంగాణా రచయితల సంఘం.

అభిరుచి : సారస్వతం.

రచనలు : ముద్రితం : కాళోజి కథలు, 'నాగొడవ', ఇంకా ఇతర కథానికలు, గేయాలు.

అముద్రితం : 'పరమాత్ముని ఆత్మ కథ' గార్లపాటి.

అభిమాన రచయితలు : పిల్లా వెంకటరత్నం, పొట్లపల్లి, దాశరథి, వానమామలై, మునిమాణిక్యం, చలం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆళ్వారు స్వామి, సి. నారాయణరెడ్డి, పల్లా దుర్గయ్య, బి. రామరాజు.

# లంకా పునరుద్ధరణ

చారిత్రక పరిశోధక మండలివారు కిష్కింధలో పరిశోధనలు జరుపుచుండగా వారికి లంకాదేశపు భూషణములు, బంగారు ఇటుకలు దొరికెనట. వాటి వివరాలేవో తెలిసికొందామని నాకు కుతూహలము కలిగినది. మా ఊరిలోని శతవృద్ధులైన పురాణ మార్తాండాచార్యుల వద్దకుపోయి విచారించితిని. వారు "అజ్ఞాత రామాయణము"లో ఉన్నదని ఈ క్రింది విషయమును సెలవిచ్చిరి.

రావణ సంహారము జరిగిన తరువాత లంకారాజ్యము విభీషణునికి ఇవ్వవలె ననుకొన్నాడు రాముడు. ఆ విషయము తన అనుచరులతో యోచించినాడు. తప్పక ఇవ్వవలసినదే అన్నారు అందరున్ను. రావణునితో వ్యతిరేకించి విభీషణునితోపాటు రాముని పక్షము చేరినవారందరు సంతోషపడ్డారు. రావణుని పక్షానఉన్న పెద్ద పెద్ద రాక్షసులు చాలామంది యుద్ధములో చచ్చినారు. మిగిలిన వారిలో ముఖ్యులు బందీలుగా ఉన్నారు. తక్కినవారు ఏమి చేయలేక లోలోపల కుమిలిపోతూ పైకిమాత్రం "రామ రామ" అని భక్తిని నటిస్తున్నారు.

మైరావణ బలగము, మారీచుని బలగము అక్కడక్కడ మాయ యుద్ధాలు చేస్తూ చేజిక్కిన విభీషణుని అనుచరులను, రాముని కోతులను పట్టి చంపుచున్నవి.

ఈ దుష్టబృందాన్ని రూపుమాపేవరకు లంకలో సంపూర్ణశాంతి చేకూరుట అసంభవము. అంతవరకు లంకారాజ్యము విభీషణునికి అప్ప జెప్పడము సబబుకాదు అని అధికారవర్గము నొక్కిచెప్పెను. రామునికి కూడ ఈమాట నిజమనిపించెను. వేగులవారిని పంపి లంకా సమాచారాలు

తెలిసికొన్నాడు. లంకలో విభీషణుని బలగమునకు రాజ్యముచేసే బలము గాని, అనుభవముకాని లేదని, లంకలోఉన్న వారందరు రాక్షసులే అని తేలినది. మారీచుని బలగము, మైరావణుని బలగము నాశనమయ్యే వరకు లంకలోని రాక్షసుల నడవడి బాగుపడినదని తోచేవరకు విశ్వాస పాత్రులయిన తన వానర వీరులకే అక్కడి పెత్తనము అప్పజెప్పుట మంచిదని నిర్ణయించుకొన్నాడు రాముడు. విభీషణునికి ఈసంగతి చెప్పగా అతడు మహాప్రసాదమన్నాడు. రాముడు తన మేలు కోరేవాడని గట్టి నమ్మకము, అది నిజము కూడాను.

హనుమంతుని పిలిచి "ఏమోయి హనుమంతుడా? లంక పెత్తనము తీసికొంటావా?" అంటే "స్వామీ! నాకిటువంటి గొడవలేమి తెలియవు. నేను నీ భక్తుడను. నిన్ను క్షణము వదలలేను. నీవు ఎక్కడ వుంటే నీదాసుడు అక్కడ ఉంటాడు" అని చెప్పినాడు. సుగ్రీవుని పిలిచి "నీకు తప్ప"దన్నాడు రాముడు. అతడు "మరి నాకిష్కింధ నేమి చేయమంటారు మహాప్రభూ! నేనుండలేను. కాని మా మేనమామ ఇప్పుడు నాకు బదులుగా కిష్కింధలో రాజ్యం చేస్తున్నాడు. నేను అక్కడికి చేరగానే ఆయనను పంపిస్తాను. అతడు ఎక్కువ లోకానుభవం కలవాడు. ఇటువంటి సంధికాలాలు చాలా చూచినాడు. లంకలో అన్నితెగలవారిని ఒకేరేవులో నీళ్ళుతాగిస్తాడు. మేము చాలాకాలమునుండి ఇళ్ళు, వాకిళ్ళు విడచి ఉన్నాము. ఇళ్ళకు చేరగానే అక్కడ పనిలేకఉన్న సమర్థులందరిని మామగారి సహాయార్థం ఇక్కడికి పంపిస్తాను. ఆరు నెలలలో లంక దేవభూమిగా వెల్గిపోతుంది. మీరు నిశ్చింతగా అయోధ్యకు వేంచేసి పట్టాభిషేకము చేసుకొనండి. ఇక్కడి పరిస్థితి చక్కబడినదని వార్తరాగానే ఒక మంచి ముహూర్తాన అందరమువచ్చి విభీషణునికి పట్టము కట్టివేతాము" అనెను.

సుగ్రీవునిసలహా రామునికి పదహారువీసాలు నచ్చినది. రాముడు తన పరివారముతో అయోధ్యకు ప్రయాణము సాగించినాడు. ఆయనతో విభీషణుడును బయలుదేరినాడు. సాగనంపుటకు వచ్చిన లంకాజనులకు విభీషణు డిట్లు చెప్పినాడు;

"శ్రీరాముని దయచేతను, మహాబలపరాక్రమ సంపన్నులయిన వానరవీరుల సహాయముచేతను మనలంకకు రావణునిపీడ వదలినది. కాని యింకను రాకాసితనము బొత్తుగా మాసిపోలేదు. దుష్టు లక్కడక్కడ తలయెత్తుచున్నారు. అంతటను శాంతి కుదరలేదు. మనము అనుభవము లేనివారము. అందుకని మన లంకలోని దుష్టశక్తులణగద్రొక్కబడి పరిస్థితులు చక్కబడేదాకా ఇక్కడి రాజ్యభారము మీరే వహించండి అని శ్రీరాముని నేను వేడుకొంటిని. వారు నా మనవిని పాలించిరి. ఇప్పుడు శ్రీవారి ఆజ్ఞానుసారము సుగ్రీవులవారి మేనమామగారు కొన్నాళ్ళపాటు లంకను ఏలెదరు. వారికి సహాయముగా కిష్కింధనుండి మరియు అయోధ్య మొదలగు ప్రాంతాలనుండి ఎందరో కొమ్ములు దిరిగిన పెద్దలు వచ్చెదరు. మీరందరు వారి కనుసన్నలలో మెలగుచు, దుష్టులను అణచుటలో, లంకలో నాలుగు మూలలా శాంతి నెలకొల్పుటకు వారికి అన్నివిధాల తోడ్పడండి, వారు మనలను ఉద్ధరింపవచ్చిన దేవతలని మరువకండి. వారికేవిధమైన కొరత జరుగరాదు. ఇది నాకోరిక. మీరందరు మన్నింతురని ఆశించుచున్నాను" అని చెప్పి రామునితోపాటు అయోధ్యకు వెళ్ళినాడు.

సుగ్రీవునిమామ లంకకు అధిపతి అయినాడు. సుమంతుని మేనల్లుడు మంత్రి అయినాడు. కిష్కింధలోని చిన్నకోతులు, పెద్దకోతులు తండోపతండములుగావచ్చి చేరినవి. ఆధిపత్యములు, అధికారములు పంచుకొన్నవి. విభీషణుని అనుచరులు వచ్చినవారందరికి అతివైభవముగా స్వాగతము ఇచ్చినారు. రావణ సంఘమునకు కూడ ఆ స్వాగతోత్సవ

ములలో పాల్గొనక తప్పలేదు. కొన్నాళ్ళపాటు ఉత్సవములతోనే గడిచినది.

అక్కడ అయోధ్యలో రాముడు, కిష్కింధలో సుగ్రీవుడు తమ తమ రాజ్యకార్యములలో నిమగ్నులై వున్నారు. సుగ్రీవుని మామగారు లంకలోని తన పరిపాలనావివరములను ఎప్పటికప్పుడు సుగ్రీవున కంద జేయుచున్నాడు. సుగ్రీవుడు అయోధ్యకు ఆ విషయాలు తెలుపుచున్నాడు.

లంకలోని రాక్షసులు కొత్త దొరలకు విందులు జేసినారు. వానరు లెరుగని ఎన్నియో భోజన పానీయములను వారికి రుచిచూపినారు. కాను కల రూపముల బంగారు ఇటుకలపై 'రామరామ' అని చెక్కించి సమ ర్పించుకొన్నారు. చెట్లపై. గుట్టలపై నివాసముచేసే వానరులకు లంక ఇంద్రలోకమువలె కనిపించినది. వారధి గట్టునపుడు రాళ్లగుట్టలు మోసి నట్లే వీరు లంకలోని బంగారుఇటుకలను కిష్కింధకును చేరవేసినారు. కిష్కింధలో ఉయ్యేల గొలుసులు, కుండలమీది మూతలుకూడా బంగా రువే. ఆడకోతులు పిల్లలకుమారుగ బంగారుయిటుకలనే ఎదల కద్దు కొని తిరుగసాగినై. బంగారుయిటుకలకు తొళ్లు కొట్టి తోకలకెక్కించు కున్నై. తిరుగు లాడునపుడు ఆభరణములుగాను, కూర్చున్నప్పుడు పీటలుగాను ఉన్నాయి అ యిటుకలు. కిష్కింధలో నిన్నటిదాకా నిరా డంబరముగా బ్రతికినవానరులకు లంకలోని అధికారపు కైపు. మద్య పానవుమత్తు, ఎన్నడూ చూడని ధనరాసులు కలిగించిన దురాశ ఒకేసారి దాపురించినవి. వాటితోపాటు అక్కడి అందమయిన ఆడవాళ్ళ యౌవన ధనముకూడ వానరుల చూపులను ఆకర్షించినది. లంకను విడచుటయన్న ప్రాణము విడచుటవలె అయినది.

ఈ దుర్ఘటనలన్నియు విభీషణుని అనుచరులకు దుర్భరమైనవి. వారు చాటుమాటుగా గొణుగసాగినారు. ఒకరిద్దరు సాహసించి సుగ్రీవుని మామగారితో చెప్పినా లాభము లేకపోయినది. ఈ వార్తలు అయోధ్యలో

ఉన్న విభీషణునికి చేరినవి. అతని కెంతయు ఆశ్చర్యము, విషాదము కలిగించినవి. రాములవారితో ఈ విషయం మనవి చేస్తే వారు నమ్మలేక పోయినారు. అయినను సుగ్రీవునికి "నిజానిజాలు తెలిసికొని వెంటనే తమకు తెలుపు"మని తాకీదు వ్రాసినారు. సుగ్రీవుడు తన మామగారిని "ఏమిటి ఈ సంగతి" అని విచారిస్తే, వారు స్వయంగా కిష్కింధకు విచ్చేసి ఇట్లు చెప్పిరి:-

"ఇది అంతా లంకలోనివాళ్ళ చేసినకుట్ర. అక్కడి దుష్టశక్తులను అణచుటకు మేము కాఠిన్యము వహిస్తున్నాము. దానినుండి తప్పించుకొనుటకుగాను వారు ఈ ఎత్తులు వేయుచున్నారు. వారంతా దుష్టకూటములోనివారు. వారిది మారీచుని తెగ, మైరావణ బలగము. పైకిమాత్రం రామనామస్మరణ చేస్తుంటారు. ఇది నేను అనుభవ పూర్వకంగ చెప్పుచున్నాను."

సుగ్రీవుడు మామగారి మాటలను ఉన్నది ఉన్నట్లు రాములవారికి తెలియ పరచెను. రాముడు విభీషణునితో విషయమంతా చెప్పి "విన్నావా సంగతి? మీవారే వేస్తు ఉన్నారు ఈ ఎత్తులు. నేను లంకలో వ్యవహారాలు చక్కబెట్టుటకు పంపినవారు సామాన్యులుకారు. వారందరు దేవతలు. రావణ సంహారమునకు నాకు తోడ్పడుటకు వానరులుగా జన్మించినారు. మీలంకలో పుట్టిన వాళ్ళందరు రాక్షసులేయని నాకు చారుల వలన తెలిసినదే నిజమని తోచుచున్నది. ఇకనైన ఇటువంటి వార్తలు నమ్మకు! ఇటువంటి దుష్ప్రచారములు చేయవద్దని మీవాళ్ళను మందలించు" మని అనెను. పాపము! విభీషణుడు ఈ మాటలకు నోరెత్తజాలలేదు. సిగ్గుతో తలవంచుకొనెను. శ్రీరాముడు సుగ్రీవునికి వ్రాసినట్లే సుమంతుని మేనల్లునకు కూడా వ్రాసెను. అతడును సుగ్రీవుని మామవలెనే సమాధాన మిచ్చెను. విభీషణునకు ప్రాణసంకటముగా ఉండెను. లంకనుండి తనవారు పంపుచున్న వార్తలు రానురాను మరింత

ఆందోళనము కలిగింపసాగెను. తాను లంకనువిడిచి దాదాపు ఆరునెలలు కావచ్చినది. ఇక అతడు అయోధ్యలో ఉండలేక పోయెను. సత్వరమే లంకచేరెను. అచటి పరిస్థితులు నిజముగానే భయంకరరూపము దాల్చి యుండెను. లంకలో రావణుని అనుయాయులైన రక్కసులెవరో రాముని నమ్మిన బంటులైన వానరులెవరో చెప్ప వీలులేకుండెను. భేదము కేవలము రూపమునందే మిగిలింది. ఏమాత్రము ఆలసించినను సర్వనాశనము తప్పదని విభీషణుడు నిలుచున్నపాటున రాముని యొద్ద వ్రాలెను.

అక్కడ అప్పటికే సీత వాల్మీకి ఆశ్రమము చేరుకోవడము, ఆమె వియోగము భరింపలేక రాముడు కృశించి పోవడము జరుగుచున్నది. ఇటువంటి విషమ సమయమున తన దురవస్థ వినిపింపలేక విభీషణుడు కొన్నాళ్ళదాక మాట్లాడక కూర్చున్నాడు.

ఒకనాడు రాముడే స్వయముగా విభీషణునితో "లంకా విశేషము లేమిటి ?" అని ప్రశ్నించినాడు. విభీషణుడు తాను కళ్ళార చూచి వచ్చిన అరాజకమంతా వివరంగా విన్నవించి రెండుకాళ్ళు పట్టుకొని, "స్వామీ, తా మొకసారి స్వయముగా దయచేయనిదే మాకు ముక్తిలేదు" అన్నాడు.

సీతా వియోగమున అన్నిటియందును విరాగము కలిగినను, రాముల వారికి శరణాగతులను రక్షించే వ్రతము మొదటినుండి యున్నందున, వెంటనే లంకచేరి అచ్చటి పరిస్థితులు చూచెను.

సుగ్రీవుని మామను, సుమంతుని అల్లుని ఒకే త్రాటితోకట్టి సముద్రములో ముంచ నాజ్ఞాపించినాడు. రాక్షసులతో కుట్రలు పన్నిన తక్కిన వానరులకు తగిన శిక్షలు విధించినాడు. తరువాత విభీషణునకు పట్టముకట్టి అక్కడి ప్రజలను ఓదార్చి అయోధ్య చేరుకున్నాడు.

★

# లోతుతెలియని ప్రేమ

❖

శ్రీ వెంపో



జననం : 1927 ఏప్రిల్ 15.

చిరునామా : C/o సత్యవతి (Teacher)
ప్రభుత్వ బాలికా పాఠశాల, నల్లగొండ.

కార్యాకలాపాలు : సాహిత్య వ్యవసాయం.

అభిరుచి : రచన.

రచనలు : ముద్రితం : లోకంపోకడ (నాటకం), వెంపోలు (పద్యాలు), బుడ్డా వేంగళరెడ్డి, ఆంధ్ర జ్యోతి (బుఱ్ఱకథలు).

అముద్రితం : బోగంది, దయ్యాలలోకం (నాటకాలు).

అభిమాన రచయితలు : టాల్‌స్టాయ్, చలం.

*

# లోతుతెలియని ప్రేమ

లోలోపల పెండ్లినిగూర్చి తియ్యని కలలు కంటూనే స్నేహితు లెవరయినా ఆ విషయాన్నిగూర్చి ప్రస్తావన తెస్తే జితేంద్రియుడులా మాట్లాడే లక్షణాలు మురహరికూడా వున్నాయి.

అసలు పెండ్లిచేసుకోవటం, పిల్లల్ని కనటం అనే కార్యక్రమాలు చాలా తక్కువ రకంగాళ్లు మాత్రమే చేస్తారని మురహరి తరహా మనుష్యుల వుద్దేశం. అయితే ఈతరహా మనుష్యులు యీ కార్యక్రమాలకి పూర్తిగా యెల్లప్పటికీ దూరంగా వుంటారా అంటే అదీలేదు. అందరికంటె ముందుగాను, తొందరగాను తమ పనులు ముగించేసుకు పోతుంటారు.

అయితే వీళ్ళిట్లా తయారు కావడాని క్కారణాలు లేకపోలేదు. తామేదో ఒకటి జీవితంలో సాధించితీరాలనే పట్టుదల వీళ్ళ మనస్సుల్లో వుంటుంది. ఆ ప్రయత్నంలో వివాహం ఒక తీవ్రమైన ప్రతిబంధకంగా తయారౌతుందని భయపడి వివాహాలపైన యిటువంటి అభిప్రాయాలు వెలిబుచ్చుకుంటారు.

స్కూలుఫైనలువరకు ప్యాసై గుమాస్తావృత్తి నవలంబించిన మురహరిని అతని స్నేహితులేకాదు తలిదండ్రులుకూడా వొప్పించి వివాహం చెయ్యలేకపోయారు. ఆతని దీక్ష యేమంటే యిలా గుమాస్తాగిరి చేస్తూనే కష్టపడి బి. ఎ. వరకు కృతార్థుడు కావాలని. ఈ ప్రయత్నంలో అతడు సరిపడ్డ కృషే చేస్తున్నాడు.

మనిషి పెద్దడాబుసరిగా లేకపోయినా యెవరూ వేలెత్తి చూపేటంత అందవిహీనంగా మాత్రం లేడు. నల్లగానే కనపడినా యెల్లప్పుడూ తెల్లనిదుస్తులే వాడి ఆ లోపం పైకి వుబకనీయడు. వాళ్ళ వంశంతీరే

అదికాబోలు. ముక్కులు మహాచెడ్డలావు. అయితే సులోచలాలు వాడటం వల్ల యీ లోపంకూడా అందరూ గుర్తించలేక పోవచ్చు. యిక అద్దాల చాటు నుండే కళ్లు యెలావుంటే మాత్రం యెవరిక్కావాలి! కనిపించటంలో మాత్రం యెవరికీ యెట్టి అనుమానాలులేవు. యేమి నూనె వాడతాడోగాని తలెప్పుడూ నున్నగా వుంటుంది.

చదువుకి, కొలువుకి యెటువంటి అంతరాయం కలగకుండా మురహరి బాగానే నెట్టుకొస్తున్నాడు.

దీక్ష ప్రశంసనీయమైనట్టిదైనా అందం లోపమైనా మనోవికారాలకి యివన్నీ అడ్డుకానేరవుగదా! అందులో ఆధునిక యుగంలో నివసిస్తున్న వ్యక్తి రాగరహితుడుగా మనగలగటం తేలికైన పనికాదు. పుస్తకం విప్పినా, చలన చిత్రం చూచినా, ఎదుటివానితో సంభాషించినా, ఆఖరికి తనతోపాటు పనిచేసే గుమాస్తాలను చూచినా స్త్రీ ప్రమేయంలేని చోటంటూ లేకుండా పోయినప్పుడు, స్త్రీలను గురించి ఆలోచించకుండా వుండటం మురహరికేగాదు - యెవరికీ సాధ్యంకాదు. అయినా మురహరి వివాహప్రయత్నానికి పైకి విముఖత్వం చూపటం యిప్పటికీ మానుకోలా.

ఆఫీసులో తనతోపాటే గుమాస్తాపని చేస్తున్న అనసూయ యెవరితోనూ యెప్పుడూ అతిగా మాట్లాడి యెరుగదు. ఆమెకు పురుషులతోపాటు కలిసి పనిచెయ్యట మెలాగో తెలుసు. యే అభిప్రాయంతో యేది యెట్లా మాట్లాడినా, చూచినా, నవ్వినా మగాళ్ళెట్లా తమ కన్వయించుకుంటారో అనసూయ బాగా యెరుగును. అందుకే ఆమెను ఆఫీసులో యేఒక్కరూ కాలక్షేపానికి వినియోగించుకోరు. అందరూ ఆమెను గౌరవంగా చూచి సాక్షాత్తూ పురాణాలలో అనసూయయనే అనుకుంటారు.

మురహరి పక్కనే అనసూయ సీటుకూడా. మురహరామెను కన్నెత్తి పూర్తిగా చూచిన పాపాన కూడా పోలేదు. ఎప్పుడూ దస్త్రాలలో తలదూర్చి తన పనేదో తాను చేసుకుంటూ పోతాడు. యెప్ప

దైనా యేదైనా ఫైలు విషయం అడగవలసి వచ్చినా, చెప్పవలసి వచ్చినా అతని వైఖరిలో యెటువంటి మార్పురాదు. ఈ వైఖరి అనసూయకు మురహరి యెటువంటి ప్రమాదకారి కాదని నిర్ణయించుకోటానికి యెక్కువ రోజులు పట్టలా.

అనసూయకు యితరులతో మాట్లాడకుండావుండే అలవాటు కేవలం ప్రమాదాలనుండి సంరక్షించుకోవాలనే తప్ప ఆమెకు కులాసాగా మాట్లాడటమంటే గిట్టకకాదు. మురహరి ప్రమాదకారి కాడని నిర్ణయించు కొన్న అనసూయ అతనితో ఆఫీసరు లేనివేళల్లో వుద్యోగధర్మంగా రెండు ముక్కలు మాట్లాడటం తప్పుకాదని భావించుకొంది. ఆకారణంగా యీ మధ్య మురహరిని మామూలు ధోరణిలో ఒక ముక్క యెక్కువగా అనసూయ పలకరించి సమాధానం పొందుతోంది. ఇదే సందర్భంలో మురహరి కూడా కాస్త తలెత్తి ఆమెను పూర్తిగా చూచి తన సమాధాన మేదో తెలియజెప్పవలసిన పరిస్థితి కూడా యేర్పడింది. ఈ పరిస్థితులు ఆఫీసులో అనసూయ ప్రవర్తనలో మార్పు వచ్చిందని యితరులు తల పోసుకునేటంత యెక్కువేమీ గాదు.

నిత్యం ఆఫీసు యెప్పుడు విడిచి పెడతారా, బయట పడదామనే మురహరి మనస్తత్వంలో ఈ మధ్య అతనికే తెలియని ఒకమార్పు పరిమితి చెందింది. తనగదిలో వున్నంతసేపు యెప్పుడు ఆఫీసుటైం అవుతుందా, వెళ్ళి కూర్చుందామనే తొందర మురహరికి రోజురోజుకి యెక్కువవుతూ వచ్చింది. అలాగే అతనికి సాయంకాలం ఆఫీసు విడిచి పెట్టి అ పాడుగదిలోనికి వచ్చి పడాలంటే బాధగామారింది.

ఇదివరకెప్పుడూ తనగది చేరగానే తాను కట్టిన పరీక్ష పుస్తకాలు విప్పి శ్రద్ధగాచదివే మురహరి యిప్పుడు పుస్తకంవిప్పి రెండు లైనులైనా గట్టిగా చదువలేకపోతున్నాడు.

యౌవనం కదలబారిన మురహరి మెదడులో యేదో తెలియని తియ్యని రసధునులు జాలువారసాగినై. అతని కళ్లు శూన్యంలో సుందర స్త్రీ మూర్తిని వెతుకుతున్నాయ్. ఆమె యెవరోకాదు! రోజూ తాను సంభాషించే అనసూయే! అందుకే అతడు ఆఫీసులో అనసూయ ప్రక్క కూర్చోటంలో అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించ కలుగుతున్నాడు. ఆతని కానందం కల్గించటంలో అనసూయపాత్ర యేమీ లేకపోవచ్చు. అయినా మురహరి మనస్సు ఆమెపై లగ్నమై అనసూయను చూడని క్షణాలు భరించరానివిగా తోచినయ్. తానిప్పుడెట్టి పరిస్థితిలో వున్నాడోకూడా ఆలోచించలేని బలహీనతలో మురహరి చిక్కుకున్నాడు. స్త్రీ శరీరం అతని కిప్పుడు మధురమైన వూహల్ని కల్గిస్తూ ఆ దృశ్యాన్ని తా నొంటరిగా వున్నప్పుడుకూడా చూడగల్గుతున్నాడు.

తానిదివరకెన్నో సినిమాలు చూచాడు. పుస్తకాలు చదివాడు. కాని యిదివరకెప్పుడూ యువతీయువకు లిద్దరు ప్రేమించి పెండ్లి చేసుకున్నారన్న సంఘటనలకి ప్రత్యేకత యిచ్చేవాడుకాదు. అవేసంఘటన లిప్పుడు మురహరికి ప్రియతమమైనాయి. ఆ సంఘటనలలోని నాయకి అనసూయగా తాను నాయకుడుగా పోల్చుకొని సుఖాంతంగా కథ ముగియడానికి యెదురు చూస్తున్నాడు.

అనసూయ తనతో మాట్లాడిన ప్రతి ఒక్క మాట, ప్రతి ఒక్క చూపు, చివరికి ఆమె పెదవులపై చిందులు తొక్కే నవ్వు, కథానాయకి, కథానాయకునిపై చూపే అవ్యక్తమైన ప్రేమ చిహ్నాలుగా మురహరి అన్వయించుకో సాగాడు.

సినిమాలలో, కథలలో కూడా యిట్లాగేకదా కథ ప్రారంభమయ్యేది. ఏ బట్టలకొట్టులోనో యిద్దరు యువతీ యువకులు బట్టలు ఖరీదు చెయ్యటానికి వెళ్ళితే వాళ్ళిద్దరి చూపులు కలసి అది 'ప్రేమ'గా

పెంపొందుతుంది. లేక సైకిలు చక్రానికి తగిలిన యువతి కళ్లు సైకిలుపై నున్న యువకునితో కలవ్వొచ్చు. అదీ కాకపోతే ప్రమాదంలో చిక్కిన యువతిని వీరోచితంగా సంరక్షించిన యువకుడు ఆకర్షించబడవచ్చు. యిలాగే యెన్నో రీతులు ప్రేమ జనించటానికి కారణభూతమైనపుడు తన పక్కనే ఆఫీసు గుమాస్తాగా పనిచేస్తున్న యువతి తన్నాకర్షింపలేక పోవటమేమిటి? తప్పక ఆకర్షించి అనసూయ తనదిగా ఒకనాటికి కాగలుగుతుందని మురహరి నిశ్చయించుకొన్నాడు.

"యేవండీ అంత తొందరగా ఆఫీసుకి వచ్చి చేరుకుంటారు?"

"అబ్బే! యేముందీ, గదిలో యేమీ తోచుబడిగాక."

"యేదో పరీక్షకు కూడా కట్టారు కాబోలు!"

మురహరి చిక్కులో బడ్డాడు. తన వాలకం అనసూయ కనిపెట్టి వేసిందో యేమోననే భయం; ఆమాత్రం తెలుసుకో గలిగితే అదీ ఒకందుకు మంచిదేననే సంతృప్తి అతనికి కలిగింది.

"యేమి పరీక్షలో జీవితం పొడుగునా ఒకటే చదువా? కాసేపైనా ఆనందం వుండక్కర్లా!"

"ఆఫీసుపని మీకంత ఆనందాన్ని కలిగిస్తుందా?" ఆశ్చర్యంగా అనసూయ ప్రశ్నించింది.

నెమ్మది నెమ్మదిగా తన మనోభావాలను అనసూయకు నివేదించటానికి యిదే అదననుకొని "ఆఫీసుపని యెంత కష్టమైనా మీయందరితో కలసి మాట్లాడుకుంటుంటే యెంతో ఆనందంగా వుంటుంది" అని బదులు చెప్పిన మురహరి తన భావాన్ని సగానికి పైగా ఆమెకు అర్థమైయేట్టు చెప్పగలిగాననుకున్నాడు.

'అలాగా!' అని కిలకిలా నవ్వి అనసూయ తన పనిలో మునిగి పోయింది.

ఆ నవ్వు మురహరినెత్తిన తేనెలు వర్షించింది. ఆఫీసు కాగితాలు తిరగవేస్తున్నా డన్నమాటేగాని అతని మనస్సు అనసూయ నవ్వును వ్యాఖ్యానించుకోవటంలోనే ఆనాడంతా మునిగివుంది. తనపై ఆమెకు అనురాగం లేకపోతే యివాళ ప్రొద్దున ఆ విధంగా యెందుకు మాట్లాడించి వుంటుంది. ఒకవేళ కులాసాగా మాట్లాడించినా తను 'మీతోమాట్లాడుతుంటే యెంతో ఆనందంగా వుంటుంద'ని చెప్పినపుడు ఆమె ఆ మాటను హృదయపూర్వకంగా స్వీకరించి 'అలాగా' అని యెందుకు కిలకిలా నవ్వింది? ఆమె తన హృదయాన్ని గ్రహించే వుంటుంది. అబ్బ! ఆ నవ్వు కేవలం ఒక్కనవ్వు మాత్రమే తన కెంత మధురానుభూతిని కలిగించింది.

పిచ్చిపిచ్చి దీక్షలుమాని స్త్రీ హృదయ సౌందర్యాన్ని ఆరాధించాలనే పట్టుదల మురహరిలో హెచ్చింది. యెన్నాళ్ళనుంచో పేరుకొనివున్న కోర్కెలు అతన్ని అనసూయకు అతి సన్నిహితంగా యీడ్చుకొని వస్తున్నాయి. ఇవాళ ప్రొద్దున జరిగిన సంఘటనతో యిక అనసూయకు తనకు మధ్య యెంతో దూరం లేదనుకున్నాడు.

గదిలో ప్రవేశించిన మురహరి స్వర్గలోకానికి బదిలీయైనట్టు ఆనందపారవశ్యుడై పోతున్నాడు. గదిలో వస్తువులన్నీ యిప్పుడు తన హోదాకు తగినట్టివిగా తోచటంలేదు. చాప - దానిపై పరుపుచుట్ట - అది యెన్నో యేండ్లనాటిది. దానిపై మాసిన దుప్పటి, చదువుకొనే పిల్లవాడిగా యెక్కడపడితే అక్కడ పుస్తకాలు, నోట్సులు, కూజా, దానిపై చిలుము పట్టిన గ్లాసు— ఈ వస్తువులన్నీ అతనికి అసహ్యం వేసినయ్. ఏ క్షణంలోనో ఈ వస్తువులన్నీ అతడు విడిచిపెట్టేవే ననుకున్నాడు.

ఆవెంటనే మురహరికి ఆవస్తువులన్నీ మమ్ము విడిచి పెట్టిపోతారా? అని యేడ్పుమొగంతో అర్థించి నట్లగుపించాయి. విజయ గర్వంతో మురహరి అద్దంతీసి తనముఖాన్ని చూచుకున్నాడు. అనసూయను తన

కళ్ళముందు కట్టేసి ఆ మనోహర విగ్రహాన్ని ఆరాధిస్తున్న మురహరికి ఒక్కసారిగా తనముఖం ఆ అద్దంలో కన్పించేసరికి అతనికి అసహ్యం వేసింది. తానింత అందవిహీనంగా వున్నానని అతనిదివరకెప్పుడూ అనుకొని యుండలేదు. అసలిదివరకెప్పుడూ తనను యితరులతో పోల్చుకొని వుండలేదుగనుక తనఅందవిహీనతను తెలుసుకొని వుండలేక పోవడం సహజమే! తానిప్పుడు మెరపు తీగవంటి ఒక స్త్రీ సాన్నిహిత్యాన్ని అపేక్షిస్తున్నాడు గనుక తనకున్న లోటులేవో అతి తేలికగా బయటపడ సాగాయి.

కళ్ళజోడుతీసి తనను పరిశీలించిన కొద్దీ మురహరి వదనం మరింత విషాదఛాయలు కమ్ముకొని మాడుచెక్కలా అగుపించ సాగింది. ఇక తననుతాను చూచుకోలేని అసహనంతో మురహరి గుండెదడ హెచ్చింది. అద్దం ఒకపక్క పారేసి చిరకాలంగా తనకు ఆశ్రయమిచ్చిన ఆ పరుపుపైనే మురహరి మేను వాల్చాడు. క్షణకాలం కిందట తాను వూహించుకొన్న ఆశాసౌధాలన్నీ ఆటంబాంబులతో విధ్వంసమై పోతున్నట్టు చూడగల్గుతున్నాడు.

"అందవికారంగావున్న నన్ను అనసూయ యెలా ప్రేమిస్తుంది? ప్రేమించి వుండకపోతే ఆమె నాతో యెందుకు అంత చొరవగా మాట్లాడి వుంటుంది. ఆమె సంభాషణలు కేవలం స్నేహం మాత్రంగానే యెందుకు కాకూడదు. ఇదే నిజమైతే అనసూయకు నాముఖ మెట్లా చూపించేది?" అనే భావ సంఘర్షణతో మురహరి ఉక్కిరి బిక్కిరి కాసాగాడు.

"భౌతిక సౌందర్యమే ప్రేమకు ఆధారభూతమా? కాదు. అనసూయ చాలా తెలివి గలది. ఆమె నాలోని హృదయ సౌందర్యాన్ని ఆరాధిస్తోంది. ఇది సత్యం" అనే ప్రేమశాస్త్రంలోని సూత్రాలు మురహరి భావప్రపంచంలోనికి దిగుమతయ్యేసరికి కొంత తేరుకో సాగాడు. అయితే తాను కూడా అనసూయ భౌతికరూపాన్ని విడిచి మానసిక

విశిష్టతనే ఆరాధించాలనే నిశ్చయానికి వచ్చాడు. మానసికలోతుల్ని వెదకగల్గే ధైర్యసాహసాలు తనకెంత వరకు వున్నాయనే ప్రశ్న అతనికప్పుడు కల్గలేదు.

యౌవనపు తొలిదశలో హృదయసౌందర్యాన్ని పరిశోధించగల్గే నిగ్రహం మురహరికే గాదు, ఏ ఒక్కనికి వుండదని చెప్పాలి. మురహరికి ఆ నిగ్రహంలేదు.

హృదయసౌందర్యమే ప్రాతిపదికగా కల్గిన తన పవిత్రప్రేమ పత్రాన్ని అనసూయకు దఖలు పరచట మెట్లాగో మురహరి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ప్రేమలేఖ నమూనాకొరకై నవలలు, సినిమాలు సాధ్యమైనన్ని గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. తొందరపడి తానే బయటికి పోక్కేదాని కంటె కొంత సహనం చూపిస్తే అనసూయే బయటపడ గలదని ఒక్కొక్కసారి మురహరి అనుకొనేవాడు. అయితే తనకున్న అనుభవాన్ని బట్టి స్త్రీ అంత తొందరగా బయటపడదని ఆలస్యంచేస్తే పరిస్థితులు విషమించినా విషమించవచ్చునని గుర్తురావటంతోటే మురహరి కలం, కాగితం తీసి తన హృదయావేదనని స్పష్టంగా చిత్రించాలని ప్రారంభించాడు.

"సార్"— బయటనుంచి పిలుపు.

విసుగుతో మురహరి తలుపు తెరిచాడు. తపాలావాడు కొన్ని వుత్తరాలు అతని చేతిలోపెట్టి తన దారిన తాను పొయ్యాడు.

తలుపు బిగించి వచ్చిన వుత్తరాలు చూడటం కంటే ముందు తన లేఖను పూర్తిచెయ్యాలని మురహరి ప్రయత్నంచేసి చూశాడు. కోర్కెలు తన అధీనంలో లేక చివరికి వచ్చిన వుత్తరాలనే చూడక తప్పిందికాదు. కార్డుల్ని పైపై చూచి కవరు చించాడు. లేఖ చివరి పంక్తులపై కళ్ళను దించాడు.

"నీవుకూడా నీ మొండిపట్టుదలను విడిచి ఒకయింటి వాడవుగా కావాలని కోరుతున్నా."

అని స్నేహితుడు కామేశం సంతకాన్ని గుర్తించాడు. మురహరి పెదవులపై లాస్యం తొణికింది. తనూ అదే ప్రయత్నంలో వున్నసంగతి కామేశానికేమి తెలుసు! ముందు తనలేఖ వ్రాయటం పూర్తిచేసి తరవాత కామేశానికికూడా ఈ శుభవార్త తెలియజేయాలనుకుని కలంతీశాడు.

'నీవుకూడా' అన్నాడు. తను పెండ్లి చేసుకుంటున్నాడా యేమిటని మురహరి మళ్ళా కామేశం వ్రాసిన ఉత్తరం విప్పి చదవటం ప్రారంభించాడు.

'నీవు పనిచేస్తున్న ఆఫీసులోనే...'

మురహరి కళ్లు బయర్లు కమ్మాయి. తరవాత అక్షరాలు స్పష్టంగా కన్పించటంలా. చేతులు వణకుతున్నాయి.

'....పనిచేస్తున్న అనసూయ అనే అమ్మాయితో సంబంధం నిశ్చయమైంది....'

మురహరితల అగ్నిపర్వతంలా పగిలినట్లయింది. లావాద్రవంలా మెదడు సలసల బయటికి పొర్లుకొనివచ్చినట్లయింది. తన యజమానిని నొప్పించిన పుత్తరాన్ని చేతులు ముక్కలు ముక్కలుగా చించిపారేసినయ్. యజమానిని పరుపు తన గుండెల్లో పొదుపుకొంది.

ఆలోచనలు స్తంభించిన మురహరి అలా యెంతసేపు నిశ్చేష్టుడై పోయాడో అతనికె తెలియదు. తేరుకొని కళ్లు విప్పేసరికి గదిలో తన సామానులన్నీ జాలిగా వోదార్చినట్లు కనిపించినయ్. జీవితంలో తొలి సారిగా ప్రేమప్రయత్నంలో గట్టిదెబ్బతిన్న మురహరికి 'ప్రేమ' అంత బూటకమైన వస్తువు మరొకటి లేదనిపించింది. కామేశం వుత్తరం ఒక్కరోజు ఆలస్యంగా చేరివున్నట్లయితే తానెంత పరాభవానికిలోను కావలసి వచ్చేదో వూహించుకొని భయభ్రాంతుడైనాడు.

తనతో గుమాస్తా పని చేసుకొనే అనసూయే తన ప్రక్కన కూర్చున్నదని అర్థం చేసుకొనటానికి కామేశం ఫుత్తరం మురహరికి బాగా పనికొచ్చింది. రాగరహితుడుగా అనసూయతో ప్రవర్తించటానికి మొట్టమొదట మురహరికి కష్టమైనా మొత్తంమీద విజయుడయినాడు.

తనపక్కన కూర్చున్న అనసూయ ముఖపరిచయమన్నా లేని కామేశానికి ప్రియురాలుగా అయిపోవటం, ప్రేమతత్వంలోని యే సూత్రాన్నాధారించుకొనని మురహరి ఆలోచించుకోసాగాడు. చివరకతడు ప్రేమించుకున్నా రనటంలో అర్థంలేదనే నిశ్చయానికి వచ్చాడు. ప్రేమ ప్రాతిపదికగా నడిచే సినిమాలు, నవలలు, కథలు వొట్టి కల్పితగాథలుగా చిత్రించినవనుకున్నాడు. అయినా ఒకసారి రేగిన అతనిలోని స్త్రీదాహాన్ని అణచుకోలేకపోయాడు. అందుకని తల్లిదండ్రుల్నే పెళ్ళి చెయ్యమని అడిగితే పోతుందిగా! కాని యిప్పటిదాకా పెళ్ళివద్దని మొరాయించుకు కూర్చున్న తను యే ముఖం పెట్టుకొని యిప్పుడు పెళ్ళిచెయ్యమని అడుగ గలడు? అభిమానందెబ్బతినదూ? అందుకని ఆప్రయత్నం మానుకున్నాడు.

పోనీ తననే యెవరైనా కన్య వలచి వస్తుందేమో చూద్దామని వేచివున్నాడు మురహరిప్పుడు. తనవైపునుంచి జరిగిన ప్రయత్నం విఫలమైనప్పుడు మిగిలిన మార్గం యిదొక్కటేగా మరి.

యధాప్రకారం మురహరి కిప్పుడు ఆఫీసుపని బరువుగా తోచింది. ఆఫీసులో తన కుర్చీ ముళ్ళకంచెలాగా బాధించడం ప్రారంభించింది. తన పనేదో తాను యథాశక్తి పూర్తిచేసుకొని యేరోజుకారోజు బయట పడుతున్నాడు. గట్లు తెంచుకొన్న యౌవనోన్మాదానికి అడ్డుకట్టలు వేయ లేక మురహరి సతమత మౌతున్నాడు. బి. ఏ. వరకు చదవాలనే అతని దీక్ష సంగతి కూడా గుర్తులేదిప్పుడు. ఆఫీసు విడిచిపెట్టడమే తడవుగా పట్టణం వెలుపల అప్పుడప్పుడే నిర్మాణమైన ఆనకట్టవద్దకు ఒంటరిగా పోయి కూర్చోటం అలవాటు చేసుకొన్నాడు.

నది కిరువైపులా ఎత్తయిన కొండలు. కొండకొనలు రెండూ కలిపి విశృంఖలంగా ప్రవహించే నదికి మానవుడు అడ్డకట్టవేశాడు. అంతటితో ఆ నది అందుబాటులోనికి వచ్చి బీటలువారిన భూములపై తన అమృతధారల్ని ప్రవహింప చేస్తూంది. ఈదృశ్యం మురహరికి మానవుని విజయానికి చిహ్నంగా ఎదురుగా నిల్చివుంది." వ్యక్తిగత విషయాలలో కూడా మానవుడు కొంత సంయమనాన్ని ప్రదర్శించ గలిగితే మానవత్వం కూడా యింకెన్ని నాగరిక శిఖరాలను అందుకొన గలిగేది! యెవరో మహాపురుషుడు తప్ప ఈ రకంగా యేవొక్కరూ ప్రవర్తించటం లేదుకదా! ప్రతి ఒక్కరూ వ్యక్తిగత విషయం వచ్చేసరికి కట్లు తెంచుకొని విహరించ దలుస్తారు. బహుశా యిది నదీజలాలను అవరోధించట మంత తేలికైన పని కాదుగాబోలు?"

ఈ విధంగా ఆలోచించుకు పోతున్న మురహరికి ఒక్కసారిగా తాను నిగ్రహాన్ని కోల్పోవటం గుర్తుకొచ్చి చలించిపోయాడు. పరవళ్ళు తొక్కుకుంటూ నాలుకలు చించివచ్చే ఆ ప్రవాహానికి ఎదురుగా గంభీర ముద్ర దాల్చివున్న సిమెంటు కట్టడాన్ని మురహరి దృష్టి మరల్చి చూచాడు.

పెద్ద గుంపొకటి ఆ కట్టపై మూగి వుండటం మురహరి కంట బడింది. నాలుగు వైపులనుంచి జనం ఆ విచిత్రమేమిటో చూద్దామని పరుగులు తీస్తున్నారు. మురహరి కూడా ఆ వైపుకే ఆకాంక్షతో బయలు దేరాడు. సమీపించిన కొద్దీ ఒక స్త్రీ కంఠం గుండెలు పగిలిపోయేట్టు విలపించటం మురహరి చెవునబడింది. నడక వేగాన్ని యింకా పెంచాడు.

అక్కడకుచేరి చూచేసరికి నదిలో ఒక స్త్రీ మునుగుతూ తేలుతూ వుండటం మురహరి గమనించాడు. నది ఒడ్డున ఒక ముసలామె ఆ మునిగిపోతున్న స్త్రీ కొరకై గుండెలు బాదుకుంటూ 'నాబిడ్డను కాపా డండి తండ్రో' అని కన్నీరు మున్నీరుగా యేడుస్తోంది. నదిలో మునిగి

పోతున్న స్త్రీ అవసానకాలం సమీపించింది. తల పైకెత్తడం ఆగి పోయింది. విడిపోయిన శిరోజాలు నీటిపై నాచులా కమ్ముకున్నాయి. యే ఒక్కరూ దిగి ఆమెను సంరక్షించటానికి సిద్ధంకాలేదు. ప్రతివారు "అయ్యో పాపం! ఆమెకు జలగండం రాసిపెట్టివుంది; యెవరేమి చేస్తా'రని చప్పరిస్తున్నారు. ప్రతివాడు దిగితే తనకేమి ప్రమాదం చుట్టుకుంటుందో నని భయపడుతున్నాడు.

ఆ దృశ్యం మురహరి మనస్సును కలచి వేసింది. యింతమంది హేమాహేమీలయిన జనం మూగివుండగా ఒక ఆడది రక్షణలేక ప్రాణం పోగొట్టుకోవటం అతడు సహించలేక పోయాడు. అంతే. యిక వెనుకా ముందూ చూడకుండా మురహరి నదీ గర్భంలోకి దూకి ఆస్త్రీని తన వీపు మీద ఆదుకొని ఈదుకుంటూ ఒడ్డుకు వచ్చిచేరాడు. అంతలో యింకొంత మంది ధైర్యంచేసి ఆమెను పట్టుకుని గట్టుమీదకు చేర్చారు. మళ్ళా జన మంతా ఒకసారి ఆ దృశ్యాన్ని చూడటానికి వెళ్ళారు.

అందరూ మురహరి ధైర్యసాహసాల్ని వేనోళ్ళ పొగిడేవారే! ఆలస్యం చెయ్యక ఆమెను ఆసుపత్రికి తీసుకొని వెళ్ళటం వుత్తమమని కొంతమంది సలహా యిచ్చారు.

ప్రథమ చికిత్స తర్వాత ఆసుపత్రిలో ఆమె జీవిస్తుందనే ఆశ కలిగింది. వైద్యం చేస్తున్న సమయానకూడా మురహరి ఆమె తల్లితోపాటు అక్కడే నిలబడి వున్నాడు. పూర్తిగా పదహారు సంవత్సరాలయినా నిండని ఆ నీటమునిగిన బాలిక సౌందర్యాన్ని మురహరి రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. తాను సాహసించి వుండకపోయినట్లయితే ఈ సౌందర్యం నదీజలాల కలిసి పోయేదేగదా; అనుకొని ఒక్కనిట్టూర్పు విడిచాడు.

"కొత్తగా కట్టారు ఆనకట్ట, చూశొద్దామని పిల్ల ఒకటేపోరు పెడితే కోశెడు దూరాన్నుంచి నడిచొచ్చాం నాయనా. నేను వద్దే అని నోరు నోరు కొట్టుకుంటున్నా పిల్ల యింటేనా? ఆనకట్టమీద ఒక కాలుపెట్టి

ఇంకోకాలుతో నీళ్ళను తన్నటం మొదలెట్టింది. యింకే వుంది కాలుజారి ఒక్కసారి కొట్టుకు పోయింది. ఆ నారాయణమూర్తి ఈ తండ్రిని పంపించకపోతే నా ఒక్కగాను ఒక్కకూతురు గంగమ్మతల్లి మింగేశేదే"నని ముసలమ్మ కళ్ళ నీళ్ళెట్టుకుంది.

"ఇంకెందుకు యేడుస్తావ్! నీకూతురు బ్రతికిందిలే" డాక్టరు ఇంజెక్షను యిస్తూ ఓదార్చాడు.

"ఊరుకో ముసలమ్మా" మురహరికూడా సమీపించి ముసలమ్మను ఓదార్చాడు.

"ఇంకా తడిగుడ్డలుతోనే వున్నావా? నాయనా!" మురహరిని ఆమె పరామర్శించింది.

"ఫరవాలేదులే యింటికెళ్ళి మార్చుకుంటాను". మురహరి తానింకా యిక్కడ వున్నందుకు సిగ్గుపడుతూ అన్నాడు.

ఆ బాలిక నెమ్మది నెమ్మదిగా కళ్లు తెరచింది. మురహరి ఆప్యాయంతో ఆమె ముఖంలోనికి చూస్తున్నాడు. మృత్యువునుండి రక్షించిన అతనిపై ఆ అమ్మాయి తప్పకుండా కృతజ్ఞురాలౌతుందనుకున్నాడు. ఇంతకంటె పురుషుడు ఆకర్షింపబడటానికి మంచి సమయం మరొకటి దొరకదనుకున్నాడు. ఆ సమయంలో అతని మనస్సులో యువతీ యువకులు ప్రేమించుకొన్న ఘట్టాలన్నీ ఒక్కసారి స్ఫురణకు వచ్చాయి. అన్నిటికంటె ఈ సంఘటన ప్రేమ జనించటానికి చాలా బలవత్తరమైందిగా భావించుకొన్నాడు.

బాగా తెల్వొచ్చిన ఆ బాలిక తన చుట్టూ తల్లీ, తడిగుడ్డలతో ఒక యువకుడూ, డాక్టరూ నిలబడి వుండటం చూచింది. ఒక్కసారి "అమ్మా" అంటూ తన తల్లిని కౌగలించుకొని గావురుమంది.

"ఊరుకో అమ్మా! నేను చెప్పితే విన్నావా? తల్లి కూతురుతల నిమిరింది.

"ఇంకేమీ భయంలేదు. యేదైనా బండి కట్టించుకొని మీవూరు చేరం"డని డాక్టరు సలహాచెప్పి వెళ్ళిపోయాడు.

"నేను కూడా యిక వెళ్ళతానమ్మా!" మురహరి అన్నాడు.

"మంచిది నాయనా! నీ కడుపు చల్లగా నూరేళ్ళు బతుకు" మురహరిని దీవించింది ముసలమ్మ.

ప్రమాదంలో చిక్కుకొన్న అమ్మాయి పల్లెత్తి ఒక్కమాట కూడా మురహరిని పలుకరించలేదు.

అనసూయ గుర్తుకొచ్చిన మురహరి తర్వత్వరగా తన గదిముఖం పట్టాడు.

ప్రేమట! ప్రేమ! అంతా బూటకం. దీనికొక పవిత్ర అర్థాన్ని సృష్టించి అందరూ తెగపొగడటం నేర్చుకున్నారు. ఎదిటివారి హృదయాలను తెలుసుకోలేని ఈ పాడు ప్రపంచంలో ప్రేమకు స్థావరముందంటే అది వట్టి 'నాటకం' అని పళ్ళు బిగపట్టి గొణుక్కుంటూనే మురహరి బట్టలు మార్చుకుని వెంటనే కలం, కాగితం తీసి యింటికి బరబరా వుత్తరం రాసిపడేశాడు.

ఆ వుత్తరాన్ని చదువుకొన్న మురహరి తల్లిదండ్రుల ఆనందానికి మేరలేదు.



# సితార

❖

శ్రీ నందగిరి వెంకటరావు



---

జననం : 1910.

విడునామా : సెషన్ జడ్జి, నిజామాబాదు.

కార్యకలాపాలు : ——

అభిరుచి : కథాసాహిత్యం.

రచనలు : ముద్రితం : వివిధ సంచికల్లో కథలు.

అముద్రితం : కథలు.

అభిమాన రచయితలు : ——

✱

# సితార

౧౭౩౮ క్రీ. శ.

సాయంత్రమైంది.

అక్కడ మకామున్నాడు నాదిర్షా. లక్షయాభైవేల సైన్యం సింధు నది పొడుగూతా విడిసింది. అర్ధగంటలో గుడారాలన్నీ తయారయాయి. గుఱ్ఱాలని కట్టేసి మేత వేశాడు. అప్పుడే వంటశాలల్లోంచి పొగ రాత్తోంది. నది చాలా విశాలమైపోయి సముద్రంమల్లే అవుపడేచోట సుల్తాన్ డేరాలు వేశారు. నాలుగు సుల్తాన్ సొంతంకోసం; వందా ముప్పై ఆయన స్త్రీలకోసం. అహమద్షా, అక్బరలీ మొదలైన సుల్తాన్ అంతరంగిక మంత్రుల పదకొండు డేరాలు ఆయన డేరాకి యెడమ వేపున కొంత దూరానవేశారు. ఒకగంటకు పూర్వం అడవి జంతువులకి స్థావరంగా వుండిన సింధునదీతీరం మనుష్యవాసమై పోయింది. నాదిర్షా వేలిసంజ్ఞమీద నడిచిపోయే మహా పట్టణమది.

చైత్రమాసమైనా శాలువల్ని వొదల్నీటంలేదు చలి. వసంత మాసంతో వూగిపోతోన్న అక్కడి వనాలు, చల్లని పిల్లగాడ్పులు గంధర్వ క్రీడావిహారాలకి యోగ్యమైన కాశ్మీరదేశ వైభవాన్ని చవి చూపిస్తోన్నాయి. మామిడిగున్నలు చిగురుటాకుల లాలిత్యంతో తులదూగి పోతోన్నాయి. కోకిలలు తమ "కూఊ" ల మూలాన హిందోళన రాగంలో మైమరపించే శక్తి వుండటం నిజమేనంటున్నాయి.

ఐదుగడియల రాత్రయింది. దినమంతా ప్రయాణభారంచేత డస్సి పోయిన సైనికులంతా విశ్రాంతి గొంటూన్నారు. అక్కడక్కడ కొందరు యువకులు సారాయి త్రాగుతూ నెగళ్ళ వెలుగులో 'ఖబాష్' ఆడుతోన్నారు.

గుత్తా లప్పుడప్పుడు సకిలిస్తోన్నాయి. సుల్తాన్ డేరాలో బంగారు ముక్కాలుపీటమీద లాంతరొహాటి పెద్దకాంతితో వెలుగుతోంది. గుండ్రని దిండ్లమర్చబడ్డ సన్నని పరుపుమీద. అక్బరలీ మరియాదగా కూచొని వినయంగా మాట్లాడ్తోన్నాడు సుల్తాన్‌తో, రెండుపరుపులమీద పరువబడ్డ ముహమల్‌పరుపులో మెత్తనిపట్టుగొసెన్ల దిండ్లమధ్య వంకరగా వొరిగి కూచొని హుక్కా పీలుస్తోన్నాడు సుల్తాన్. పర్శియా దేశాన్ని ఆక్ర మించుకున్న రష్యాదేశీయుల్ని తరిమేసేప్పుడు లభించిన అందకత్తె లందరికన్నా అధికురాలైనామె సుల్తాన్ వెనక కూచొని పంకా విసరు తోంది. అఫ్ఘానిస్థానపురాజు తన వినయవిధేయతలని వ్యక్తపఱచడానికి కానుకగా సమర్పించిన సౌందర్యరాశి సుల్తాన్‌కు కుడిభాగాన కొంతదూరాన కూచొని తాంబూలంమడుస్తో తన సౌందర్యమంతా కదిలిపోగా ఆయన కందిస్తోంది. పర్శియాదేశం సొంతం తన స్వాధీనం అయాక ఆ దేశా న్నంతా కొల్లగొట్టించాడు. ప్రపంచంలో అందరికన్నా సౌందర్యవతియైన యువతి కావాలని, లభించింది షిరాజీ, ఆ షిరాజీ ఆయనకి దగ్గిరగా యెడమచేతిక్రింద వుండి హుక్కాగొట్టాన్ని అందిస్తోంది. ముట్టితే మాసి, వాసనచూస్తే వాడిపోయే ఆమె నాజూకుదేహాన్ని ఫిరంగిగుండ్లకు కూడా వెరువని తనవక్షంమీద వొంచుకొన్నాడు, ఆయన యెడమచేతివేళ్లు ఆమె వెంట్రుకల్తోతిగి గుండ్రని భుజాల్తో ఆడుకుంటున్నాయి అతనికి తెలియ కుండానే. అక్బరలీకి తనుచూసే దృశ్యమేమీ అర్థమవడంలేదు, విద్యా గంధం లేనివాళ్లు తాము తిట్టుకునే తిట్లకి అర్థం తెలిసికోనట్టు,

"అతడు సంధి కోరా దని చెప్పి యింతదూరం వచ్చాక పూరికే తిరిగిపోవటం వుచితంకాదు. అదీకాక యిక్కణ్ణుంచే మనం వెళ్ళి పోయామంటే నేను భయపడి వెళ్ళిపోయానని తన ప్రజల్తో చెప్పడానికి గూడా వెనక్కి తీయడు."

జవాబేమీ చెప్పకుండా నేలవేపు చూస్తో ఆలోచిస్తున్నాడు అక్బరలీ. సర్వసంగపరిత్యాగం గావించిన తాపసికి తన జీవితమంతా తపస్సునందు ధారబోయటంలోనే వుంది బ్రహ్మానందం. సకలేచ్ఛల్లో కామేచ్ఛే అధికంగా వుండే వరూధినికి ప్రవరాఖ్యుడిలాంటి యిష్టపురుషుడితో సౌఖ్య మొందడంలో వుంది బ్రహ్మానందం. కాని ఉత్తమ క్షత్రియుడి కాబ్రహ్మానందం వైరి కిరీటాన్ని తనకాలితో తన్నటంలో తప్ప వేరేచోట లేదు. నాదిర్షా యిప్పు డనుభవించే బ్రహ్మానందంలో శత్రువుపై పగ సాధించాంకదా అనే సంతోషంకూడా ఐక్యమైంది. అందుచేతే ఆతని విశాల నేత్రాలు మెరిసిపోతున్నాయి. ఒకప్పుడు తనని పరిహసించిన ఢిల్లీ సార్వభౌము డిప్పుడు తన పాదాలదగ్గిర శరణార్థియై పడున్నాడు. కానిసుల్తాను కిప్పుడొక గొప్ప విషమస్థితి సంభవించినది. ఢిల్లీపైబడి శృంగారమైన పట్టణాన్ని సర్వధ్వంసంచేసి పగతీర్చుకోడాని కాతని అంతరాత్మవొప్పదు. శరణుజొచ్చినవాడిపై దండెత్తడం చచ్చినపాముని బాదటం. అట్లాగాక యిక్కడినుంచే తిరిగిపోతే ఆ మొగల్‌రాజు తనని పరిహసించినందుకు పగతీర్చుకోటం యెట్లా? అక్బరలీకికూడా యేమీ తోచడం లేదు. సుల్తాన్ తీవ్రంగా ఆలోచిస్తోన్నాడు. చప్పున ఆయన కేదో ఆలోచన తట్టింది.

"ఢిల్లీ కెళ్లాలి."

"వెళ్ళి?"

"ఢిల్లీప్రజలందరిముందు మొగల్ సింహాసనాన్ని మూడురోజు లధిష్ఠించి తిరిగి రాజ్యాన్ని మొగల్‌రాజు కిచ్చేసి మనదేశం వెళ్ళిపోవటం. దీనివల్ల అతనికి పరాభవం కలిగించినవాళ్ళ మవుతాంకూడా."

"ఆయన వొప్పకుంటే?"

"యుద్ధం."

* * *

డేరా ముహామల్ పరదా పక్కకి తొలగింది. ఆయుధపాణియైన ఆగాబాషీ వంగి సలాంచేసి నుంచున్నాడు.

"ఏమి" అన్నట్టు అతనివేపు చూశాడు సుల్తాన్.

"ఢిల్లీ చక్రవర్తి తమకు కానుక పంపారు."

"ఏమేమిటి?"

"ఒక మణుగు ముత్యాలు, ఐదేనుగులు, యిరవై గుఱ్ఱాలు, పదిమంది సుందర యువతులు.

"చీకటై పోయింది. ఏనుగుల్ని, గుఱ్ఱాల్ని పొద్దున చూడొచ్చు. తక్కిన వాట్ని చూడ్డానికొస్తోన్నా నిప్పుడే. సిద్ధంగా వుంచు."

ఆగాబాషీ వంగి సలాంచేసి వెళ్ళిపోయాడు. ఆ పారసీక కన్యను తన వక్షంమీదనుంచి లేపి తనుకూడా లేచాడు సుల్తాన్. అక్బరలీ కూడ లేచాడు. మాట్లాడకుండా యిద్దరూ బైటికెళ్ళారు.

పక్క డేరాలోకి సుల్తాన్ అక్బరాలీతో గూడా వొచ్చేవరకు ఆపదిమంది బురకాస్త్రీలను వరుసగా నుంచోబెట్టాడు ఆగాబాషీ. అక్బరలీ, ఆగాబాషీ దూరంగా నుంచున్నారు. సుల్తాన్ మొదటామె దెగ్గిరికొచ్చి బురకా తియ్యమన్నాడు. విధిలేక మెల్లిగా తొలగించి తల కిందికివాల్చి నుంచుంది. ఆ బురకాని పూర్తిగా యీడ్చేసి, కాలినుంచి తలదాకా చూశాడు యెగాదిగా. ముఖాన్ని పైకెత్తి దీపంవెలుగులో చూశాడు. నిపుణుడైన శిల్పిచేత చెక్కబడ్డ దంతపుబొమ్మలాగుంది. వరుసగా తక్కినవాళ్ళందర్నీ యిట్లానే పరిశీలించాడు. ఒకాళ్ళకన్నా ఒకా రెక్కువ సుందరంగా వున్నారు. వాళ్ళంత చెడ్డగా లేరన్నట్టు ఆ కళ్ళనుంచీ, మెరిసిపోయే ఆ నల్లని గడ్డంమధ్య యెఱ్ఱగా కదిలే ఆ పెదిమలనుంచీ తృప్తి వ్యక్తమవుతోంది. ఆ యువతుల్ని తన యిష్టమొచ్చినట్టు పరిశీలిస్తోన్నాడు గుఱ్ఱములకు లక్షణాలని పరీక్షించినట్టు. అవసరమనుకున్న ప్రదేశాల్లో యేమాత్రం జంకకుండా గుడ్డని తొలగించి చేతితోతాకి చూస్తోన్నాడు.

పందొమ్మిదేండ్ల అరబు యువ తౌహామెని గురించి అనుమానమేదో కలిగితే అక్బరలీని వెళ్ళిపొమ్మని ఆమె గుడ్డలన్నీ విడిపించి లాంతరు దెగ్గిరకి తెచ్చి వెలుగులో ఆమె దేహాన్నంతా పరీక్షించా డామె కంటినుండి కారే ఆనీళ్ళనేమాత్రం లెక్క-చేయకుండానే. చివరకి పొడుగ్గా నుంచున్న యువతి దెగ్గిరికొచ్చి సహజమైన కంఠస్వరంతో బురకా తివ్వమన్నాడు. తివ్వలా. మళ్ళీ ఆజ్ఞాపించాడు. అయినా తివ్వలా. ఉగ్రుడయాడు. నాదిర్షా ఆజ్ఞ అమల్‌గావడాని కాలస్యమే. తనే యీడ్చిపారేశాడు బురకాని. ఆమె తల కిందికి వాలలేదు. పైకెగరేసి గర్వంగా, ధైర్యంగా నుంచుంది. ఎత్తైన ఆ ముఖంలో ఎదురుబడేస్వభావం స్పష్టంగా తాండవమాడుతోంది. ఇంచుమించు సుల్తా నెత్తుందామె. ఆతనిచూపులు క్రమంగా మెరిసిపోయే ఆమెదేహపు ఉన్నతప్రదేశాలపైనుండి జారుతోన్నాయి. ఒక్క- చూపులో అసాధారణమైన ఆమె అంగసౌందర్యం యవ్వనం ఆతని కాశ్చర్యం కలిగించాయి. ఒళ్లు మొలకలెత్తింది. మళ్ళీ పైకిచూశాడు. స్త్రీలలిత దేహాకృతిని సరవిచెట్లకు పోల్చి వాళ్ళ కంఠమాధుర్యాన్ని 'బుల్ బుల్' స్వరాలకనువర్తించే తనదర్బార్లోని కవుల స్త్రీ వర్ణనంతా అసంతృప్తికరంగానే తోచిందాతని కాముహూర్తాన. చూపుసైతం జారిపోయే ఆమెనున్న నిరెట్టని పట్టుకోపోయాడు. ఆమె తనకుడిచేత్తో బొడ్లోంచి మెరిసిపోయే చిన్న కత్తి నోడబెరికి సుల్తాన్‌పై లేపింది. ఆగాఖాషీ పెద్దగా అరచి ముందుకు పరుగెత్తాడు. పచ్చని చెట్టుని సైతం బూడిదచేసి కూల్చే ఆ తీక్షమైన చూపులు ఆమెకళ్ళల్లోకి గురిపెట్టాడు సుల్తాన్. ఆమె అట్లాగే ఆగింది. తనచెయ్యి ముందుకుజాచి, "ఇటివ్వూ" అన్నాడు. ఎత్తిన ఆమెచెయ్యి వణికింది. "ఇవ్వూ" అన్నాడు, గట్టిగా పళ్లుబిగపట్టి. సాధారణ గర్భిణీస్త్రీ దగ్గిర గనక వుంటే ఆ హొక్క- శబ్దానికే గర్భపాతం గావాలిసింది. ఆకత్తి నల్లే ఆచేతిలో పడేసి తల కిందికివాల్చి నుంచుంది. రెండు నీటిచుక్క-లు చెంపలమీదుగా జారుంటాయి. కాని అవుపడనీలేదు. ఆకత్తిని తననడుం

కట్టులో వుంచుకొని వొక్కసారి మళ్ళీ కిందినుంచి పైకి చూశాడు. ఆగాబాషీవేపు తిరిగి మెల్లిగా నడుస్తో "ఎవరీమె?"

"మొగల్ మహారాణిదెగ్గిర అంతరంగికస్త్రీ. రాజపుత్రకన్య సితారా" సుల్తాన్ వెళ్ళిపోయాడు.

* * *

తన డేరాలో సుల్తాన్ ఢిల్లీప్రయాణాన్ని గురించి ఆలోచిస్తో యిటూ అటూ పచారు చేస్తోన్నాడు. ఇతరు లెవరూ లేరు. దాసివొకర్తె వచ్చి సలాంచేసి, "ఈరాత్రి యేడేరాలో పండుకుంటారు" అని అడిగింది. ఆలోచించాడు. తాత్కాలికంగా తన వెంటున్న వందా ముప్పయిమంది సందర్నీ తలుచుకున్నాడు. లక్షల ద్రవ్యం వ్యయపరచి దొంగతనంగా పట్టితెప్పించిన ఆంగ్ల సుందరి జ్ఞాపక మొచ్చింది. ఆమెదగ్గిరికి పోవాలను కున్నాడు. కాని తక్షణమే వద్దనిపించింది. "ఇక్కడే పడుకుంటా" నన్నాడు. దాసి వెళ్ళింది. ఆవలింత లొచ్చా యాయనకి. దుస్తులు విప్పు తుంటే నడుంపట్టాలోంచి చిన్నకత్తి కిందపడ్డది. ఎత్తిచూశాడు. వజ్రాలు చెక్కున్నాయి దానికి. మళ్ళీ సితారా జ్ఞాపక మొచ్చింది. ఆ కత్తి పిడివేపు చూస్తో ఆమె సాహసాన్ని, అందాన్ని తలుచుకున్నాడు రెండునిమిషాలు. దాన్నొకమూల పడేసి "ఆగా" అన్నాడు. ఆగాబాషీ సలాం చేస్తో హాజ రయ్యాడు. "సితారాని తీసుకురా."

రెండునిమిషాల్లో పరదా తొలిగి తల కిందికి వాల్చుకున్న సితార, వెనకాల ఆగాబాషీ ప్రత్యక్షమయ్యారు. సుల్తాన్ చూపులఅర్థం తెలిసికొని పరదా జారవిడుస్తో వెళ్ళిపోయా డాగాబాషీ. అట్లాగే నుంచు న్నామె దగ్గిరికి సుల్తాన్ మెల్లిగావెళ్ళి ముందు దగ్గిరగా నుంచున్నాడు. ఆమెచేతిని పట్టుకోపోతే తనబలంకొద్దీ చేతిని ఝాడించింది విడిపించుకోవాలని. ఇంకోచేతినిగూడా పట్టుకున్నాడు. పై కెగరేసిన ముఖం వేపు చూశాడు. పళ్ళు బిగబట్టింది. కాని కళ్ళల్లో నీళ్లు గమ్మాయి.

"ఎదురు తిరగటమే ?"

"వొంటరివాన్ని. లేకపోతే....... !"

గట్టిగా నవ్వాడు ఎఱ్ఱని పెదిమల సంధినుంచి తెల్లనిపళ్లజత అవుపడేట్టు. నిజమైన సంతోషమది. వణుకుతోన్న ఆమె క్రిందిపెదవి ఆయన హృదయాన్ని కదిల్చేసింది. దాని ఆస్వాదనానికి ఆశపడ్డాడు. ఆమె రెండు చేతుల్ని తన నడుంవెనక్కి లాగి ఆమెని తన మీదికి లాక్కున్నాడు. ఉడికిపొయ్యే ఆమె మెత్తని దేహం ఆయన విశాలవక్షాన్ని అనుకుంది.

* *

తెల్లారకముందే లేచి గుఱ్ఱాల కవాతుకోసం వెళ్లిపోయాడు సుల్తాన్. జాంపొద్దెక్కాక పరిచారిక స్త్రీ లొచ్చారు డేరాలోకి. అట్లాగే పడుంది పరుపుకో సితార వొంటి మీదేమాత్రం స్పృహలేకుండా. చీరా, రవికా చినిగి యెక్కడెక్కడో పడున్నాయి. జుట్టంతా చెదిరిపోయి చిక్కుపడ్డది. కళ్లరెప్పలు బాగా ఎఱ్ఱగా వాచిపోయాయి. మెళ్లోని పేర్లు పెరిగిపోయాయి. నలిపేయబడ్డ గులాబిపువ్వు.

దాసీలామెకి గుడ్డగట్టించి, పాలుతాగించి, పడుకోబెట్టి వెళ్లిపోయారు. మధ్యాహ్నంతరువాత మేలుకొన్నది. కళ్ళు విప్పి చూసింది. ఆరునెల్లనుంచి అవస్థపడుతోన్న రోగిమల్లే మెల్లిగాలేచి దిండుకి వొరిగి కూచుంది. ఎక్కడున్నానా అని చుట్టూ చూసింది. ఒక నిమిషం తరువాత, ఆడేరా, ఆ పరుపు, ఆ సుల్తాన్ గవును, తన చినిగిపడున్న రవికా అన్నీ అర్థమయాయి. కళ్లుమూసుకొని పెద్దకేకవేసింది. పరదాలోంచి ఆగాబాషీ ఆమెకు తెలీకుండా తొంగిచూశాడు. మళ్లీ కళ్లువిప్పింది. తనదేహం వైపు చూసుకుంది, గుడ్డలుతొలిగించి, దుఃఖ మాగిందికాదు. ఆ దేహాన్నంతా కత్తితో ముక్కలు ముక్కలుగా నరికిపారేయాలన్నంత అసహ్యమేసింది. అంతా ఎంగిలి. అంతా హుక్కావాసన. అంతా ఆగడ్డం గుచ్చు

కున్న చోటే. కాలిగోరునుంచి తలవెంట్రుకల్దాక ఎంగిలికాని చోటొహ చింతగింజంతైనా లేదు. ఈ యిరవైనాలుగేళ్ళనుంచి యింతజాగ్రతగా ఈ దేహాన్ని పెంచిందిందుకోసమేనా ? ఈ దేహానికోసం ఆశపడి తమ రాజ్యాలనిసైతం ధారవోయడానికి సిద్ధంగా వున్నవాళ్లని ముట్టుకోసైతం ముట్టుకోనకుండా కాపాడింది యిట్లా యీ క్రూరిడిచేతులో కోల్పోడానికేనా ? కళ్ళనీళ్ల మెత్తల్ని తడిపేశాయి. వొళ్ళంతా గిచ్చుకుంది. లేచి నుంచోపోయింది. కాళ్లు వొణికాయి. దేహం వొణికింది. అర్థంకాని నీరసం. మళ్ళీ పడిపోయింది. రెండు చేతులా కళ్ళుమూసుకోని యేడుస్తోంది. ఆరాత్రివిషయా లెన్నో జ్ఞాపకమొస్తోన్నాయి ఒహటి తరువా తొహటి. ఆతని మొండిపట్టుదల ! ఉద్రేకం ! బలం ! ఎంతకూ తృప్తి కాని కామం !

ఇద్దరు పరిచారకస్త్రీలు రెండు బంగారుపళ్ళెరాల్లో తిండిపదార్థాలని తెచ్చి సితార వున్నదికూడా తెలీనట్టు ఆమెవైపు చూడకుండానే పరుపు దగ్గిరపెట్టి వెళ్ళిపోతోన్నారు. పట్టరానికోపం వచ్చిందామెకి. ఆ రెండు పళ్లెరాలని వాళ్ళ తలలపై విసిరింది. అయినా వాళ్లు మాట్లాళ్ళేదు. కోపంగా తిరిగిచూసి వెళ్లిపోయారు. సాయంత్రం దాకా యెవరూ అవుపళ్లా. మెల్లిగా లేచి డేరా తోవవేపు నడిచింది. పరదా సన్నగా కదిలించేసరికి నల్లని సిద్దీ వొహడు చేతితో సంజ్ఞచేస్తో, “అది తప్పు. లోపలికెళ్లండి” అన్నాడు. రాత్రికి మళ్లీ రెండు పళ్లెరాలొచ్చాయి. కాని వాట్ని ముట్టుకోలా సితార. తెల్లారి మళ్ళీ పళ్ళెరాలొచ్చేవరకు ఆకలిచాత పేగులు మాడిపోతోన్నాయి. ఆవంటకాల్లోంచి వొచ్చేవాసన రెండు బుక్కలు తినడానికి పురికొల్పింది.

మూడు రోజులు గడిచాయి. మధ్యాహ్నం, సాయంత్రం తిండి పదార్థాలు తెచ్చే దాసీలు తప్ప వేరు మనుష్యాకారం అవుపళ్లేదు. రాత్రపడంతోటే సుల్తాన్ వొస్తాడేమోనని భయపడేది. కాని ఆయనకి జ్ఞాపకముంటేనా అసలు !

ఆ వుదయాన యేమీతోచక డేరా కిటికీ దెగ్గిర నుంచుంది. ఆవలి వేపొహసిద్దీ నుంచున్నాడు. దూరాన సైనికులగుంపొహటి వలయాకారంగా నుంచుంది. మధ్యొహడు గోధుమరంగు గుఱ్ఱాన్ని పట్టుకోనుంచున్నాడు. ఒహరితరువాతొహరొచ్చి దాన్ని యెక్కడానికి ప్రయత్నిస్తోన్నారు. కాని అది ఆకాశాన్ని అందుకోడానికేమోన్నట్టు యెగుర్తో అందర్నీ పడేస్తోంది. సుల్తాన్ పక్కన నుంచోని అట్లా పడిపోయేవాళ్ళని కోపంగా చూస్తోన్నాడు. చివరకి "ఆగా, నువ్వు" అన్నాడు సుల్తాన్. ఆగాబాషీ యెక్కాడు. గుఱ్ఱం యెగిరింది. రెండుకాళ్ళమీద లేచి నుంచోడం ఆరంభించింది. అంకోడిలోంచి కాలుజారి పడిపోయా డాగా. సుల్తానాతన్ని వొక్క తన్ను తన్నాడు. బెత్తం తెమ్మన్నాడు. తెచ్చారు. తానే సొంతంగా యెక్కాడు గుఱ్ఱాన్ని. సుల్తాన్ బెత్తం విరిగేట్టు కొడుతోన్నాడు దాన్ని దెబ్బమీద దెబ్బ. గుఱ్ఱానికి వొళ్ళంతా పగిలి నెత్తురు దుముకుతోంది. ఎన్నోసార్లు పడిపోయింది కావాలని. కాని దాంతోకూడా మళ్ళీ లేచాడు సుల్తాన్. ఎగిరి యెగిరి అలిసిపోయింది. డేరాలచుట్టంతా పరుగెత్తింది. ఇంకా కొడ్తోన్నాడు. చివరకి నోట్లోంచి తెల్లనినురుగు రావటం మొదలెట్టింది. పడిపోయింది. మళ్ళీలేవలా. అప్పుడు వొదిలాడు దాన్ని సుల్తాన్. ఇదంతా చూసి పెద్దనిట్టూర్పు విడిచింది సితార. వొళ్ళంతా చెమటలు కమ్మాయి. "సుల్తానుకి లొంగందేది!" అన్నాడు సిద్దీ.

ఢిల్లీ చేరింది సైన్యం. ఢిల్లీప్రజ లెవర్నీ యేమనొద్దని ఆజ్ఞాపించాడు సుల్తాన్. కాని సైన్యం ఢిల్లీచేరిన రెండురూముల్లోపలే సుల్తాన్‌సైనికులు ఢిల్లీ స్త్రీలను బలవంతంగా చెరుస్తోన్నారనేవార్త బైల్దేరింది. ఢిల్లీ ప్రజ లంతా సుల్తాన్‌సైన్యంమీద తిరగబడ్డారు. చాలామందిని చంపారుకూడా. ఇదంతా మొగల్‌చక్రవర్తి కుట్ర అనుకున్నాడు సుల్తాన్. యుద్ధాని కాజ్ఞ అయింది. యుద్ధాని కేమాత్రం సిద్ధంలేని ఢిల్లీ ప్రజలు కొన్ని ఘడియల్లో చెల్లాచెదరైపోయారు. ఎంతో సుందరమైన మిద్దెలు, మేడలు తగుల

బెట్టబడ్డాయి. స్త్రీలూ, పిల్లలూ యెందరో అగ్నిపాలయ్యారు. చేతికి దొరికిన ద్రవ్యాన్నంతా అపహరించారు సుల్తాన్ సైనికులు. చివరకి మొగల్ చక్రవర్తిని సైతం చెరబెట్టారు. రాణిని సుల్తాన్ స్త్రీలలో దాకల్‌చేశారు. మూడురోజు లిట్లానే వుంచాలన్నాడు సుల్తాన్ ఢిల్లీ సింహాసనంమీద కూచొని.

సితారా డేరాలోకి మామూలుప్రకారం భోజనంతెచ్చారు మధ్యాహ్నం. పళ్ళెరాన్ని అక్కడపెట్టి నలువేపులా చూసిం దాదాసి. తనబొడ్డులోంచి ఒహచీటీ తీసి చప్పున సితారమీద పడేసి వెళ్ళిపోయింది. ఏంఘోరం రాశాడో దాంట్లో నని భయపడ్డది. వొణికే చేతుల్తో విప్పిచూసింది. రాణి వుంగరం మొహరుంది. పాప మామెకేం తెలుసు సితార స్థితి: సితార సుల్తాన్‌మీద సర్వాధికారం చలాయిస్తోం దనుకొం దామె. అందు కనే అట్లారాసింది. ఇట్లా నిర్బంధింపబడి తన సౌందర్య యౌవనాలని బలవంతాన గోల్పోతుందని ఆమె కేంతెలుసు? సుల్తాన్ తనని అవమాన పరచకుండా రక్షించమంది. ఢిల్లీరాణి సితారాని తనచిన్నిచెల్లెలి కన్నెక్కువ గారాబంగా పెంచింది. చక్రవర్తి దురుద్దేశాన్నుంచి యెన్నోసార్లు రక్షించింది. తా నెన్నో కష్టాలపాలై. అట్లాంటి దయామతల్లికి సితార యేమిస్తే యేమవుతుంది! ఏవిధంగా ఆమె ఋణం తీర్చుకోగల్దు! తనని రక్షించమని రాసింది. ఆమె మానాన్ని రక్షించడం చెరలో వున్న తనచాత నవుతుందా? అదీ సుల్తాన్నుండి రక్షించడం! తన్నుతాను రక్షించుకో లేకపోయింది, యితర్లని రక్షించగల్దా? మళ్ళీ ఆరాత్రి అవస్థంతా జ్ఞాపక మొచ్చింది. వొళ్ళు ఝల్లుమంది. చివరికొహ ఆలోచన తట్టింది. ఆ ప్రయత్నం కొనసాగుతుందని అణుమాత్రంకూడా ఆశలేదు. కాని ఆ మార్గంతప్ప ఇంకొహటేదీ లేదు. కాని తన ఆత్మగౌరవాన్ని త్యాగం చెయ్యాలి. తన మాన ప్రాణాల్ని యెన్నోసార్లు రక్షించిన ఆమహారాణి మానాన్ని కాపాడ్డానికి యేమైనా చేయాలి. లేకపోతే ఏల్లేఋమరి.

పరదాదెగ్గిరికెళ్ళి సిద్దీ కారాణి వుత్తర మిచ్చి "దీన్ని జాగ్రతగా తీసికెళ్ళి నేను పంపానని సుల్తాన్ కివ్వాలి" అంది. సిద్దీ ఆశ్చర్యంతో చూసి సలాంచేసి మంచిదన్నాడు.

సితార భోంచేసి తాంబూలం చేతులోపట్టుకుంది వేసుకోవాలని. పరదా తొలిగించి సుల్తాన్ ప్రవేశించాడు. ఆమెముందు నవ్వుతోనుంచొని ఆమె చేతిలోని తాంబూలం లాక్కొని నోట్లో వేసుకున్నాడు. సితార పంపిన వుత్తరం చూపిస్తో నుంచున్నాడు. ఆమె కాప్రసన్నదృక్కులు అర్థం కాలా. ఏమీ భావంలేని చూపుల్తో యెదురుగా నుంచుంది.

"ఏమి టీవుత్తరం?"

ఆఉత్తరంవేపు చూసింది.

"నాకీభాష రాదు. ఏం రాశావో చెప్పు." చిరునవ్వు తాండవ మాడుతోం దాగడ్డంలో, కళ్ళల్లో. ఈ తరుణం పోగొట్టుకుంటే లాభం లేదు. ధైర్యం తెచ్చుకుంది నేలవేపు చూస్తోనే "అది నేను రాయలా. మీరు చెరబెట్టిన ఢిల్లీరాణి నాకు రాసింది తనని రక్షించమని."

"ఏమైందామెకి? సౌఖ్యంగానే వుందిగా."

సితారకి తెలుసు నిజంగా సుల్తాన్‌కి అర్థంకాలేదని. కాని రాణి కోరే రక్షణేమిటో సిగ్గువిడిచి యెట్లా చెప్పగల్దాయన్తో? ఒక్క నిమిషం యిద్దరూ మాట్లాళ్ళా. ఏమిటో తెలిసికోవాలని సుల్తాన్ ఆలోచించాడు కూడా. కాని లాభం లేకపోయింది. సితార చివరకి ధైర్యం చేసింది. రాణి కోసం యేమైనా చేయగల్దు.

"స్త్రీల మానమంటే లెక్కలేని మీనుండి రక్షించమని రాసింది."

అర్థమైంది సుల్తాన్‌కి. పట్టరాని సంతోష మొచ్చింది. అమాంతం సితారాని కౌగిలించుకొని ముద్దెట్టుకోవాలనిపించింది. కాని అణుచుకున్నా డాకోర్కెను. సితారాని సంతోష పెట్టడాని కేంజవాబు చెప్పాలో ఆలో

చిస్తున్నాడు. వొచ్చే జబాబెట్లా పిడుగుమల్లే పడుతోందో నని భయ పడ్తోంది సితార ఈరాన్ తివాసీమీది నక్షీనిచూస్తో.

"ఏం చేయమంటావు మరి" అన్నాడు.

ఆశ్చర్యంతో పైకి చూసింది. ఇట్లాంటి జవాబొస్తుందనుకోలా. ఆమొఖంలోంచి కరుణ, కరుణకన్న ఎక్కువ మోహం పూడిపడు తోన్నాయి. "రక్షించాలి" అంది.

"నీదగ్గిరకి పంపనా?"

సంతోషాధిక్యంచాత ఆమె కంటినుండి నీటిచుక్కలు జారాయి. మళ్ళీ పైకిచూసింది. ఆయనగ్గూడా తెలుసు, ఆమెకి సంతోషం కలిగిందని. మరీసంతోషంతో ఆమె కళ్ళల్లోకి చూస్తో "ఇంకా యేమిటాజ్ఞ" అన్నాడు. ఆమె మాట్లాళ్లేదు. కాని ఆమెకి తెలీకుండానే ఆమె కళ్లు కృతజ్ఞతని తెలిపాయి. అట్లా నుంచున్నామెని అమాంతం "అమ్మా" అనేట్టు కౌగి లించుకొని పెదిమల్ని ముద్దుపెట్టుకొని చప్పున వెళ్ళిపోయినాడు.

పది నిమిషాల్లో రాణీ, సితారా ఒహళ్ళనొహరు కౌగిలించుకొని యేడ్చారు.

రెండురోజులు గడిచాయి. సుల్తాన్ విషయమే తెలీదు సితారాకి.

ఆనాడు పొద్దున్నే ప్రజలందరిముందు ఢిల్లీరాజ్యాన్ని తిరిగి మొగల్ చక్రవర్తి కొప్పగించాడు సుల్తాన్. ఖయిదీలందర్నీ వొదిలారు. మర్నాడు ప్రయాణం స్థిరపడ్డది.

ఆరాత్రి భోజనం తరువాత సుల్తానొచ్చాడు డేరాలోకి. సితార భయపడ్డది బాధిస్తాడేమో మోహంచేత అని. కాని ఆమెని ముట్టుకోసైతం ముట్టుకోలా; రాణివిషయంకూడా మాట్లాళ్లా. జ్ఞాపక మున్నట్టే లేదాయనకి. ఆమె మాట్లాడకున్నా ఢిల్లీ విషయాలెన్నో చెప్పాడామెతో తనే. చివరకి నిద్రపోయాడు. సితార దూరాన కూచుంది నిద్ర రాకుండడంచేత. మధ్య రాత్రి దాటింది. హఠాత్తుగా సితారా కేదో అనుమానం కలిగింది. సుల్తాన్

పరుపువెనకాల యెవరో వున్నట్టనిపించింది. లేచి మెల్లిగా ఆవేపు నడిచింది. నల్లనాకార మొహటి అవుపడ్డది. ఆ వ్యక్తి మెరిసిపోయే కత్తితో నిద్రపోతోన్న సుల్తాన్ మీద పడుతోన్నాడు. సితార "కెవ్వున" కేకేసి సుల్తాన్ దేహంమీద పడి అతని దేహాన్ని తన దేహంతో కప్పింది. అయినా ఆక్రూరుడి కత్తిదెబ్బ సితార యెడమచేతికి తగుల్తో సుల్తాను కుడిచేతిని బాగా గాయపరిచింది. సుల్తాన్ "హా" అన్నాడు. తక్షణమే బైటినుండి పదిమంది సైనికులు పరుగెత్తుకొచ్చి ఆ దొంగని అక్కడే అంతమొనర్చారు. సుల్తాన్‌కి తగిలిన గాయం గొప్పది. స్మృతిలేకుండా పడిపోయాడు. రాచవైద్యుడొచ్చి కట్టుకట్టి సితారానితప్ప అందర్నీ బైట పొమ్మన్నాడు.

రాత్రంతా సితారా తనకు తెలీకుండానే సుల్తాన్ పక్కన కూచొని పంకా విసిరింది. తెల్లారకట్ల చల్లనిగాలి వీచేప్పుడు సుల్తాన్ కదిలాడు. కళ్లు విప్పి దిగులుముఖంతో పక్కన కూచొనివున్న సితారాని చూశాడు. "సితారా" అన్నాడు. కృతజ్ఞతను వొలికించే ఆవాక్కమాటతో సితార హృదయం నీరైపోయింది. అతని గండం తప్పిందిగదా అనే సంతోషంకూడా దానికి తోడైంది. తనయెడమచేత్తో ఆమె చేతిని దెగ్గిరకి లాక్కొని "ఆనాడు నన్ను చంపడానికి సాహసించిన దానివి యీవాళెందుకు రక్షించా" వన్నాడు. ఆమె అతని వక్షంమీద తనదేహాన్ని ఆనించి ఆతని పెదిమల్ని ముద్దెట్టుకుంది. తనయెడమచేత్తో ఆమె నట్లానే పట్టుకొని "నాహృదయానికి ప్రేమ నేర్పావు సితారా" అన్నాడు.





# సుప్రభాతం

❖

శ్రీ ఊటుకూరు రంగారావు



జననం : 8-12-1929.

చిరునామా : ఖమ్మం.

కార్యకలాపాలు : జర్నలిస్టు.

అభిరుచి : కవిత్వం, కథారచన, జర్నలిజం, సంగీతం.

రచనలు : ముద్రితం : వివిధ తెలుగు పత్రికలలో — కథలూ, పద్యాలూ, గేయాలూ.

అముద్రితం : —

అభిమాన రచయితలు : తిక్కన, కాళిదాసు, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీరంగం శ్రీనివాసరావు.

*

# సుప్రభాతం

"జానకి మంచి అందగత్తె. బాగా చదువుకుని విజ్ఞానం అంతో యింతో సంపాదించింది కూడాను. చిన్నప్పటినుంచీ స్వేచ్ఛా వాతావరణంలో పెరిగి పెద్దదై, తన మంచిచెడ్డలు తను నిర్ణయించుకునే శక్తి సామర్థ్యాలు పొందిన వికసిత పుష్పం. తనో; ఎందులోనూ ఆవిడకి సాటిరాదు. ఇటు తన అందం చూడబోదామంటే ఆ ఎత్తుపళ్ళూ, మిట్ట నొసలూ, వంగిపోతూన్న శరీరం. తనని అంతా ఇంపైనాలుగేళ్ళ ముసలాడని పిలుస్తారు మిత్రులు. ఆవిడకున్నంతచదువూ సంస్కారంకూడా లేవు తనకు. నిజం ఆలోచిస్తే జానకి క్లాస్‌మేట్స్‌కన్నా, పరిచితులకన్నా, స్నేహితులకన్నా తను అన్నింటిలోనూ తీసికట్టే అయినప్పుడు, తనలో ఏంచూసి జానకి యిలా ఉత్తరం రాసింది? ఈ వుత్తరం తనని పరిహాసించడానికా, లేక పరిశోధించడానికా జానకి రాయడం?" ఎంత ఆలోచించినా విశ్వేశ్వరరావు బుర్ర ఈ సమస్యని పరిష్కరించుకోలేక పోయింది. విశ్వేశ్వరరావు రెండు గంటలనుంచీ మథన పడుతున్నాడు. తర్కశక్తినంతా ఉపయోగించి 'యిప్పుడేంచేస్తే ఏ ఫలితం లభిస్తుంది' అవి చూసి విఫలుడై పోయాడు. ఏదీ తోచడం లేదు.

సర్వర్‌కి మంచి 'స్ట్రాంగ్ టీ' ఆర్డరిచ్చి సిగరెట్టు వెలిగించాడు విశ్వేశ్వరరావు. అటూ ఇటూ ఎవరన్నా వుండి తనని పరిశీలిస్తున్నారేమోనని చూశాడు. ఆ మూలన కూర్చున్న తనమీద ఎవరిదృష్టి ప్రసరించకపోవడం గమనించి జేబులోంచి ఓ కాగితాన్నితీసి తనలో తనే మళ్ళీ ఓసారి చదువుకున్నాడు. ఆ కాగితం తనకుచేరిన ఈ రెండుగంటలనుంచీ ఎన్నిసార్లు దాన్ని విప్పి చదివాడో లెక్కలేదు. ఆలోచిస్తూనే టీని కాస్తా

గడగడా తాగేసి, బలంగా ఒకసారి సిగరెట్టుదమ్ముపీల్చి మళ్లీ ఆలోచనలో పడ్డాడు విశ్వేశ్వరరావు. మిత్రులతనికి 'సర్వజ్ఞు' డనే బిరుదునూ, 'మహా కవి' అనే పట్టానూ యిచ్చారు; కాని, అతను దేన్నో పరిష్కరించుకో లేకపోతున్నాడు.

'రాజారావు'తో తనకి రెండేళ్ళనుంచీ పరిచయం. ఈ రెండేళ్ళలో తను వాళ్ళింటికి ఎన్ని వందలసార్లో వెళ్ళి వుంటాడు. వెళ్ళినప్పుడల్లా జానకినీ, ఆవిడ పరిస్థితుల్నీ తను చూస్తూనే వున్నాడు. కాని ఎలాంటి అభిప్రాయమూ తన కేర్పడలేదు. అప్పుడప్పుడు వాడి చెల్లెళ్ళ చదువునూ చురుకుదనాన్నీ గురించి రాజాయే చెబుతుండేవాడు. పెద్దమ్మాయి సరళని యమ్మేదాకా చదివించాలనీ, చిన్నమ్మాయి జానకిని డాక్టర్‌గా చేయాలనీ అంటూండే వాడు. రాజాకు తనంటే ఎంతో ఆదరమూ అభిమానమూను. అతని తల్లికూడా చాలా ఆప్యాయంగా ప్రవర్తించేది. గంటలకొద్దీ ఏదో విషయాన్ని గురించి తామిద్దరూ చర్చించేటప్పుడు జానకి అతిచనువుగా విషయంలో జోక్యం కల్పించుకుని తనూ పాల్గొనేది. కాని ఎన్నడూ ఇలాంటి వాంఛ ఆవిడకున్నట్టు ప్రస్ఫుటమవలేదు. సామాన్య స్త్రీలలాగే ఆవిడలోకూడా వాంఛలూ, ప్రేరేపణలూ వుంటాయని ఎన్నడూ అనుకో డానికి ఆస్కారం లభించలేదు. సరళ మొదటినుంచీ తనతో చాలా ముభా వంగా వుండేది. అనవసరంగా మాట్లాడ్డంగానీ, చర్చల్లో పాల్గొనడంగానీ ఆవిడ కిష్టంలేదు. సరళదో శిక్షిత స్వభావం. జానకి సురక్షితమైన ఆచార వ్యవహారాలు వంట జీర్ణించుకున్నదేకాని సరళలోగల మాంద్యం ఆవిడలో లేదు. ఒకే యింట్లో ఒకే తల్లికడుపున పుట్టిన వీళ్ళ ముగ్గురివీ మూడు వింతప్రకృతులు. ఈ విషయాన్నిగురించే సరదాగా తను అప్పుడప్పుడు ఆలోచిస్తూండేవాడు కూడాను.

ఇవాళ జానకి పుత్తరం విశ్వేశ్వరరావుకి విపరీతాశ్చర్యం కలిగించ డంతోపాటు, సందిగ్ధావస్థలో పడేసింది. ఆవిడ తనని మనసారా వాంఛిస్తు

న్నట్టు యీ పుత్తరంకంటే యింకా ఋజువేంకావాలి? ఆ వాంఛ ఏ స్వరూపంలో, ఏ దశలో గుప్తీకరించబడివుందోకూడా ఇట్టే తెలిసి పోతుంది పుత్తరం చూస్తేనే - కాని, సమస్య అది కాదు. జానకి పంపిన యీ ఆహ్వానాన్ని అంగీకరించడమా తిరస్కరించడమా అన్నదే.

"—సముద్ర కెరటాల్లా ఉప్పొంగిపోయే యౌవనాన్నీ, వాంఛలనీ చంపుకుని గాలికి తేలిపోయే చిరుకాగితంముక్కలాంటి మీ జీవితం, మీ ఏకాంత మనోవేదన నాకు బాగా తెలుసు. మనస్సులో మండే మహాగ్నిని చల్లార్చుకోవడానికి మీరు అనుసరించే విపరీత ధోరణి జీవితంలో మీకు స్థాయినీ, సుఖాన్నీ కలిగించలేదు. మీరీస్థితిలోనే కొన్నాళ్లుంటే, ప్రపంచాన్నీ ముఖ్యంగా స్త్రీజాతినీ సంపూర్ణంగా ద్వేషించి, విలువను కోలుపోయే దశ వస్తుందేమోనని అనుమానం. మీ బ్రతుకులో ఒక అలంకారిక ఘట్టాన్ని మెరుగునూ సృష్టించి, స్థాణుత్వాన్నుంచి, చలనదశలో మిమ్మల్ని ప్రవేశపెట్టగలననే ధైర్యంతో జాలిగా, సానుభూతితో మిమ్మల్ని అర్థంచేసుకుంటున్నాను. ఎందుకు మీకీ ఏకాంతవాసం? ఏదేవుడు విధించిన శిక్ష యిది? ప్రపంచాన్ని అనుభవించడానికి తాపత్రయ పడాలి. ప్రపంచం మనల్ని అనుభవించమని తనకుతానై కోరి పాదాలముందు వాలడానికి నిరీక్షించడం అంత తేలికకాదు....క్షమించండి....మిమ్మల్ని నేను పూర్తిగా అభిమానిస్తాను. ఏకాంతంగా మీతో మాట్లాడి కొన్ని విషయాలు తెలుసుకోవా లనుకుంటున్నాను. సాయంత్రం ఆరుగంటలకి; సరిగ్గా ఆరు గంటలకి మా యింటికి రండి. తగిన వాతావరణం కల్పించబడి వుంటుంది—మీ జానకి."

ఇంత నిర్భయంగా తమ అభిప్రాయాలని వ్యక్తీకరించే అవివాహితలు, కన్యాత్వం వీడని కామినులు చాలా అరుదుగా కనిపిస్తారు. సాధారణ స్త్రీలకన్నా చదువుకున్న ఆడాళ్ళల్లో ఇంకో ముఖ్యవిశేషం వుంది. మామూలు స్త్రీలు తమకేర్పడే విపరీత భావాలను జగత్తుకు వెరచి అణచు

కుంటారు. విజ్ఞానవతులు, మంచైనా చెడైనా ఓవాంఛ, ఒక అభిప్రాయం ఏర్పరచుకున్నారంటే, ఎంతో అఘాతం పొందందే బలాన్ని కోల్పోరు. అలానే అయింది జానకి పని. ఆవిడ పందొమ్మిదేళ్ళ కన్య. కాలేజీ ఆవరణలో బోధింపబడే విద్యానామకవిషయంతో ఆర్జించుకుని, పెంపొందించుకుంటూ వస్తున్న విజ్ఞానం ఆవిడ కీపని సబబైందేనని నచ్చజెప్పి వుండవచ్చు. అయినా విశ్వేశ్వరరావుని గురించి, ఈ యిరవైనాల్గేళ్ల ఘోటక బ్రహ్మచారినిగురించి, ఈ వర్ధమాన మానవ మాత్రుని గురించి ఆవిడ లోలోపల ఇంకా ఎన్ని అభిప్రాయా లేర్పరచుకొనివుందో కాని, ఇవాళ, ఈ విధంగా, అవి విజృంభించి, కట్టలు తెంచుకొని, విశ్వేశ్వరరావును ముంచెత్తినవి. కొందరి మనస్తత్వాలు అర్థంకాని దశలో వుంటాయని ఊహిస్తున్నాడతను.

జానకి రూపాన్నీ యౌవనప్రాంగణంలో అడుగెడుతూన్న ఆవిడ పరిపుష్టశోభనీ ఒక్కసారి మనసులో ఊహించుకునేసరికి విశ్వేశ్వరరావులో ఏదో విద్యుత్ప్రవాహం పొంగింది.... ఇన్నాళ్లనుంచీ అతనికి తెలియకుండానే అతనిలో అణిగివున్న వాంఛలు తాచుపాముల్లా పడగలు విప్పినై. సహించలేని ఆవేదనతోపాటు మానసిక పరిస్థితికూడా మారిపోచ్చింది. జానకిలో ఇన్నాళ్ళూ కనిపించని ఏదో ఊహాకందని ప్రకృతిని ఇవాళ అతనూహిస్తున్నాడు. ఇందాకటిదాక అతను తన ముందు పరచుకున్న జానకి సౌందర్యపు వలలో, భావపాదాన్ని వుంచలేదు. కాని ఇప్పుడవి పూర్తిగా ఆ వలలో తగులుకోవడంతో విశ్వేశ్వరరావుకి ఆలోచనాశక్తి నశించిపోయింది. క్షణంలో ముఖకవళికలు మారిపోయాయి. పోకేంజేస్తాయి? విశ్వేశ్వరరావూ సామాన్య మానవుడేకాని భీష్ముడూ, ఆంజనేయుడూ కాడు. కనీసం దండకారణ్యంలోవున్న శ్రీరాముడూ కాడు. ఇక ఎందుకు మారకు? వున్న అవకాశాన్ని సద్వినియోగ పరచుకుని జీవితంలో ఏనాడూ పొందని అమరసుఖాన్ని పొందడానికి ఎవడు

వెనుదీస్తాడు? తను చేయబోయే పని 'మిత్రద్రోహం' అనిగానీ, తన స్వార్థానికి ఓ యువతిశీలాన్ని, బలిచేయబోతూన్నానని గానీ అతడూహించ లేకపోయాడు. ఒకోసారి ఒకోమనిషిలో అంకురించిన సాహసాన్ని తరతరాలనాటి ఆత్మ సంస్కారంకూడా అడ్డుకోలేదు.

విశ్వేశ్వరరావు నిశ్చయించుకున్నాడు. "స్వయంగా ఆవిడ అర్థిస్తోంది. ఆవిడేమో తెలివి తక్కువదీ, లోకజ్ఞానం లేనిదీ కాదు. అలాంటప్పుడు తన కర్తృత్వంగాని, తన కంటబోయే పాపంగాని ఇందులో యేమీలేదు. పాపం, ద్రోహం అని విచారించి, అత్యంతసౌఖ్యప్రదమైన అవకాశాన్ని జారవిడుచుకోవడం అవివేకం." నిశ్చయం జరిగాక క్షణంనిలబడ లేకపోయాడు. హోటలు బిల్లు చెల్లించి, జానకి ఉత్తరాన్ని అతిభద్రంగా జేబులో మడిచిపెట్టుకుని తిన్నగా బయల్దేరాడు.

సరిగా సాయంత్రం ఆరు గంటలయ్యేసరికి విశ్వేశ్వరరావు జానకి యింటి గేటు ముందుకు చేరుకున్నాడు. ఈ లోపల అతనిలో ఎన్ని లక్షల ఊహలు దండలుదండలుగా పెనవైచుకున్నవో, ఎన్ని లక్షలసార్లు అతని గుండెలు స్పందించాయో లెక్కలేదు. గేటు తెరచుకుని చిన్నగా వరండాలోకి అడుగెట్టాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. విశ్వేశ్వరావు గుండెలు టక్కుటక్కు మంటూన్నై. ఏకాంతం కల్పిస్తానని జానకి అన్నమాటల్లో అర్థంయేమిటి? అంతా యెటన్నా వెళ్ళారా? ఏదీ తోచడంలేదు అతనికి. ఇంతలో లోపల నుంచి యెవరో వస్తూన్న అడుగుల చప్పుడయింది. బహుశా జానకే వస్తూండవచ్చు ననుకుని, ఆవిడతో ఎలా మాటాడాలా అని ఆలోచిస్తున్నాడు,

ఓరవాకిలిగావున్న తలుపు తెరచుకుంది. విశ్వేశ్వరావు గుండెల్లో జలపాతం దూకినంత పనయింది. ఒక్కసారి తడబడిపోయాడు. "అరే!

జానకి కాదు. సరళ" అతని నరాలు ఒక్కసారి వణుకుతో కుంచించుక పోయినై.

"ఓ! మీరా? అలా కంగారుపడతారేం? కూర్చోండి." అంది సరళ చిరునవ్వుతో. విశ్వేశ్వరరావు కింకా కంగా రెక్కువయింది. ఏదో బాధ పడుతూ, దాన్ని బయటికి రానీయకుండా వుండాలని ప్రయత్నిస్తూ, "ఎబ్బెబ్బే! కంగారెందుకు? ఊరికే అలా చూసిపోదామని వచ్చాను" అన్నాడు నాటకంలో అభినయిస్తున్న వాడిలా.

సరళ యీమారు నవ్వకుండా వుండలేకపోయింది. "కృతజ్ఞురాల్ని. అలా కూర్చోండి, ఇప్పుడే టీ పట్టుకొస్తాను" అంటూ నవ్వుతూనే లోపలికెళ్ళింది.

విశ్వేశ్వరరావుకి కొంచెం గాభరా వేసింది. జానకి అసలుందాలేదా? మధ్య యీవిడ తారసపడిందేమిటి? ఇంకేమన్నా అనుకోదు గదా? బుజాలు తడుముకుంటున్నాడు. ఈ సత్కారాని కర్థం యేవిటో?

టీతో సహా సరళ ప్రత్యక్షమయింది: విశ్వేశ్వరరావు ఓ కుర్చీ లాక్కొని, తనుకూర్చుని. టీ కలిపి అతనికందిస్తూ అంది; "కులాసా? అలావున్నారేం ఇవాళ?"

"ఏం? బాగానే వున్నాను. కాని ఈ అసమయంలో టీ ఎందుకు చెప్పండి" అన్నాడు.

"మంచి టీ దొరికిందంటే వీడా ప్రాంతాన్నిక వదలడనీ, వీడికిదో దురభ్యాసమనీ మా రాజా మిమ్మల్ని గురించి చెబుతూండేవాడు. టీ లేందే మీకు మెదడు పనిచేయలేదనికూడా అంటాడు. మీరేమో సమయాసమయాలు అంటూ బుకాయిస్తున్నారు" అంది సరళ చాలా సరదాగా.

విశ్వేశ్వరరావుకి ఆశ్చర్యం వేసింది. సరళ తనతో ఎన్నడూ యింత ఫ్రీగా మాట్లాళ్లేదు. ఇవాళ ఏదో కారణం వుండకపోదు. అతని కింకో

భారంకూడా తోచింది. కొంపతీసి జానకిపేరుతో యీవిడకాదు కదా ఉత్తరం రాసింది? అనుకొని భయపడ్డాడు.

నెమ్మదిగా టీ అందుకొని ఒక్క నిమిషంలో ఖాళీ కప్పుని కింద వుంచాడు. జేబులో చేయిపెట్టి ఎందుకో ఆగిపోయాడు- గతుక్కుమని— సరళ నవ్వుతూ.

"ఉఁ! అభ్యంతరంలేదు-బయటికి తీయండి!" అంది.

విశ్వేశ్వరరావు వళ్లు జలదరించింది. "ఏవిటీ?" అన్నాడు.

"సిగరెట్లూ అగ్గిపెట్టేనూ. టీ త్రాగి ఒక్క సిగరెట్ వెలిగించారంటే ప్రపంచం మీరు చెప్పినట్టు వింటుందనీ—లేదూ ప్రపంచం చెప్పినట్టు మీరు లోబడతారనీ మీనోటంటే ఓ శుభోదయాన వినడం జరిగింది. కాల్చండి పరవాలేదు."

చకితుడైపోయి వద్దనుకుంటూనే సిగరెట్టు వెలిగించాడు విశ్వేశ్వరరావు. సరళలో వచ్చిన యీ మార్పుకి అర్థం కనిపెట్టలేక బుర్ర బద్దలవుతోంది. సరళ తన కుర్చీని కొంచెం వెనక్కి జరుపుతూ "ఏమో బ్రహ్మాండంగా ఆలోచిస్తున్నారే?" అంది. విశ్వేశ్వరావు ఉలిక్కిపడి "ఎబ్బెబ్బె! ఏంలేదు" అన్నాడు.

"మనస్సు ఏదో వైజ్ఞానిక పరిశోధన చేస్తోందనుకుంటాను" అంది సరళ సంభాషణపెంచే ధోరణిలో.

"పరిశోధనాలేదు పాడూలేదు. ఈ రోజుల్లో పరిశోధనలకి విలువ ఎక్కడేడిసింది కాలేజీ ఆవరణల్లోతప్ప?" అన్నాడు విశ్వేశ్వరరావు.

"ఐతే యిప్పుడు నేర్చుకునే యీ విద్యలన్నీ కాలేజీ దాటితే ఎందుకూ అక్కరకురావనా మీ అభిప్రాయం?"

"ఎందుకూ? నిత్యజీవితగమనంలో తోడుపడని విద్యలూ, పరిశోధనలూ, కేవలం అలంకారప్రాయంగా తగిలించుకోవడానికే పని

కొస్తాయిగాని లోకానుభవం సంపాదించిపెట్టలేవు" అన్నాడు సీరియస్‌గా విశ్వేశ్వరరావు.

"ఈ అభిప్రాయం అందరికీ వర్తిస్తుందా?" పట్టుదలగా అడిగింది సరళ. "అంటే?"

"ఈనాటి విద్యావిధానంలో కొట్టుకునిపోయే స్త్రీలూ, పురుషులూ నని నా అభిప్రాయం."

"ఓ! స్త్రీలైతేం, పురుషులైతేం? విద్యావిధానంలోనే లోటున్నప్పుడు అంతా సమాన విజ్ఞానంతోనే వుంటారు. హృదయం వికసింపజేసి, లోకాన్ని పూర్తిగా అర్థం చేసుకునే తెలివిని వ్యక్తిలో సృష్టింప జేయలేదు ఈ విధానం" అంటూ చవురించాడు విశ్వేశ్వరరావు.

"ఇంకావున్న లోపాలేవిటో విశదీకరించండి" సావధానంగా, అంది సరళ.

"ఎన్నిలోపాలున్నా మీరు గమనించాల్సిన విషయం ఇంకోటుంది ముఖ్యమైంది. ఇందులోనే పెరిగి బ్రహ్మాండాన్ని చిటికెనవేల్తో తిప్పగల మేధావులూ వున్నారు సుమండీ!"

"అందుక్కారణం ఏవిటంటారు?"

"కాలేజీలో ఆర్జించిన కాస్తో కూస్తో విజ్ఞానాన్ని పెడదారి బట్టనీయకుండా, వాస్తవిక జీవితరంగంలో ఎదుర్కొంటున్న సమస్యల అనుభవాన్ని దానికి జతచేసుకుని జీవితాన్ని సమన్వయ పద్ధతిలో నడిపే వాళ్ళంతా పైకొస్తారు. ప్రస్తుతం వాతావరణంలో పెరిగిపోతూన్న నీచాభిరుచుల్ని ప్రోత్సహిస్తూ, వాటికింకా బలాన్ని చేకూర్చే యీ లోకంలో, పరిసరాలకి లోబడకుండా జీవించడం దుర్లభం. ఎన్ని డిగ్రీలు సంపాదించినా మనిషి సహజమైన లోకానుభవాన్ని గడించలేడు. కృత్రిమం పెరిగిపోయి, సాధ్యాసాధ్యాలూ, ఆచరణ అనాచరణలూ గ్రహించకుండా మనుషులు కేవలం అభిరుచులకే దాసులవుతారు. అవుతూన్నారుకూడా."

"ఇంతకీ మీరనేది మనిషిలో స్వతహాగా బలహీనత వున్నప్పుడు ఎంత చదువున్నా లాభం లేదని. అంతేగా?''

"అవును."

"మరి దానికింత ఉపన్యాసం ఎందుకూ ప్రత్యక్షంగాకనిపిస్తుంటేనే."

"ఏమిటి కనిపించేది?" విశ్వేశ్వరరావు మళ్లా ఉలిక్కిపడ్డాడు. ఏదో తీవ్రాలోచనతో మనస్సు సతమతమవుతూంది. రెండుమూడు నిమిషాల పాటు నిశ్శబ్దం.

"ఏదో ఆలోచిస్తున్నారు. జానకిని గురించా? అది యిందాకే అమ్మనుతీసుకుని సినిమాకెళ్ళిందిలెండి" అంది సరళ అతన్ని పరీక్షిస్తూ,

"జానకిని గురించా? ఎబ్బే....లేదే....ఏదో మనస్సు బావుండ లేదు" అన్నాడు తత్తరపాటుతో.

"మీరు బలేచక్కగా అతకని అబద్ధాలాడతారుకదూ?" అంది సరళ నవ్వుతూనే.

"నేనెందుకాడాలి అబద్ధం? నాకేం భయం?" అన్నాడు విశ్వేశ్వర రావు కుర్రాడిలా.

"పాపం! మీరు సరిగ్గా సమయానికే వచ్చారుగాని, పాపిష్టిదాన్ని నేనే కొంచెం యింట్లో పనుండి వుండిపోయి, జానకిని అమ్మకుతోడుగా పంపాను సినిమాకి. అది నన్నెంత దూషించుకుంటోందో మనస్సులో" విచారంగా అంది సరళ.

"మీరంతా యివాళేదో కొత్తగా, వింతగా మాట్లాడేస్తున్నారు" అన్నాడు విశ్వేశ్వరరావు ఆశ్చర్యంగాచూస్తూ,

"రోజూ జరిగేదానికి కొత్తేముంది? రోజూ నేనిలానేమాట్లాడేస్తానే."

విశ్వేశ్వరరావుకి ఏం జవాబు చెప్పాలో అర్థం కావడం లేదు. ఎందుకోవస్తే, ఏదో అయిందన్నట్టయిందాతని పని. వాతావరణం అతనికి కల్మషపూరితంగా కనపడింది.

“[illegible]మీ మాటలు నాకేమీ అర్థం అవడం లేదు” అన్నాడు.

“అష[illegible] అర్థంకావు. మనస్సులో, అట్టడుగునవున్నమాట, పైకంటే అర్థ[illegible]కాదు. కప్పిపుచ్చుకుని, కృత్రిమంగా మాట్లాడితే అందరికీ అర్థమవు[illegible]యి. అలా మాట్లాడేవాళ్ళే ఆభిజాత్యసంపన్నులుగా చలామణీ అవుతారు. కళ్ళల్లో పాపల్ని తీయగలుగుతారు” సరళ కొంచెం ఉద్రేకంగా అంది.

విశ్వేశ్వరరావు గుండెలు వేగంగా కొట్టుకుంటున్నై. అసలు సరళ దేన్నిగురించి మాట్లాడుతోందో తెలీడం లేదు. “అవును” అన్నాడు అప్రయత్నంగా.

“ఏవిటి అవును? మీరు అవునని ముద్రవేయకపోయినా అది అయేతీరుతుంది.”

బుర్ర బద్దలుకొట్టుకున్నా విశ్వేశ్వరరావు కిది అర్థంకావడంలేదు.

“క్షమించండి! మీరు మనసులో ఏదో వుంచుకుని మాటాడుతున్నట్టుంది. కొంచెం వివరించి చెబితే తెలుసుకుంటాను” అన్నాడు వినయంగా.

“ప్చ...ఇంకా వివరం కావాలీ? అర్థం కాలేదూ? మిమ్మల్ని అనేంలాభం? మిమ్మల్ని తయారుచేసిన విద్యావిధానాన్నీ, వాతావరణాన్నీ అనాలి” అంది నిట్టూరుస్తూ.

ఆ కొంచెం నిశ్శబ్దంలో విశ్వేశ్వరరావు ఘోరనరకాన్ని చూశాడు. సరళ యీమారు కొంచెం కటువుగా “జానకికి మీరు ఎంతకాలంనుంచీ వుత్తరాలు రాస్తున్నారో కొంచెం సెలవీయండి” అంది.

విశ్వేశ్వరరావు ప్రాణాలు అటకెక్కిపోతున్నై. “నేనా?.... క్షమించండి! జానకికి వుత్తరాలు రాసేంత అవసరం నాక్కలగలేదు. ఇకముందు కలగదు. మీరు చాలా పొరపాటు పడుతున్నారు. ఏదో ఊహించుకుంటున్నారు” అన్నాడు చిక్కబట్టుకుని.

"అవును. కనిపెట్టి వుండకపోవడం పొరపాటే, కాని, నిజం చెప్పండి : మీరు వుత్తరంరాసే అవసరం కలగలేదంటే మీభావం ?"

"ఇందులో భావానికేముంది తావు ?"

"ఏమీలేదా ? చూడండి : కొందరిని విశ్వాసపాత్రులుగా నమ్మి మోసపోతాం. వాళ్ల హృదయాలు పైకిచాలా పరిశుభ్రంగా వుంటాయి. లోపలంతా కల్మషం....మంది బలహీనతను సాకుగా తీసుకుని ఆనందం పొందాలనే స్వార్థం....స్వార్థంకోసం ద్రోహం....ద్రోహంలో ఆనందం,. విశ్వాసంలో కల్లోలం....ప్రతిఫలం జీవితాల్లో నరకం" సరళ ఉద్రేకంగా చెప్పుకుపోతోం దేవిటో....విశ్వేశ్వరరావు కీమారు ముఖం నిజంగా తెల్లబడింది. తననిగానీ, జానకినిగానీ సరళకనిపెట్టిందనేభయం ఆక్రమించుకుని అతను కలవరపడుతున్నాడు.

"మీ మాటల అంతరార్థం బోధపడ్డం లేదు నాకు" అన్నాడు.

"బోధపడే విజ్ఞానాన్ని మీకు మీ విద్య ప్రసాదిస్తేగద ? ఇందాకటి నుంచీ మీరిచ్చిన ఉపన్యాసం మీకే వర్తిస్తుంది అక్షరాలా."

"నేనేంచేశానంటారిప్పుడు?" అన్నాడు విశ్వేశ్వరరావు చిరాకుగా.

ఏమిటా? ఎదుటివాళ్ళబలహీనతని వాతావరణానికి గురిచేసి మీఅవసరాలు తీర్చుకోవాలని ప్రయత్నం చేస్తున్నారు. లోకానుభవంలేనివాళ్ళని, అనుభవం నేర్పిన నీచాభిరుచులతో లోబరచుకోవడంచేశారు. బాధ్యతలూ నియమాలూ గమనించకుండా ఆకాశాన్నందుకున్న దాని ముఖాన శాశ్వతంగా చీకటి పూయాలని వాంఛిస్తున్నారు. జానకి జీవితాన్నీ భవిష్యత్తునీ ధ్వంసం చేయాలని వచ్చారు, కాదూ ?" సరళకళ్లు నిప్పుల్లా మెరుస్తున్నై.

విశ్వేశ్వరరావు వూపిరి ఏదో చెట్టుకొమ్మకి తగులుకున్నట్టయింది. అయినప్పటికీ మగాడుగాబట్టి విపరీతప్రయత్నంతో సర్దుకుని, గొంతు సవరించుకున్నాడు.

"మీరు మోపుతూన్న యీనేరం నాకు తెలియందీ, నే చేయందీను."

"ఋజువు కావాలంటారా యీ ప్రత్యక్షచర్యకి ?" గంభీరంగా అంది సరళ.

"కావాలని నేననను; కాని చూపిస్తే నమ్మకుండా వుండను." అన్నాడు తాపీగా.

"ఇవాళమధ్యాహ్నం నౌకరి కుర్రాడిద్వారా జానకి మీకు పంపిన వుత్తరం ఏమిటో నాకు తెలీదనుకున్నారా ? మీరిద్దరూ నన్ను మోసం చేయగలుగుదురేమో గాని, వాడు మోసం చేయడానికి సాహసించడు. వాడీవిద్య నేర్చుకోలేదింకా, అడగ్గానే ఇచ్చేశాడు. జానకిలో కలుగుతున్న యీ విపరీత పరిణామాలని కొన్నాళ్లనుంచీ గ్రహిస్తున్న నేను, ఇవాళే ఈ నాటకంలో అంతిమఘట్టం అయిపోవాలని పట్టుదలతో జానకిని సినిమాకుపంపి, తమతో యీ విషయం మాట్లాడుదామని నిరీక్షిస్తున్నాను."

అంతభయంలోనూ ఈమాట వినగానే విశ్వేశ్వరరావుకి చికాకెత్తింది...."ఎదటివాళ్ల వుత్తరాల్ని అలా పరీక్షించడం విజ్ఞానవంతుల లక్షణమే ననుకుంటారా ?" అన్నాడు.

"కాదు - కాని, నమ్మి స్నేహంచేసే ప్రాణమిత్రుడి చెల్లెల్ని, బలహీనతలు సాకుగా ద్రోహం చేయబోవడంమాత్రం విజ్ఞానమూర్తులలక్షణం అవునా ?" అంది.

కొరడా దెబ్బలాంటి ఆ మాటకి విశ్వేశ్వరరావు సగం చచ్చిపోయాడు. ఏ కొంచెమో మిగిలిపోయిన పౌరుషం అప్పుడే మేల్కొంటున్నది. సరళ ఎక్సురేకళ్లు అతని ప్రతిభావాన్ని లాగేస్తున్నట్టనిపించింది.

"నేను జానకికి అన్యాయం చేయడానికే వచ్చానో, మందలించడానికే వచ్చానో మీరు తెలుసుకోకుండానే దూషించడం మంచిదికాదు" అన్నాడు.

"ఇందాకటినుంచీ మీరు చేసే వ్యర్థప్రయత్నాలు అందుకు తోడు పడవు. సరిగ్గా యిదేవేళకి రావడం అవసరం లేదు. అలా మందలించే సద్బుద్ధి మీలో వుంటే ఎప్పుడో ఒకమారు సమయంచూసి బోధించేవాళ్లు. అయినా మీరీమాట హృదయపూర్వకంగా చెప్పండి. 'దైవసాక్షిగా నేను జానకిని మందలించడానికే వచ్చాను' అని అనేయండి. నే నీక్షణంలో మిమ్మల్ని క్షమాపణ వేడుకుని నా తప్పుకి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను" అంది సరళ ఆవేదనతో.

విశ్వేశ్వరరావులో ఇంకా మానవత్వం ఉంది. అతను కేవలం పశువు కాలేకపోయాడు! ఈమారు పూర్తిగాతను ఓడిపోయాననుకున్నాడు. దీనంగా ముఖంపెట్టి "క్షమించండి. ఇక మీతో నేను అబద్ధమాడదల్చుకో లేదు. నా సంగతి అలావుంచి ఆలోచించండి. ఇందులో జానకిమీద ఆరో పించగల నేరమేమీ లేదా? కర్తృత్వమంతా నాదేనా?" అన్నాడు.

"జానకి పసిపిల్ల. ఏళ్ళొచ్చాయి. చదువుకున్నది. కాని, ఇందాక మీరన్నట్లు అ చదువు దాన్ని పరిసర వాతావరణ ప్రభావంనుంచి తప్పించి లోకానుభవం యివ్వలేకపోయింది. మనస్తత్వాలను విశదీకరించలేక పోయింది. బాధ్యతగల మీరు, మా కుటుంబానికి స్నేహితులైన మీరు, నిజాన్ని గమనించి జానకిని సరిదిద్దవలసి వున్నప్పటికీ ఇలా దయచేశారు కాబట్టే మీ రెక్కువ పాలు అనుభవించాలి. జానకి స్వతహాగా బలహీను రాలు." సరళ చాలా సాఫీగా వుంది.

విశ్వేశ్వరరావుకి మళ్ళీ ముంచుకొచ్చేంత ఆలోచన వచ్చేసింది. రెండు నిముషాలకాలం స్థంభించిపోయాడు. అతని కళ్ళవెంట జలజల నీళ్లు ప్రవహించ నారంభించాయి. రెండుచేతులూ జోడించి "క్షమించండి. పొరపాటు జరిగింది. ఈ విషయం రాజాకి తెలిస్తే విపరీతమైన బాధ పడతాడు. జరిగిందాన్ని విస్మరించాలని నా ప్రార్థన" అన్నాడు. సరళ కొంచెం పశ్చాత్తాపస్వరంతో, "విశ్వేశ్వరబాబూ! మీరు పసిపిల్లలూ

సుమండీ! హిప్నటైజ్ చేయబడ్డ వ్యక్తిలా ఇలా మీతప్పును మీరుఒప్పు కునేటంత బలహీనులనీ. విశాల హృదయం వున్నదనీ నేను భావించ లేదు. వజ్రంకాని మీ మనస్సుకీ, మీస్నేహపు విలువలకీ నా కృతజ్ఞతలు. చూడండి! జానకి ప్రపంజ్ఞానంలేని అవివాహిత. దాని భవిష్య జీవితానికీ సంబంధించిన ఆలోచనా, బాధ్యతా నన్నిలా చేయమని ప్రబోధించాయి ఇవాళే ఈ విషయం అరికట్టకుంటే ముందు ముందు ఇది గౌరవ ప్రతి ష్టలు కలచివేసే సమస్య కావచ్చు....దీన్ని మీరు నా స్వార్థమనుకోండి. ఇంకేదయినా అనుకోండి. కాని, నన్ను క్షమిస్తారని కోరుతూన్నాను".

"అలా కోరవలసింది నేను, మీరు కాదు" అంటూ కుర్చీలోంచి లేచాడు విశ్వేశ్వరరావు. గట్టిగా ఒక నిట్టూర్పు విడిచి, "నమస్తే!" అంటూ తలవంచుకొని బయటపడ్డాడు. ఈ విచిత్రవ్యక్తిత్వాన్ని గురించి సరళ కూడా ఎందుకో నిట్టూర్చకుండా వుండలేకపోయింది.

ఇందాక వెళ్లేప్పుడూ విశ్వేశ్వరరావు హృదయం స్పందించింది. ఇప్పుడూ స్పందిస్తూనే వుంది. ఇందాకటిలా బుర్ర వేడెక్కి వుంది. ఇందాక ఎలా అదృశ్యశక్తి మెడపెట్టి జానకి యింటికి గెంటిందో, అంతకంటే బలమైన శక్తి ఇప్పు డతనిలో పనిచేస్తోంది. "ప్రపంచాను భవంలేని శుష్కభావుకతకీ, జీవితాచరణకీ యెంత తేడా వుంటుందో జానకినీ సరళనీ చూస్తే తెలుస్తుందు" అనుకుంటున్నాడు విశ్వేశ్వరరావు. అతని మనస్సు పూర్తిగా అలసిపోయింది. ఆరు నెలలు జైలు చీకటి కొట్లో వుండి సుప్రభాత సూర్యోదయాన్ని చూస్తూన్న ఖయిదీ కళ్ళలా అతనికళ్లు మూతలుపడుతున్నాయి. మనస్సు విశ్రాంతిని కోరుతోంది. ఎక్కడా తనకు విశ్రాంతి? ఎటు తను వెళ్లతూంట? ఏదీతోచనిస్థితిలో విశ్వేశ్వరరావు దగ్గరనే వున్న హోటల్లో ప్రవేశించి, ఓ మూలనకుర్చీలో అతుక్కుపోయాడు.



# దేశోద్ధారక గ్రంథమాల

ఆంధ్ర సోదరులకు అవసర గ్రంథముల నందించు ఆశయముతో బహుధాన్య (౧౯౩౮) సంవత్సరంలో కీ.శే. దేశోద్ధారక, విశ్వదాత, కళా ప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా స్థాపింపబడిన ఈ గ్రంథమాలద్వారా లోగా ౧౨ ప్రచురణములు దేశీయుల కందజేసినాము. ఆ రోజుల్లో విజ్ఞానము నిచ్చి, స్వాభిమానమును పురి కొల్పి, సత్వర కర్తవ్యమును తెలుపు గ్రంథములను ప్రచురించి దేశభక్తుల యొక్కయు, మేధావంతులయొక్కయు మన్ననలను పొందినాము. పిమ్మట మొత్తము భారతదేశముతోపాటు హైద్రాబాదులో యేర్పడిన రాజకీయ అసాధారణ పరిస్థితులలో గ్రంథమాల ౧౯౪౨ లో ఆగిపోయింది. ౧౦ సంవత్సరముల తర్వాత కొంత స్థిమితము కలిగి, తిరిగి గ్రంథ ప్రచురణకు పూనుకొను అవకాశము కలిగింది. గ్రంథమాల స్థాపన కాలములో మాముందుండిన కర్తవ్యము నేటివరకు తీరలేదని భావిస్తున్నాము.

'మనిషి యే పంథా నవలంబించవలయునో అని ఆలోచించుటకు ముందు వివిధ పంథాలను తెలిసికొనుట ముఖ్యము'. కాబట్టి మేము ప్రచురించు ప్రతి గ్రంథము దేశీయుల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను దృష్టియందుంచుకొని, కర్తవ్యములను సూచించునదిగా నుండును.

ఇట్టి మా కృషికి చేయూతనిచ్చి మా ఆశయ సఫలతకు దేశీయులు మమ్ము ప్రోత్సహించెదరని విశ్వసిస్తూ, విజ్ఞులగువారి సర్వసహాయాలపై మాత్రమే ఈ మా వ్యవస్థను నిర్వహించ గలుగుదుమని విన్నవిస్తున్నాము.

పది రూపాయలకు తక్కువకాని విరాళమును మీ నుండి అభ్యర్థిస్తున్నాము. రూపాయకు రెండు అణాల హెచ్చింపు ప్రకారం మీకు గ్రంథాలు క్రమంగా అందించెదము.

3–5–1027
నారాయణగూడ
హైదరాబాదు

ఇట్లు విన్నవించు
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు

# ప్రశంసలు

"ఈ గ్రంథమాలరూపమున తమరు చేయుచున్న ఆంధ్రభాషా సేవ ప్రశంసనీయమై యున్నది."

—ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు

"ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి శ్రమించునట్టి వీరి గ్రంథమాలను అందరూ ఆదరించి తమ విధిని నెరవేర్చ వలసియుండును".

—కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి

"దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించి ఆంధ్రదేశమునకు గొప్ప భాషాసేవ చేసిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారిని చిరస్మరణీయులుగా చేసియున్నారు".

—శ్రీ కొండా వెంకట రంగారెడ్డి

"దేశీయులందరు గ్రంథమాలయొక్క ప్రచురణములను పొంది ఈ కార్యమును జయప్రదముగ నిర్వహించుటలో సహాయపడుదురని ఆశించుచున్నాను."

—శ్రీ మందుముల రామచంద్రరావు

"ప్రతి పుస్తకము ఆకర్షవంతముగను, ఉపయోగకరముగను ఉన్నది.... మీ గ్రంథమాల ఆంధ్రదేశమున కమూల్యమగు సేవచేయు చున్న దనుటలో నెట్టి యతిశయోక్తిలేదు."

—శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

"ప్రజలకు వినోదం కలిగించడంవల్ల గ్రంథమాలను అభివృద్ధి చేసుకొనే దృషి ప్రకాశకులకు లేదు. 'ప్రజలకు ఈ దినాలలో అత్యావశ్యక మయిన విజ్ఞానం కలిగించాలి' అన్న దృఢ సంకల్పం ప్రతి ప్రచురణము నందు ప్రస్ఫుటంగా కనబడుతూ ఉంది."

—కాగడా 10-2-1940

# లోగా ప్రచురించినవి

1. హైందవ ధర్మవీరులు (హైందవధర్మ పోలీలు)
—కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు
2. ప్రాథమిక స్వత్వములు
—కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు
3. 4. కమాల్‌పాషా జీవితము (రెండు భాగములు)
—శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరము
5. బొంధు సంస్థానము
—శ్రీ పులిగడ్డ వెంకటసుబ్బారావు
6. ప్రజలు - ప్రభుత్వము
—శ్రీ కౌంట్ లియో టాల్‌స్టాయ్
7. గ్రంథాలయోద్యమము
—కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు
8. కాంగ్రెసు - సంస్థానాలు
—శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యా
9. సంస్థాన సమస్యలు
—శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యా
10. 'నా భారతదేశ యాత్ర'
—హెచ్. ఎన్. బ్రెయిల్స్‌ఫర్డ్
11. 12. గాంధీ మహాత్ముడు (రెండు భాగములు)
—'విష్ణుచక్రం'

# 13. జైలులోపల (కథానికలు)

రచయిత : శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

వెల : ఇతరులకు 0-10-0  సభ్యులకు 0-9-3

"కొత్తజాతికథలు మీరు తెలుగులో సృష్టిస్తున్నారు........కథలు హృదయవిదారకంగా ఉన్నవి. పడమటి దేశాల్లో ఇట్టి వాఙ్మయసృష్టి సంస్కారణాలకి దారితీసేది. మన దేశంలో ఆలనా పాలనా లేదు."

— శ్రీ చింతా దీక్షితులు

"ఇలాంటి కథావస్తువులు యింతవరకు యెవరూ తీసుకోలేదనే నా అభిప్రాయం. ఈ వస్తునిర్ణయంలోనే మీరు నవ్యమార్గం అనుసరించి, సామాజికంగా చచ్చినవాండ్లతో సమానమని నిర్ణయించబడ్డ ఖైదీల జీవితాలు ఈ విషసమాజచరిత్రకు స్మృతిచిహ్నాలుగా పనికి వస్తాయని చక్కగా నిరూపించారు."

— శ్రీ ధరణికోట శ్రీనివాసులు

"జైలుసంస్కర్తలు గ్రహించాల్సిన విషయాలు బలంగా ప్రతిపాదించబడడం గమనార్హం. నేరస్తులు వస్తుతః నేరస్తులుకారు. వారు పరిస్థితులకు లొంగిపోయి నేరస్తులు కావించబడ్డారన్న అభిప్రాయం ప్రతి రచనా కలిగిస్తుంది."

— గోలకొండ పత్రిక

"........ఇవి ఉన్నసమస్యల వాస్తవికతను, మానవ స్వభావములను, పరిస్థితుల సత్యస్వరూపమును అతిసహజముగ హృదయంగమముగ తెలుపుచున్నవి, ఇవి రచయితకు గల సంస్కారమును, భావోద్వేగమును వెల్లడించుచున్నవి."

— సుజాత

"... ....దైనందిన జీవితంలో మనం చూచే సాధారణఘట్టాలనే కథగా తీసుకొని సాధారణం అనుకునేటట్టు గాక ఉత్తమంగా సృష్టించారు. ........ఆళ్వారుసామిగారు తమ జైలు జీవితానుభవంలోంచి కొన్ని అమూల్య విషయాలను ముచ్చటైన పుస్తకంద్వారా అందజేసినందులకు అభినందనీయులు."

— స్రవంతి

## 14. నా గొడవ (గేయాలు)

రచయిత: శ్రీ కాళోజీ నారాయణరావు

వెల: ఇతరులకు 1-8-0 సభ్యులకు 1-5-0

"కాళోజీ నిఖిలాంధ్రకవి.........ఆయన తన ఖండకావ్య సంపుటానికి 'నాగొడవ' అనిపేరు పెట్టారు....కాని ఇది విశాలజగత్తు ప్రజలందరి గొడవ. ఇది మనం మననం చేసుకోవాల్సిన పుస్తకం. యుద్ధంలో పాల్గొన్న కవులంతా చెల్లాచెదురుగా పారిపోతే లూయీ ఆరగాన్ ఒక్కడే దేశంలోనిలబడి మహావిశ్వాసాన్ని వెల్లడించే గీతాలు వ్రాశాడు. కాళోజీ లూయీ ఆరగాన్‌వంటివాడు."

—శ్రీ శ్రీ

"కాళోజీ కవిత్వం సమాజానికి హెచ్చరిక వంటిది....వేమనకూ ఈయనకూ రేఖామాత్రంగా వ్యత్యాసం ఉందేమో గాని అతను చెప్పడానికి వీలుగానివి కాళోజీ చెప్పంది తప్పలేదు. ఆడంబరంలేని, అలంకారాల ఆరభటిలేని నిసర్గమైన కృతి కాళోజీ కావ్య సంపుటి.........వ్యంగ్యాత్మక విమర్శాయుత హాసగీతికలు రచించి కాళోజీ కవితాజగత్తులో క్రొత్తవిప్లవాన్ని కలిగించాడు."

—శ్రీ దాశరథి

"ఈ కవి రచనలో అంతటా ఒక విశిష్టమైన ప్రత్యేక వ్యక్తిత్వం సుస్పష్టంగా కనిపిస్తున్నది....కాళోజీదారిపేరు. 'నాగొడవ' పఠిస్తున్నపుడు మనమొక్క విసూతనమైన అనుభూతి ప్రపంచములోకి వెళ్ళిపోతాము...., ఈయనలోగల సత్యాన్వేషణదృష్టి సంకుచితమైన రాజకీయ నినాదాలకు తాత్కాలికమైన అలజడులకు అతీతమైన కాలావధులనుదాటి నిసూక్తి

ధోరణిలో వినబడుతూంటుంది. నేటికాలపు కవితాపరిణతి అవగాహన చేసుకోదలచిన భావుకులందరు తప్పకుండా చదువ వలసిన ఖండకావ్య సంపుటి."

—భారతి

"........... ఈ సంపుటిలో ప్రతి గీతం ఒక పరమ సత్యం. ఆ "సత్యం"కల్పనా కథలకంటె చిత్రమైంది కాదూ ? తెలంగాణా ప్రజల కన్నీటిలో ఎన్నెన్నికలలు కలవో చూడతలచినవారికి కాళోజీగారి 'నాగొడవ' కనువిప్పు."

—కిన్నెర

# 15. ఉదయ ఘంటలు

( 56 అఖిలాంధ్రకవుల గేయసంపుటి )

వెల : ఇతరులకు 2-4-0 సభ్యులకు 1-15-6

"........ఈ సంకలనంలో ఇంతకు పూర్వం అజ్ఞాతంగా ఉండి పోయిన ఉత్తమ ఖండకృతులెన్నో సేకరించి ప్రకటించారు. పేరుపొందిన రచయితల రచనలలోనించికూడా ఈలాంటి కృతులే సేకరించడంవల్ల ఈ సంకలనానికీవిషయంలో ఒక ప్రత్యేకత వచ్చింది. ఇది ఆధునిక కవితాభిమాను లందరు తప్పకుండా పరిశీలింప వలసిన సంపుటి."

—ఆంధ్ర పత్రిక

"ఇప్పుడు ఆంధ్ర దేశంలో అనేక తరహాల కవిత్వం ఆవిర్భ విస్తున్నప్పటికీ అందులో ప్రధాన ప్రవాహం అభ్యుదయ సాహిత్యం. దీనికికారణం దినదిన ప్రవర్ధమానమౌతున్న సామాజిక చైతన్యమూ, ప్రజాజీవితమూ దీనిలో వెల్లివిరియడమే. ఇలాగ వెల్లివిరిసిన అఖిలాంధ్ర

కవులగీతికా సంపుటి "ఉదయఘంటలు." ........ అనేకకవుల చక్కని గీతాలు యిందులో ప్రచురితమైనాయి. ........సంపాదకుల, ప్రచురణ కర్తల కృషి కొనియాడతగింది."

—విశాలాంధ్ర

"........నవ్యకవిత్వోద్యమంలో పాల్గొన్న వారి రచనలను ఏర్చి కూర్చి. ........ఒక్క సంపుటిలో అందించినందుకు అభినందనీయులు. ....ఆధునిక ఆంధ్ర రచనావిధానంలో వచ్చిన మార్పుయొక్క సమగ్ర స్వరూపాన్ని తెలిసికోవాలంటే ఈ గ్రంథం చాలావరకు సహాయ పడుతుంది."

—బృందావని

"........సానలుతీరి పక్షపక్షాన రంగురంగుల రోచిస్సులు విర జిమ్మే మణిలా కలరవాలను కురిపిస్తూ, వంపువంపునా కర్పూరకాంతులీనే కపోత కంఠంలా, వివిధ సౌరభాలను, వెలార్చే కదంబ ప్రసూనమాలలా, రంగు, రుచి, వాసనల. సౌరుతీరులు గల అపురూపపు "ఉదయఘంటలు" నిదాదతరంగాలు అనవరతం మనశ్రవణ మనోమస్థిష్క ఫలకాలను తాకు తూనే వుంటాయనడం అత్యుక్తికాదు."

—ఆంధ్ర ప్రభ

"ఈ సంకలనంలో యావదాంధ్ర కవులు సమిష్టిగా ఏకముఖాన మనకు మేల్కొలుపు పాడుతున్నారు. ఇవి ఉదయ ఘంటలు ........ఇవి హృదయ ఘంటలు............మనకావ్య సాహిత్యంలోని విశిష్ఠభాగాలతో ఒక్క "తెలుగు ఎంథాలజీ" కూడా రాలేదని నిరుత్సాహపడుతున్న ఈనాడు కనీసం గేయసాహిత్యంలోని మచ్చు రచనలతోనైనా ఈసంపుటి వెలువడడం ఆంధ్ర సాహిత్యానికి ఒక అభ్యుదయమేనని దీనిని పరిశీలిం చిన వారు అంగీకరించుతారు."

—స్రవంతి

"........కేవలము జీవితోత్సాహమూ, సౌందర్య సందర్శనమూ మాత్రముగాక, పీడితసోదరబాధానుకంపనమూ, నిత్యనూతన చైతన్య కల్పిత చిత్రసృష్టి........"ఉదయ ఘంటలు" దారిలోనే మోగుతాయి. ........ఈ సంపుటము నిండా బ్రతికివున్న వ్యావహారికంలోనే తళుక్కుమన్నాయి భావాలు. ........భావవిప్లవానికి "ఉదయ ఘంటలు"లో ఆట విడుపు. "మాడుపొట్టతోడ నీవు గాడిద చాకిరి చేయగ తోకవూపి, మూతి నాకు తుచ్ఛులకే వైభవాలు."

—అనీ పుట్టకీట్లుకదిల్చే భావాలు "ఉదయఘంటలు"లో ఎన్నెన్నొకలవు."

—కిన్నెర

"ఈ ఆధునిక ఖండకావ్య సంపుటి పురోగమిస్తున్న నవ్యాంధ్ర సాహిత్య పోకడలను ప్రస్ఫుటింప జేస్తున్నది. ఇందులో........దేశీయ సాంఘిక సమస్యలు, ఆర్థికసమస్యా లోపాలు, ప్రపంచ క్లిష్టపరిస్థితులు, పీడితమానవ సంఘటనలును యితివృత్తముగాగలవి. ........చక్కని ముద్రణ, తయారీలతో ఆకర్షణీయంగా తయారైన యీ గ్రంథము ముద్దులు మూటగట్టుచు ఉత్సాహానందముల ప్రేరేపించుచున్నది."

—గృహలక్ష్మి

ఈ సంవత్సరం—చిరకాలంతర్వాత కవితా సంపుటాలు వచ్చాయి. అందులో ఉత్తమమైనది వేసినగౌరవం తెలంగాణావారికే దక్కింది. అఖిలాంధ్ర కవుల రచనలతో కూడిన "ఉదయ ఘంటలు" ఒక గొప్ప కృషి అని చెప్పకతీరదు."

—శ్రీవాత్సవ

## 16. ప్రజల మనిషి (తెలంగాణా నవల)

రచన: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

వెల : ఇతరులకు రు. 2-8-0 సభ్యులకు రు. 2-3-0

"1938 కి పూర్వమున్న తెలంగాణా గ్రామ జీవితంలోని వేర్వేరు వర్గాలను, వ్యక్తులను వారి సమస్యలను, జీవిత విధానాన్ని ఆళ్వారుస్వామి గారు కళ్ళకు కట్టినట్లు చిత్రించి కృతకృత్యులైనారు..........తెలంగాణా ప్రజా జీవితాన్ని కళ్ళకు గట్టినట్లు వర్ణించే నవలలు బహుకొద్ది. వానిలో యిది నిస్సందేహంగా ప్రధాన స్థాన మాక్రమిస్తుంది."

— విశాలాంధ్ర.

"....ఈనాడు ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం, జాతీయత స్వేచ్ఛగా అనుభవిస్తున్న ప్రజలకి ఆనాడు తెలంగాణా ప్రజలు పడిన బాధలు తెలియవు. ఈ నవల చదివితేమాత్రం ప్రతిపుటలోను తెలంగాణా హృదయం స్పందిస్తూ ఉన్నట్లు, భరించిన అవమానాల పరంపరతో పరాజయం పొందినాగాని పట్టుదలతో నిలచిన ప్రజలమనిషి పలుకరిస్తున్నట్టు కనిపిస్తుంది. "ప్రజల మనిషి" తెలుగు సాహిత్యంలో ఉత్తమశ్రేణికి చెందతగిన మరొకనవల."

—"శ్రీవాత్సవ" తెలుగు స్వతంత్ర.

"ఈ కథ పనికట్టుకు అల్లినట్లు ఎక్కడా అనిపించదు. నలిగిపోయిన రైతుల పాలేళ్ళ బాగోగులు వాళ్ళభాషలోనే, వాళ్ళచేతనే రచయిత చెప్పించాడు. దీనివల్ల వాస్తవికత చక్కగా పోషించబడింది..... మితిమీరిన భావోద్వేగాన్ని చూపించడానికికూడా రచయిత ప్రయత్నించ లేదు. కృత్రిమ సన్నివేశాలున్ను సృష్టించ లేదు."

—ఆంధ్ర పత్రిక.

"తెలంగాణా మనగుండెకాయ. రాజకీయంగా ఆ ప్రాంతపు కోటి మంది మన సోదరులు విడిగావున్న మన కండలో కండ, రక్తంలో రక్తం. కాని పెక్కు కారణాలవల్ల మన ఈ కండల సంగతి మనం తెలుసుకోలేక పోతున్నాం. ఈ ఆత్మబోధ కలిగించి తెలంగాణా తీరు తియ్యాలను సమగ్రంగా మన కట్టెదుట పెట్టే ఉత్తమ నవల "ప్రజల మనిషి"....తెలంగాణా విమోచనోద్యమంలోని అనేక ఘట్టాలు ఈ నవలలో చక్కగా వివరించ బడినవి. తెలంగాణా నిత్యజీవితానికి మచ్చుతునకలైన పాత్రలు యిందులో కలవు....అస్వతంత్ర తెలంగాణా సంఘ జీవితాన్ని ప్రతిబింబింపచేసిన ఈ ఉద్గ్రంథం ప్రతి గృహాన్ని, గ్రంథాలయాన్ని అలంకరించ గలదు."

—ఆంధ్ర ప్రభ.

"అందరికీ అభిరుచి కలిగించేటట్టు రాజకీయ వాతావరణంలో నవల వ్రాయడం అంత సులభం కాదు....రాజకీయాలగురించి వ్రాస్తూ ఉన్నప్పటికి ఏ పక్షాన్నీ బలపరచకుండా ఆయాసంస్థల వైఖరులు తేటపరుస్తూ కథ వ్రాయడం కష్టం. ఈ నవల రచించిన వారు కష్టసాధ్యమైన ఈ పనిని జయప్రదంగా నిర్వహించారు....తెలుగు సాహిత్యంలో కలకాలం నిలిచే నవల వ్రాసిన కొద్దిమందిలో—ఆళ్వారుస్వామిగారొకరైనారు. ఈ నవల చదవలసిన విధి ప్రతి సాహిత్య ప్రియుడి మీదను ఉన్నది."

—స్రవంతి.

"నేటి హైదరాబాదు చరిత్ర వెనుక పుటలు తిరుగవేస్తే హృదయ విదారకమైన ఎన్నో సంఘటనలు గోచరమౌతాయ్. చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించ వలసిన 'ప్రజల మనుషు'లైన వ్యక్తులు ఎందరో గోచరమవుతారు. 'ప్రజల మనిషి' అనే యీ నవల ఆ పరిస్థితులనూ, ఆ వ్యక్తులనూ, వారి చర్యలనూ, చాలా యథార్థంగా, హృదయంగమంగా చిత్రించిన ఉత్తమశ్రేణి సాహిత్య సృష్టి....చెత్త శృంగారానికిగాని, స్టంటులకు

గాని తావీయక యథార్థవిషయాలను ఆధారంగా తీసుకొని ప్రబోధాత్మక మైన చక్కని నవలను సృష్టించిన శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారు నిజంగా అభివందనీయులు."

—గుండుసూది.

## 17. సెలయేరు (జానపద గేయ సంపుటి)

సేకరణ: శ్రీ నేదునూరి గంగాధరం

వెల: ఇతరులకు రు. 1-12-0 సభ్యులకు 1-8-6

"జానపద వాఙ్మయ సేకరణకై అధికముగా కృషిచేయుచున్న వారిలో శ్రీ నేదునూరి గంగాధరంగారు ముఖ్యులు. వీరు దాదాపు ముప్పది సంవత్సరములనుండి చేసిన కృషి ఫలితమే ఈ గ్రంథ మనిన దీని విలువనుగూర్చి చెప్పుట చాలును. తెలుగు దేశపు హృదయాన్ని, దాని మాధుర్యాన్ని చవిచూడ దలచిన ఈ సెలయేరు చాలును. ఇది ఏడుపాయలుగా సప్తరుచుల నీనుచున్నది. ఇందలి తీయతీయ తేనెల ఒలుకు పాటల భావ సంపద ఇచ్చు వినోద, విజ్ఞానము ప్రత్యేకముగా పేర్కొన వలసిన పని లేదు....గ్రంథాలయము మొదలగు సంస్థలేగాక ఇది ఇంటింటా వెలయ వలసిన గ్రంథము."

—గోలకొండ పత్రిక.

"....ఈ జానపద సాహిత్యం ఆంధ్రావళికి చేకూర్చి, అందించ డానికి బద్ధకంకణులలో శ్రీ నేదునూరి గంగాధరంగారు 'కనిష్ఠికాధిష్ఠితులు'. వీరు సేకరించిన అపార గేయ సంపదలో కొంతను....బాల, స్త్రీ, ఉత్సవ, భక్తి, గృహసేవ, శృంగార, పాటకజన సారస్వతాలనే ఏడుపాయల 'సెలయేరు'గా అందించి ప్రశంసనీయతను పొందారు.... సుందర జానపద నృత్య ముఖచిత్రంతో మరికొన్ని చిత్రాలతో అందాలు

పొర్లిపారే ఈ 'సెలయేరు'కు శ్రీ బి. రామరాజుగారు జానపద సాహిత్య చరిత్రను రేఖామాత్రంగా చిత్రించే సంపాదకీయంతో దారిచూపి నారు....ప్రతి సహృదయుడూ, ప్రజావాదీ, ప్రతి ఆంధ్రుడు, తాగి, తనిసి, తలకుపోసుకోవలసిన సెలయేరిది."

—ఆంధ్ర ప్రభ.

"శ్రీ నేదునూరి గంగాధరంగారు సుమా రిరువై ఏళ్ళనించి జానపద గేయాలు సేకరిస్తున్నారు....వీరి జీవితశక్తి యావత్తు ఈ పాటల సేకరణకే ధారపోశారు....గేయసంకలనంలో....రత్నాలవంటి జానపద గేయాలెన్నెన్నో కనిపిస్తున్నాయి, శ్రీ బి. రామరాజుగారు వ్రాసిన ప్రవేశిక జానపదగేయ సారస్వతాభిమాను లందరు తప్పక పరిశీలించ దగినది."

—ఆంధ్ర పత్రిక.

"తెలుగుదేశం వివిధ ప్రాంతాలలో విస్తరించి వున్న జానపద గేయాలను సేకరించడానికి ఆధునిక కాలంలో చాలామంది రసజ్ఞులు తీవ్ర కృషి చేస్తున్నారు. అట్టివారిలో శ్రీ గంగాధరంగారు అగ్రస్థానం వహిస్తా రని నిస్సందేహంగా చెప్పవచ్చు. జానపద సంకలన వారికి తపస్సు వంటిది....వీరి సేకరణలో జానపద గేయాలను ఏరి శీర్షికల క్రింద విభ జించి హైదరాబాదులోని దేశోద్ధారక గ్రంథమాలవారు ప్రకటించారు.... యింత కృషిచేసిన శ్రీ గంగాధరంగారున్నూ యింతమాత్రమైనా జానపద సాహిత్యాన్ని గ్రంథరూపంగా పాఠకలోకానికి అందిచ్చిన దేశోద్ధారక గ్రంథమాల వారున్నూ మిక్కిలి అభినందనీయులు."

—కృష్ణాపత్రిక.

"ఎంతో కష్టపడి, గంగాధరంగారు సేకరించిన ఈ పాటలలో ఏడు విభాగాలున్నాయి....ముఖ్యంగా గృహజీవన సారస్వతం, అత్త

మామలు, బావవదినెలు, మరదలు మొదలైనవారి మధ్య జరిగే పరియాచ కాలను, హాస్యాన్ని వర్ణించే పాటలు విస్తారంగా ఉన్నాయి...."

—విశాలాంధ్ర.

"శ్రీ నేదునూరివారు సుమారు పాతిక సంవత్సరాలనించీ మన జానపద గేయాలు సేకరిస్తున్నారు. వీరి కృషి దేవేంద్ర సత్యార్థి మొదలైన ప్రముఖ గేయ సంకలన కర్తల ప్రశంస లందుకొన్నది....ఆయా విభాగా లలో వీరు ప్రచురించిన గేయాలలో స్వచ్ఛమైన జానపద ధోరణి జాలు వారు తున్నది....మొత్తంమీద ఈ గేయసంపుటిలో స్త్రీల సారస్వతంలో సర్వోత్తమమైన గేయాలు కన్పిస్తున్నాయి. ఈ గేయసంపుటికి శ్రీ బి. రామ రాజుగారు వ్రాసిన ఉపోద్ఘాతం చక్కగా ఉంది. ఇది గేయ సారస్వతాభి మానులందరు తప్పక పరిశీలింపదగినది."

—భారతి.

"....చిరకాలంనుండి వేలకొలది పాటలూ, కథలూ, అవీ సేక రించిన నేదునూరి గంగాధరంగారి కృషికి గ్రంథరూపంబిస్తూ బి. రామ రాజుగారు చక్కని సంపాదకీయం వ్రాశారు....ఈ సెలయేరు....యేడు పాయలుగా ప్రవహించింది. ఒక్కొక్క శాఖలోని ఒక్కొక్కపాట ఒక్కొక్క వజ్రపు తునక."

—"శ్రీవాత్సవ" తెలుగుస్వతంత్ర.

"ఏదేశపు సాంఘిక జీవితాన్ని సమగ్రంగా తెలుసుకోవాలన్నా ఆ దేశపు జానపద సాహిత్యం అవలోడన చెయ్యాలి....ఆంధ్ర జానపద సాహిత్యం అపారమైనది. దీనిలో ప్రత్యేకకృషి చేసిన పండితులు శ్రీ నేదునూరి గంగాధరంగారు....ఏడు విభాగాలుగా జానపద గేయాలు క్రోడీకరింపబడ్డాయి. ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని వెలువరించిన ప్రచురణ

కర్తలు అభినందనార్హులు. ప్రతి ఆంధ్రుడూ కొని చదవడమే గాక—పాడుకోవలసిన పాటల గ్రంథం యిది."

—ప్రజామత.

"....ఇందలి పాటలు ప్రతియొక్కటి సహజంగా సామాన్య ప్రజానీకం పాడుకొంటున్నవి.....ఈ గేయాల సేకరణలో జరిపిన కృషి ప్రశంసనీయము. ఇందలి చిత్రాలు ప్రత్యేక ఆకర్షణ."

—గృహలక్ష్మి.

## 18. జీవనరంగం (15 ఏకాంక దృశ్యనాటికలు)
### (15 గురు రచయితలు - 2 భాగాలు)

వెల : ఇతరులకు రు. 3-8-0 సభ్యులకు రు. 3-1-0

"....వివిధ రచయితల ఏకాంక నాటికలు జీవన రంగం అనే పేరున రెండు సంపుటాలుగా ప్రచురించారు. పదిహేనుమంది రచయితలు నాటికా రచనలో కనబరచిన వైవిధ్యం చదువుకోవడానికే కాక, ప్రదర్శనలకుకూడా యోగ్యంగా ఉంది. ఈ రచయితల్లో తెలంగాణాలో యీనాడు గద్య, పద్య రచనల్లో ప్రసిద్ధులయిన ప్రముఖు లందరూ ఉన్నారు."

—"శ్రీ వాత్సవ" తెలుగు స్వతంత్ర.

"దేశోద్ధారక గ్రంథమాలవారు తెలంగాణా యువకుల రచనలను ఆంధ్ర సారస్వత లోకానికి పరిచయము చేయడానికి ఉద్దేశించిన పుస్తకాలు యివియని తెలుస్తున్నది. ఇది సంతోషకరమగు విషయము."

—గోలకొండ పత్రిక.

"ఉత్తమ గ్రంథాలను ప్రచురించి సాహితికీ, పాఠకులకూగూడా సేవచేస్తున్న ఈ ప్రచురణ సంస్థవారు....వివిధ రచయితల రచనలను

సంపుటీకరించి ప్రకటించడంలో ప్రత్యేకత గడించారు.... ఒక్కొక్క నాటిక ఒక్కొక్క ప్రత్యేకతను తెలుపుతున్నది."

—ప్రజామత.

"ప్రజల మనిషి", "ఉదయ ఘంటలు" వంటి ప్రయోజనాత్మకమైన గ్రంథాలు ప్రచురించిన దేశోద్ధారక గ్రంథమాలవారు ఈసారి నాటిక ప్రచురణలో కొత్త పోకడలు త్రొక్కారు.... ఈ ఏకాంకికలన్నీ ప్రజల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను వ్యక్తీకరిస్తున్నాయి. ఇతివృత్తంలో, రచనా రీతులలో వైవిధ్యం ఉండేటట్లు చక్కటి వాటిని ప్రకాశకులు ఎన్నుకొన్నారు."

—ఆంధ్ర ప్రభ

".... నాటిక లన్నీ ప్రత్యేక ప్రయోజనాలకోసం వ్రాసినవి. రంగస్థలం మీద రక్తికడ్తాయి. ఏకాంక దృశ్యకావ్యాల అవసరం ఎంతైనా ఉన్న ఈ కాలంలో ఇది ప్రజాదరణ పొందగలదని ఆశించవచ్చును.

........ ఈ నాటికలన్నీ సంపుటాలుగా వెలువడిన కారణంచేత తెలుగునాట ఈనాడు దినదిన ప్రవర్ధమానమవుతూన్న నాటక కళా ప్రోత్సాహానికి తోడ్పడుతున్నాయి. వివిధ కళాశాలలు, యువజన సంఘాలు, సారస్వత సమితులూ, అమెచ్యూర్ నాటికలు ప్రదర్శించాలని కుతూహలం కనపరుస్తున్నాయి. కాని వాటికి తగిన మంచి నాటికలు సేకరించ లేక పోతున్నాయి. ఈ కొఱత తీర్చడానికి "జీవన రంగం" వంటి నాటికా సంపుటాలు ఎన్నివచ్చినా స్వాగత మీయవలసిందే."

—స్రవంతి.

".... వివిధ వృత్తులలోనుండి సాహిత్య కృషి చేయుచున్న యువ రచయితల నాటికలను రెండు సంపుటాలలో ప్రచురించటం ప్రశంసార్హమైన విషయం.... నేటి ఆర్థిక, సాంఘిక సమస్యలెన్నో ఈ నాటకాలలో

చిత్రించబడినయి....వివిధ సామాజిక సమస్యల వెలువరిస్తూ వివిధ రచనా రీతులను తెల్పుతూ, పలు నవయువక రచయితలను ఆంధ్ర దేశానికి ఎరుకచేసిన దేశోద్ధారక గ్రంథమాలవారి కృషి అభినందనీయము."

—కృష్ణాపత్రిక

## రాబోవు ప్రచురణలు

1. ఆందోళన (ప్రధాన రాజకీయ ప్రణాళికలు)
2. కూర్చిన ముత్యాలు (ప్రముఖుల ప్రవచనాలు)
3. శ్రీ భాగి నారాయణమూర్తిగారి రచనలు
4. శ్రీ పొట్లపల్లి రామారావుగారి కథలు, నాటికలు
5. తెలంగాణా కవిమిత్రులు
6. గంగు (నవల)
7. అఖిల భారత తస్కర మహాసభ
8. నాలోనేను
9. ప్రాచీన తెలంగాణా
   (రాజకీయ, చారిత్రక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు)
10. విజ్ఞాన శాస్త్రము
11. తరంగాలు
12. స్త్రీలు—సమాజము
13. బుచ్చిపాపలు (కథలు)
14. భారతీయ కళావికాసము
15. సామెతకథలు



# నూతన ప్రచురణలు

| | సభ్యులకు తగ్గింపు @ 12½% | ఇతరులకు |
|---|---|---|
| 13. జైలులోపల (కథానికలు) | 0 9 3 | 0 10 0 |
| —శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి | | |
| 14. నా గొడవ (గేయాలు) | 1 5 0 | 1 8 0 |
| —శ్రీ కాళోజి నారాయణరావు | | |
| 15. ఉదయఘంటలు (గేయాలు) | 1 15 6 | 2 4 0 |
| — 56 అఖిలాంధ్రకవులు | | |
| 16. ప్రజల మనిషి (నవల) | 2 3 0 | 2 8 0 |
| —శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి | | |
| 18. సెలయేరు (జానపదగేయాలు) | 1 8 6 | 1 12 0 |
| —శ్రీ నేదునూరి గంగాధరం సేకరణ | | |
| 17, 19. జీవనరంగం (ఏకాంక దృశ్య నాటికలు 2 భాగాలు) | 3 1 0 | 3 8 0 |
| 20. ప్రజలు - ప్రభుత్వం | 1 1 6 | 1 4 0 |
| — కౌంట్ లియో టాల్‌స్టాయి | | |
| 21. పునర్నవం (గేయాలు) | 1 3 6 | 1 6 0 |
| —శ్రీ దాశరథి | | |
| 22, 23. పరిసరాలు (రెండు భాగములు) | 3 1 0 | 3 8 0 |
| —34గురి రచయితల 34 కథలు | | |

## త్వరలో

1. శ్రీ పొట్లపల్లి రామారావు గేయాలు
2. అఖిలభారత తస్కర మహాసభ (సభాచర్యలు)
3. పద్య సంకలనం

దేశోద్ధారక గ్రంథమాల

3-5-1027 నారాయణగూడ, హైదరాబాదు.